...గుంటూరుసీమ చేరినది దానిని...అందుకొంటిని, దానిని చదివిననాటినుం యు నాకు కలిగిన యానందమును మీకు వ్రాయజాలను. మీరు వ్రాసిన వ్రాతకు నూ మాగుంటూరులో అన్యాయముగా అక్రమముగా జరిగిన అల్లరికి యేమి భేదము లేక తమరు వ్రాసిన పుస్తకమువల్ల మాగుంటూరులో 'సత్యవాదుల,మనియు,...దొంగ' రలు పెట్టుకొని సంచరించుచున్న వారియొక్క డంబము అణచినది అని నేను రు ఢిగా వ్రాయుచున్నాను. మీయెదుటపక్షము వారియొక్క...కట్టివేసినది ...,

11-4-13 గుంటూరు. మాటూరి బసవయ్య.

చ॥ తిరుపతి వేంకటేశ్వరులు తెంపరులై మనకొప్రపుంగ వీ
శ్వరుల వృథాగ దూఱిరని వ్రాసెడువారికిఁ దారతమ్య సం
కరముగఁ బల్కువారలకుఁ గాఱులఁ బత్రికలందుఁ బేర్లు ధీ
వరులకు 'రామకృష్ణ,యన వచ్చును గుంటురుసీమ నెంతయున్.

ఉ॥ ఎక్కడి వేంకటేశ్వరుఁ డిఁ కెక్కడి తిర్పతి! రామకృష్ణులే
దక్కఁ గనీరువారిఁ, దగఁదక్కఁగ నిచ్చినఁ గొప్రపుంగవుల్
నిక్క విదల్పఁగా గలరు, నిశ్చయమం చని వ్రాయుచున్న యు
వ్యాకులు వ్యర్థమున్ నలుపువారల మిమ్ముల నెన్నశక్యమే. ౨

సీ॥ భువిమహాకవులతోఁ బోరిననసుభవింపక తప్పనాని యంచుఁ బల్కువారు
తిరుపతి వేంకటేశ్వరు లనఁ దిరుపతి వేంకటేశ్వరు లంచు వినుచువారు
ఆత్మకూరాదిరాజాస్థానగతకథాభాగంబులను జ్ఞప్తిఁ బట్టువారు
ఎదిరింప మునుపు వాయినిఁగట్టినట్టి పెద్దలచరిత్రలు మదిఁదలఁచువారు ౩
తే॥ గీ॥ నిన్నగాకనె మొన్ననిందించినట్టి, రామకృష్ణులు దృష్టాంతరంబటంచు
సారెఁదలపోయఁ జేసె గుంటూరుసీమ,విబుధమండలమందు వ్యాపించువేళ.

మ॥ ఎలమిన్ గొప్రపుజల్లిసీమ,యును మీ రీవ్రాయు గుంటూరు సీ
మలఁ జేఁ బట్టి నిజంబుఁ దేల్చుకొని నమ్మన్ వచ్చు సత్యంబు ని
శ్చలచిత్తంబున, నంచుఁ బూనితిమి యోసాహిత్యయుక్తుల్ ? నిరూ
గులునన్ వైదికులన్న నెక్కటియె మాకున్ బెక్కు లింకేటికిన్. ౪

సోదరకవులు { దూపాటి తిరుమల శేషాచార్యులు.
వేంకటరమణాచార్యులు. 5-5-13.

...గీరత, గుంటూరుసీమలయొక్క భాగములచ్చుముగిసినతోడనే నాకుబంపుటకొరకు, నాపేరునురిజిష్టరుజేసికొని...కృతజ్ఞతాబద్ధునిగావింపవేడుచున్నాను...నిన్నటిదినమున, కొప్పరపువెంకటసుబ్బారాయ, కవిగారీగ్రామ మకుదేరగా గుంటూరుసీమవలన, వారి సుస్వభావము నెరిగినవాడనగుటచే, అయ్యా? గుంటూరుసీమందిలకించితిరా? తమజల్లిసీమయేమైనదని యడుగ, నేనేమో, ప్రగల్భములంబలికి, జల్లిసీమ, నెలదినములలో వచ్చుననిరి...గుంటూరుసీమయొక్క పూర్వరంగమును తనివిదీరగాంచితి, కొప్పరపువారి యసత్యప్రకటనలును, తమసత్యనిర్ధారణలును, మధురసుధాధారలౌలుకు తమకవితానైపుణ్యమును నాకేగాక సర్వాంధ్రులకమందానందము నొనరింపక, మానవని ఘంటాపథముగఁ జెప్పకతప్పదు

మాకరాజు నారాయణరాజు. గుంటూరు 17-4-13

గవర్నమెంటుట్రయినింగుస్కూలు.

...గుంటూరుసీమ, చదివితిని. అఖండమగు మీకవితయందలి కథావిషయగమనము అత్యద్భుతముగనున్నది. ఈకథా సంవిధానపరిపోషణ ఆంధ్రవాఙ్మయమునందు ఒకరిద్దఱు సనాతనకవులయందు తిక్కన, పినవీరభద్రుఁడు, తక్క లాఁతి యెడలఁగనుపట్టదు..." రుక్మామాఙ్ఙ తిరువల్లిక్కేణి 2-7-13.

రాయప్రోలు సుబ్బారావు.

...గుంటూరుసీమ పూర్వరంగమను గ్రంథమును... నందుకొంటిమి...సదరుగ్రంథము మాసంశయములను బోగొట్టి నిజమైనవిషయములను దెలియఁబఱచినందులకు మేమెంతయుఁ గృతజ్ఞులము. "నిజమునిలకడమీదదెలియు" ననులోకోక్తికల్లగాదుకదా? వేయేల! సర్వవిధముల యీగ్రంథము సప్రమాణముగాను, పక్షపాతరహితముగను, చరిత్రాత్మకముగను, వ్రాయఁబడినదనుటకు సందేహము లేదు. దీనింగాంచియైనను గల హాశనులు మౌనముద్రను వహింతురుగాత.

Secunderabad Daccan. ఏ. యస్. రామకృష్ణులు. 30th March 1913

ఉ॥ చూచితినండి సీమ, పరిశుద్ధవచోనిచయాభిరామ, వి
ద్యాచతుర ప్రమోదధనధామ, యథార్థ కథానకోక్తి ము
ద్రాచణకామ గాత్రివ్యకవి తంత్రబహిష్కృతి దేవభామ, యం
బాచరణాంబుజాతరసబంభర శ్రీపతి వేంకటేశ్వరా.

శా॥ ప్రాచీపశ్చిమదిక్ స్థితాంధ్రకుకవిప్రాణానిలాహీంద్రమై
వాచాదోషవిషాక్తరిక్తజనతావక్త్రావటాసారమై
భూచక్రోపకృతిప్రసూనలతికాస్ఫూర్జద్వసంతర్తువై
తోఁచెన్ జుండి చరిత్రయుగ్మము కవీంద్రశ్రేణి చూడామణీ. ౧

కం॥ గిరతమా! యత్యద్భుత, ధీరులవసఁ దేల్చె 'సీమ' తేల్చె సమోహార్థ
శ్రీరాజులపస; నార్యులు, చారుప్రజ్ఞులు భవత్ప్రశాంతికి మెచ్చన్. ౨

భాషాత్రియశాలి. 22-4-13 గుంటూరు అగ్రహారం

D. Ramaswami Sastri.

ఉ॥ దైవముఖమ్ముఁ జూచి సమతన్ వహియించి చరిత్రయుగ్మమున్
భావవిదుల్ సెబాసనఁగ వ్రాసితి రౌనను శైలిఁ దాము, మీ
చేవ యథార్థ గౌరవ విశిష్టము 'శిష్టజనైకవేద్య' మో
దేవ? భవత్ప్రతాప మతి దృశ్యదరిప్రతిబంధకం బహో.

గీ॥ సకలలోకమ్ములకు సత్యసత్త్వ మిట్టి, దనుచుఁ దేల్పంగఁ దాము వ్రాసిన చరిత్ర
'సీమ' నాకొండు ప్రతి వీ.పి చేరఁజేయ, వెంకటకవీంద్ర మ్రొక్కెద వేనిధములఁ.

మాగంటి వీరరాఘవశాస్త్రి. 24-8-13

...గుంటూరిసీమ, యనువివాదాంశగ్రంథమును నామూలాగ్రముగా చదివితిని సోదరకవులకును మీకును గలిగిన వివాదసందర్భములో మీతప్పిదిలేనట్టు యీగ్రంథమువల్ల యథార్థము బయల్పడినది...ఉత్తరరంగము గూడ...బంపగలందులకు ప్రార్థించుచున్నాను, ఖరీదు ఎంతయున్నను నరేమందుంపుమని సెలవిచ్చిన బంపెదను.

చించినాడ వేంకటరత్నశాస్త్రి. బెజవాడ 29-4-13

గీ॥ సిరులఁజెన్నొందు గుంటూరుసీమ ప్రథమ, రంగమును గాంచితి స్వాంతరంగుఁ డైతి,
వెలయనుత్తరరంగము వేమవరశతావధానను వీ. పి. గా దయనుబంప,
గోరివందములు సేతు, కోర్కె మీఱ.

చివుకుల పిచ్చయ్యశాస్త్రి.

స్కూల్ల సూపర్ వైజరు, పొదిలె, నెల్లూరుజిల్లా, ముకాం తర్లుపాడు 21-7-13

చ॥ కనుఁగొనలేక మీ ప్రతిభఁ గల్లయు లల్లిన ప్రల్లదంబులన్
గనివినియుబ్బు పండితుఁ డొకండు శతంబున నైన నున్నె? యుం

డిసనలదిక్కుటాహముల నిండి పయిన్ బయిఁ బొంగినింగిఁ బా
ఱిన భవదీయకీర్తిలహరిన్ నిలువంగ నెవారలోపెడిన్. ౧

మ॥ అనదలు మూళ లేరొకొ సహాయులవై తమనోటియూసు పో
వ నుడువు పురిత్త పలుకులను వంచనకల్గునె? "యూరకుక్కలా
సీనయెడ జంగమయ్య కిలఁజేటగునే?", బుధులేరు విన్న నీ?
యనుచుఁ జకారగుళ్లోఁ సగరా? నగరా? మొగమెత్తనిత్తురా. ౨

ఉ॥ "అక్కనమాదనల్ చెలఁగునందల మెక్కి సరప్ప సాటికిన్
నిక్కుచుఁ జెర్లఁ కట్టపయి నిస్త్రపతన్ వెస నిల్పు మాడిక్కఁ, దా
రొక్కట రెంటఁ జామరులయొద్ద రహఃకుహనావధానమున్
జక్కనొనర్ప రన్నఁ దమసాటికి వత్తురె తక్కఁగైనరుల్. ౩

చ॥ అనవసరంపుఁ జివ్వకు సహాయులవై విఫలోరుశాఖ దార్
పెనఁగొని ముష్టడించు పెనుపేరుల నీటఁగలంచినట్టి రీ
వినయము లేక శాలు లిఁకెఁ బెగ్గల వీడి రహస్యలంబులన్
గొనఁగుటనూని యిష్టమగు 'గుంటురిసీమకు' మ్రొక్కఁగాదగున్. ౪

క॥ సారతరహృద్యపద్యను, ధారసనిష్యంది గిరతముబలెనరయున్
మీరఁ చిత, సీమ, సరసం, బై రాజిలె నఖిలనూరులౌనని మెచ్చన్.

రామడుగు సీతారామశాస్త్రి. 14-1-14

..."గుంటూరిసీమ" చేరినది.., మిక్కిలి శ్రమకోర్చి ఆయాపత్రికలయందలి విషయములను ముందెన్నఁడో గ్రంథము వ్రాయవలయునని సేకరించి గ్రంథముతయారు చేసినందువల్ల తమకు 'చాణక్య' లనుబిరుదు సార్థకమైనదానినిగా దలంచుచున్నాను. తాము నిజములని వ్రాయించిన విషయములెల్లను నేను పత్రికలయందు చూచిన వగుటచే యిందుమీరెంతమాత్రము అనృతము వ్రాసితిరని నేతలఁపను.

వేమూరి సుబ్బరామశాస్త్రి. ఆళ్లమూడి 6-6-13

సీ॥ అంతియే కాక నారాయణశాస్త్రి మొకఁడు, బయలు వెడలి గుంటురిసీమపటిమ నెల్లఁ
జిలచి చెండాడి వెనుఁజూపఁ జేయునట్టిపయిఁ, కేమి పురికెక్కు గుంటూరుసీమ పగ్గ
గీ॥ కాన నారాయణశాస్త్రమ్ము గ్రమ్మియాటు, మూఁడు సేయక మున్నె సమ్మోదమలర
నారయన్ గోరినాఁడఁ గుంటూరిసీమ, లోని యుత్తరరంగమ్ము లోకవినుత.

తెలికెపల్లి రామచంద్రియ్య. 25-2-14

శ్లో॥ ... పూర్వరంగ మమలం దృష్ట్వాఽఖిలం మానవ
ప్రాస్వంతేమోదముపైతి సంత్యజతిశాఖాపక్షపాతాదికం॥

శ్లో॥ కాత్యాయన్యై సమస్తం పరికథిత మను జాత్యైక దేశ ప్రగల్భా
న్యాయాశాఖాభిమాన ప్రకటితవశగాశక్తదౌర్జన్యజన్యం...''॥

శ్లో॥ ... శాఖాం విజానాతి హి నీతి బాహ్యకః॥

శ్లో॥ రాజ్ఞాంగృహేషుధనశూన్యగృహేషుకుర్వంత్యుద్వాహకాంశ్చవిభవైర్ఘ్నవః
స్స్యరేవ,తద్వతర విత్వరచనాసువసంతిబహ్వ్యః పాండిత్యవైభవమిదంవ
చారణీయం॥ భమిడిపాటి అయ్యప్పశాస్త్రి. 4-4-1913

మండవల్లి లింగాలపోష్టు, కృష్ణాజిల్లా.

మ॥ హరనారీ చరణాబ్జ చింతనమరందాసక్త హృద్భృంగనీయు
త్తరరంగం బెపుడబ్బునోయనుచు నత్యాసక్తుండై వేంకటే
శ్వరదైవజ్ఞుండు దానినే మదిసదా భావింపుచున్నాడు కా
నరయంబొప్పగు బంప వేడెదం గవీంద్రా! నీముద్రణంబైనచోన్.

ములుకుట్ల కోటీశ్వరః. 9-7-13 యింకొల్లుగ్రామం

..."గుంటూరుసీమ" యనుగ్రంథములు ఆరుకాపీలు V.P. ద్వారా తగు నంతతొందరలోనాఅడ్రసుకుంబంపంబ్రార్థించెదను. ఉభయభాషాకవిత్వమహాకవు లగుతాముప్రకృతచర్యనంతయుకలికాలముపైదోసివేసి..నంతలో...మాహాత్మ్యము... అధికమగుననియు.పెద్ద లనుకొనుటను విని విశదపఱచుకొంటిని

మన్యం సీతారామయ్య. 2-4-13
టీచర్. టవును హైస్కూల్ గుంటూరు

...గుంటూరుసీమనుచూచినాను అందునిజానిజములు తప్పకతేలుచున్నవి. యిట్టి సత్యమును దెలుపు యీపాత్రము దేశమంతటను వ్యాపింపచేయుటకు భగవంతుని సదాప్రార్థింపుచున్నాను.బొడ్డుపల్లి శేషయ్య.బోర్డుస్కూలు,మాష్టరు.
మందపాడు 27-3-13

స్థాలీపులాకన్యాయమునఁ జూపితిమే కాని మావద్ద నున్నసామగ్రిలో నెన్నవవంతుగాని కైకొనలేదు, సరికదా? వారినామములుగూడ నుదాహరింపలేదు, పాడుకర్శ్మము ప్రతివిషయమునకును గ్రంథవిస్తరభీతియే మమ్ము వెనుదీయించుచున్నది, పీఠికలో నక్కడక్కడ నుదాహరించిన ప్రతివిషయమును నేదోయొకటితక్క నిక్లే లవలేశముగాఁ గైకొనినదియే కాని యేదియును బూర్తిగా కైకొననేలేదు, ఈలోటు రాఁబోవు 'సమసార్గ'గ్రంథపీఠిక తీర్పఁగాక యని యింతతో విరమించుచు నిఁక నిందలితప్పులం గూర్చి కొండొకచర్చించుచున్నారము, ఎచ్చటనేని యతిప్రాసములు, వ్యత్యస్తము లగుటంగూర్చి ప్రాజ్ఞులు గణింపరు, అది భ్రాంతిమూలకము, అనివార్యము, దానింగూర్చి యితరులకు గోచరించినంతగ్రంథకర్తకు గోచరింపదు, ఆవిషయముకనిపెట్టుటకుఁబాండిత్యముతో నవసరములేదు, యతిస్వరూప, ప్రాసస్వరూపములను దెలిసికొనుటకు సరిగా 5 నిమేషములకన్న నెక్కుడుకాలము పట్టదు. అట్టి స్వల్పవిషయమును గూర్చికూడ దినంతులు గొట్టువారు నేఁడు బయలుదేఱుటచే నీకాలముయొక్కదుస్థితికిఁ జాల విచారపడవలసియున్నది. పత్రికృశము, హితకారిణీమనోరంజనులు మాకుఁదప్పులు చూపవలయునని యెంచి పైరీతి తప్పులనే యన్వేషించి యవాకుచవాకులను వదరుచున్నవి, ప్రథమముద్రణము నందలి స్ఖాలిత్యముల నిటీవల సవరించితి మను మాటకూడఁ బాటింపక యీపత్రిక లూరక ప్రోఁగ మొదలిడుట మఱియును విచారణీయము, స్వాత్మదౌర్బల్య ప్రకటనమునకై తమంతఁదామే పలువిధముల సాక్ష్యముం నిచ్చుచున్న యీపత్రికలు చూపు తప్పులెట్టివో తెల్పుటకుఁ బ్రకృతగ్రంథమునుండి కొన్ని యుదాహరించుచున్నారము.

‘‘వి। ద్యామహేంద్రులు పశ్యశబ్దముపైని సారెకుఁ గొందఱు

ఇందు విశ్రమము పొరఁబడినది, దీనింబట్టి యజ్ఞతను సమర్థింపనెంచుచో తి॥ వెం॥ కవులకు, యతియననేమో తెలియదని కాని, అక్షరజ్ఞానము లేదని కాని, మొఱఁగవలసి యుండును. ఈమాట విశ్వసింపఁజేయుట కడుఁగష్టము, ఇట్టి ప్రయత్నమునకుఁ బాటుపడువారి నేమనవలయును? మఱియు.

డం। బలరు నియోగి వైదికులు నందుచునుందురు.

(పూర్వరంగము 4వ పుట 6వ పద్యముచూ)

ఇందుఁ బ్రాసము పొరఁబడినది, పైపద్యము రేఫప్రాసకము, కావున, అల

రు, ఒరయు, అందు, ఒందు, గా మార్చికొన్న సరిపోవచ్చును, యతివిషయమున 'వశ్యశబ్దము తప్పుగాదని కొందఱు' అని సవరించుకోవలెను. ఇట్టి భ్రాంతి ప్రయుక్తములగు స్వల్పలోపము లెందఱచేతనో యెన్నిసారులో సంస్కరింపఁబడుచువచ్చినను భారతాదులయందుఁగూడ నిప్పటికిని క్వాచిత్కముగాఁ గానవచ్చుచున్నవన నస్మదాదులలెక్కయేమి, భ్రాంతినశించినఁగాని యీలోపములునశింపవు, అది ప్రపంచముతోపాటుండఁదగినది, బ్రహ్మాదులుగూడ దానికిదాసులు, ఇదివిషయాంతరము, ఇంకనువ్రాయవలసినవి చాలనంశములుగలవు, వ్రాసిన వానివలనఁ దక్కినవి యూహించుకొందురుగాక, పూర్వరంగోత్తరంగములలో సూత్రప్రాయముగా నాయీవివాదకు సంబంధించినయావద్గాథయు నిముడ్పఁబడినది, ఆది ఆసనచర్చయు, అంతము వేమవరావధానప్రయుక్తమగు సమ్మానమును సనియెఱుఁగునది, ఆసమ్మానసమయమునందలి పద్యములుమాత్ర ముదాహరించి విరమించుచున్నారము.

చ॥ తిరుపతివేంకటేశ్వరసుధీకరయుగ్మ మలంకృతంబు చే
సిరికద? కంకణంబులఁ బ్రసిద్ధులు నల్వురు చెన్నయాము ల
బ్బురమును సంతసంబు నెదఁ బొంపిరివోవఁగఁ జూచుచున్నయం
దఱనయనంబులం దవి కనంబడుచున్న వదేమి చిత్రమో.

తి॥ శా॥

ఉ॥ ‹గోడకు వెల్ల వేయు టది గోడహితమ్మును గోరి కాదు మో
మోడి భవత్కుతూహలము నోమఁగ సింగపుమేల్మిబంగరుం
బోఁడిమికంకణమ్ము లివి పూనుచునుంటిమి యిందు కర్హుఁడౌ
వాఁ డెవఁడో? యెఱుంగఁగలప్రాజ్ఞులుమ్రొక్క్యలునేఁడు చూడఁగన్

వెం॥ శా॥



శ్రీమత్పరదేవతాయై నమః.

# గుంటూరిసీమ, ఉత్తరరంగము.

శ్లో॥ ఉన్నతం పద మవాప్య యో లఘుః హీలయైవ స పతే దితి ధ్రువం
శైలశేఖరగతో దృషత్కణః, చారుమారుతధుతః పతత్యధః॥ ౧
(రసగంగాధరము చూ)

శ్లో॥ యద్యపి నదతి సరోషం, మృగపతి పురతోఽపి మత్తగోమాయుః
తదపి న కుప్యతి సింహో, విసదృశపురుషేషు కః కోపః॥ ౨
(అలంకారశేఖరము చూ)

శ్లో॥ సంత స్సచ్చరితోదయవ్యసనినః ప్రాదుర్భవద్యంత్రణా
స్సరత్రైవ జనాపవాదచకితా జీవంతి కృచ్ఛ్రం సదా
అవ్యుత్పన్నమతిః కృతేన న సతా నైవాసతా వ్యాకులః
కృత్యాకృత్యవివేకశూన్యహృదయో ధన్యో జనః ప్రాకృతః॥ ౩
(కువలయానందము చూ)

(సదుపదేశము)

చ॥ వలదు నియోగివైదికవిభాగము, కొంపలు ముస్గదాన, వ
ర్తిలుఁడు యథానుపూర్విగ, విధేయులు విద్యకుఁగంటు శాఖమున్
జల మిడ నెంచి సగ్రంథమును బాయఁగఁ ద్రోచు టదేటి తెల్వి, పూ
ర్వులహృదయం బెఱుంగుఁ డని బోధ యొనర్పఁ గదమ్మ శాంకరీ॥ ౧

చ॥ వలదు నియోగి వైదికవిభాగము వల్వ దసత్యగోష్ఠి, ము
గ్ధులను విదగ్ధులన్ సరిగఁ దూఁచెడి తక్కెడకై ప్రియత్నమా,
వల దపలాపముల్ గిలుక వల్వదు వల్వ దటంచు నంబికే
వలదురితంబుగా నడుచువారితలకాల్ల కురిన్ ఘటింపుమీ॥ ౨

చ॥ వలవనికోర్కులం బడినవా రెవరున్ దుద నెగ్గ లేద, యీ
కలియెడఁగూడ సత్యమునె కాంతురు గాని యసత్యమన్నఁ బె
ద్దలకుఁ బ్రపత్తి లేదు ఋజుధర్మము పట్టి చరింపుఁ డంచు మూ
ర్ఖుల నసిగొల్పు పెద్దలకుఁ గొండొక బోధ యొనర్చు మంబరో. ౩

## గ్రంథప్రవృత్తి.

చ॥ సత్య, మసత్య, మంచు మనుజన్ములమంచికిఁ జెడ్డకున్, సదా
దాత్యము సేయుచుండెడివదార్థము లందొక దాని కింకొకం
డత్యయమున్ ఘటించెడి యథార్థపదార్థము నిల్పయోగ్యులున్
బ్రాత్యులు వేఱొకండు నిలుపన్ బ్రయతించుచునుంద్రు శాంకరీ. ౧

చ॥ నిలిపిన నిల్వఁ జాలని దనిత్య మసత్యము, నిల్పకున్నను
న్నిలిచి యెసంగఁజాలినది నిత్యము సత్యము, సత్వరప్రభా
కలన కెదే నిమిత్త మది గావలెఁ గావున దానికై మహా
త్ములవచనంబు లూఁత గొని పుస్తక మియ్యది సేతుమంబికా. ౨

ఉ॥ నోటుకుఁ గాలదోష మది నోటియెడన్ గొఱ గాదు కాన నె
ప్పాటను యుక్తి సేయుడు నపర్ణత గల్గదు తప్పుత్రోవలం
దాఁటెడివారిరజ్జులు వృథా, ఋణ మిచ్చి యపర్ణుఁడున్ ద్విష
త్కోటి నెదిర్చి పేర్చి కవికుంజరుఁడున్ వెలుఁగొందు నంబికా. ౩

మ॥ మనవాఁ డెవ్వఁడు? సత్యముం బలుకుసంపత్కామి, యన్యుం డెవం
డనృతం బాడెడివాఁడె, యీనియతికిన్ న్యాయైకదృష్టుల్ శ్రుతుల్
దనియన్ బ్రమొగ్గిద రన్యులో? మొఱకులై "తాఁబట్టుకుందేటికిన్
జనుఁ బాదత్రయమే" యటన్న నుడికిన్ దాసానుదాసాగ్రణుల్. ౪

మ॥ ధనమున్ జూడరు వేషభాషలకుఁ బందల్ వోలె లో జంక రె
వ్వని కేగౌరవ మంతె కాని యధికత్వం బొప్పఁగాఁ బోరు స
జ్జనులన్ దక్కఁ దదన్యులన్ మనమునన్ జర్చింపఁ గాఁ బోరు, ధీ
ఖనులంచున్ జననీ? ఋతం బడఁచు ప్రాజ్ఞశ్రేణికిన్ దెల్పుమీ. ౫

## పూర్వవిద్వన్నాగరికత

శా॥ *"మీవిద్దెల్ ధన మిచ్చి కొన్నయవి మీమీపోకలెల్లన్ ధనా
శావిద్ధంబులు పూర్వనాగరికవిద్యాభ్యాసముల్ వేఱు,త
ద్భావస్ఫూర్తులు వేఱు, వారు మనకై దైన్యంబు నైకోరరు మీ
త్రోవల్ వారికి నైఁచ రాని వని యుద్బోధింపుమీ శాంకరీ. ౧

శా॥ పూర్వాచారులవిద్దె నేర్చుగుణలుబ్ధుల్ వారిమర్యాదలే
సర్వోత్కృష్టముగాఁ దలంతు రిపు డాచారమ్ము లే మున్న వీ
దుర్వారుల్ గనఁ బోరు, దూర్వ లెనయా దుర్వాసుతో నందురో
శర్వాణీ! యిటువంటియోగులను లక్ష్య మ్మేల సేయన్ వలెన్. ౨

---

*ఆంధ్రభారతి యను పత్రికనుండి.)

## ప్రాచీన గురుశిష్య పద్ధతి.

శా॥ బెంచీ లక్కఱలేదు "గేమ్సు" మొదలౌ "ఫీజుల్" వినన్ రావు పాఠ్యంచున్ నిర్ధనుఁ బ్రోచిపుచ్చరు గురుల్, "ప్యా"సైన నే లాభమిం। దంచున్ నేమము లేదు మీ చదువునందాలోక మీలోకమున్ । గాంచన్ వచ్చెడినార్యులార! మిము మ్రొక్కన్ జెల్లు నెక్కాలమున్॥ 1. ఉ॥ కుక్కల నక్కలం గుఱిచి కోర్ల్కఁ బోల్చేల్ల గుఱించి కాక మీ। రెక్కడఁ జూచినన్ ద్విజగదీడ్యచరిత్రుని దేవునిన్ మహా। భక్తికి మై నుతించుసురవాక్కులు శిష్యులకిచ్చి వారి దా। వాక్కును దేహమున్ భవముఁ బావనమున్ బొనరింతురొప్పగన్॥ 2. ఉ॥ చెప్పెల కాళ్ళు ముండితపు శీర్షము శూన్యలలాటమున్ మఱిన్। గొప్ప బడాయి వేషములుఁ గుచ్చులపాగలుఁ గోట్లుఁ గంఠమం। దొప్పెడి పట్టముల్ గలుగునొజ్జలు శిష్యులు నీకు లేరు మా। యప్ప! చిరాయువై బ్రతుకు మమ్మరో వేదమ! నీకు మ్రొక్కెదన్॥ 3. ఉ॥ చాపలె యాసనంబులఁట; జందెములే వరవారవాణముల్। పావము పావఁజాలున దిపట్టులు శాలలు; పుణ్యలోకముల్। చూపెడి మాలికల్ మెడకుఁ జుట్టినపట్టము లర్థమిమియే। ప్రాపగు జీత మిట్టిగురువర్యుల శిష్యుల మ్రొక్కుటొప్పదే॥ 4. క॥ ధనవంతులకన్నను ని। ర్ధనవంతులె ప్రీతిపాత్రతములగు శిష్యుల్। వనమాలిఁ దెల్పుటే చదు,వన మాలిమి నెగడు మీకు నంజలి నేతున్॥5. సీ॥ అరుణోదయమ్ముగనప్పుడ మేల్కొంచి యాత్మాను సంధాన మాచరించి। ఆపగాదులకేగి యట స్నాన మొనరించి రవి త్రియామయుని కర్ఘ్యము

## టాటోటురటకుఁడు

ఉ॥ కొట్టు నుపానహం బదియుఁ గొండొక కొంకు వహించు నెవ్వనిం
దిట్టఁగ దానిఁ గుట్టునలదీసుని నాలుకయు వెనక్కుఁ దీయు నా
పుట్టుగుబమ్మచారి యెటుబొంకిన నేమగు? నట్టిచీపురుం
గట్టలు గిలుకవ్రాఁతలకు గౌరవ మెక్కుడి దస్మి? శాంకరీ. ౧

మ॥ ఘటచేటీకరనీచకాచకలనాక్రాంతంబు కర్ణద్వయం
బఁట? నానానృతపాతకాంచితవృథాహంకార పంకాంకితం
బఁట? చేతఃబటువంటివాఁ డొకఁడు పేరాసించి టాటోటులన్
రటియింపన్ గటువౌనుగా కవియు ధీరవ్రాతముల్ చూతురే. ౨

---

లోనంగి। తముఁ బోలివర్తింపఁ దగుశిష్యగణములు వెంబడిరాఁగ గృహాంబుఁ జేరి నిన్న దండెమ్మువైనించిన నీరుకావి పుట్టముల్ ధరియించి భూతిదాల్చి॥ తే॥గీ॥ దేవతార్చన మొనరించి దేవదేవ। నామపూర్వకముగ వేదనాదమును ద, దంగవిజ్ఞానమును శిష్యులనువదింపఁ, గాల మేగించు పూజ్యుల గారవింతు. 6. చం॥ నృపతులు వచ్చి దూరమున నిల్చి నమస్కృతిఁ జేసి పూర్తిగాఁ, దపమును వేచియాపయిని దగ్గఱకుం జనుదెంచి 'మీకు నే। ది పనియొ తెల్పుఁడీ' 'యిపుడె తీర్చెద మన్న "మకేమి లోటులే, దపరిమితంబ సౌఖ్య, మనునట్టి తపస్వుల మిమ్ముఁ గొల్చెదన్॥ 7. ఆ. వె. చంకజోలితోడఁ జనుదెంచునట్టివి, ద్యార్థిఁ గాంచి బ్రహ్మ యరుగుదెంచి, నట్లు సంతసించి యన్నమ్ము వెట్టు ప,తివ్రతా మణుల నుతింతు భక్తి, 8, ఉ. "వారలు మీకు విద్యనిడవారము లేమిడఁ జాలమే,, యటం, చాఅని పేర్మి దేవుగతి నారసి భుక్తినిబెట్టి విద్యపైఁ। దీఅనియాస్థఁ జూపెడి విధిప్రమానుల నగ్రహారపుం, బాఉల వారిగేహానులఁ బాయనిభక్తి నుతించి ప్రొస్తెదన్॥ 9. శా, ఏ రాజుం గన నిచ్చలేమి 'నెటులో యీపొట్టఁ బోషించితే। తీరం గావలె' నంచు భైక్ష్య మది యెంతే శ్లాఘ్యమం చెంచి యా, చారం బొప్ప గృహాంబు లేగి వెనుకన్ ఛాత్రావళుల్ రాఁగ సం,సారం బీఁదుచు విద్య నేర్పెడి మహావంశ్యకర్తలన్ మ్రొక్కెదన్॥ 10. కం॥ భృతకోపాధ్యాయులఁ గని, మతిలో నేవమ్ము గాంచు మాన్యులకున్ బ్రో, న్నత వేదశాస్త్రవిద్యా, రతులకు నతులిడుదు రాజరాజనతులకున్॥ 11. మ॥ శుచియా వేషము శుద్ధమా మతము సంశుద్ధం

ఉ॥ "ఆవులు దూడలుం గలుగ నార్వురు గుంజల కేల" తానెవం
డీవిషయంబు నేమెఱుఁగు నింతకుఁ దన్నెవఁ డీసడింపకే
పో విడుచున్ జరిత్ర మన బొంకులు బూతులుఁ గూడనౌనొకో?
కావల మేడనీ సత్యపుఁ బ్రకార మదేడనివచింపు మంబికా. ౩

ఉ॥ ఇట్టి వృథా ప్రజల్పకుల హీనపు వ్రాతలు కీర్తికామినిం
గట్టుడు నాపె "కాళ్ల కురి గట్టె" నటం చొకమూల నాఁగుచోఁ
బట్టపగంటఁ జుక్కలపరిభావము వెల్లకపోదు "తోడొఁగన్
రోళ్లైయుఁ గాకపో దాకనరుం డలతానుఁ గాకపోఁ" డిఁకన్. ౪

---

బు దేహం బని। ర్వచనీయం బగుపాండితీగరిమ ద్రవ్యంబం దనాసక్తి పూ। ర్వచరిత్రంబులయందు భక్తియును ఛాత్ర శ్రేణిపైరక్తిగ। ల్గుచతుర్వేదుల సాంగులన్ నిరతమున్ లో నెంచి కీర్తించెదన్॥ 12 మ॥ ఘను లుద్యోగులు వచ్చి "మీసుతునకున్ గన్యామణిన్ మేటులౌ। ధనధాన్యాదులతోఁ దనిచ్చెద" మనన్ దత్క్రియన్యఁగైకో మనం। బున నిష్టంబదిలేక "మీరలతులుల్ పూఁబోఁడి మీకన్నె మే। మనఁగా రిత్తుల" మంచుఁ దప్పికొనుమి మ్మర్పింతుఁ బుష్పమ్ములన్; 13. చ॥ ధనమును భూమియున్ దమకుఁ దామయిఁ యిచ్చెడిరాజు లుండ "నం। దనులకు విద్య రాదు ధనధాన్యవశంవదులైన" నంచుఁ దై। కొనక యెటో కుటుంబమునకున్ భృతి గూర్చుచు నిస్పృహత్వమే। ధనముగఁ గాలమున్ గడపుధన్యులఁ బూర్వుల నాత్మ నెంచెదన్॥ 14. ఉ॥ రా జరుదెంచునప్పటి కరంటులతోఁ టకు గొప్ప ప్రవృత్త త। మ్మాజనపాలుఁ డొయ్యఁగని। "యార్య! కృతార్థుఁడనైతి మీకు స్వ। ర్యాభజము తెకరలే దయిన భూమియొ ద్రవ్యమొ స్వీకరించి మా। తేజముఁ బెంపుఁ" డన్న గణుతింపని సూరుల నాశ్రయించెదన్॥ 16, ఉ॥ "పుట్టితి మొట్టులో యిచటఁ బుట్టినయూ రెటు వీడవచ్చు ని। ప్పట్టున నే వసించి బుధవర్యులఁ జేసెదఁగాక శిష్యులన్। బెట్టెద నేనయన్న" మని పేదతనంబునుకోక దాతలం। బట్టి స్వశిష్యులన్ బెనుచువారి నుతించి యశుఁబు తుంచెదన్॥ 17. ఉ॥ పెట్టెలులేవు కల్గినను బీగము నున్న విభూతిసంచియే। పట్టుదొకందు భూతి నిడు బంగరవుంగని గాఁగ రాజరా। జట్టులు శిష్యవర్గమున కన్నము విద్యయు నిచ్చువేలుపుం। జెట్టుల సద్గురూత్తములఁ జెప్పి మఱొక్కరి నెట్లు చెప్పెదన్॥

తిరుపతి వేంకటేశ్వరులు.

ఉ॥ వానిది నోరు గాదు యలవానిది నాల్కయుఁ గాదు, తోఁచిన
ట్లైనరుఁడే ననత్యములనే నెగడించును, యట్టివాఁడు తా
జ్ఞానిస్వనామ మూనినను జందన మూనిన రాసభంబె దూ
రానఁ బరిత్యజింతు రలవాఁ డన కానినుడుల్ బుధాగ్రణుల్. ౫

ఉ॥ ఉన్నది యున్నయట్టులుగ నోపిక మీఱ లిఖింతు మంబరో?
కన్నపుదొంగవ్రాఁతలప్రకారము నోటికి వచ్చినట్లుగాఁ
బన్నము, బన్న మాగిలుకువ్రాయనకాంధ్రదశరాన నుంచి వి
ద్వన్నుత మైనమార్గమునఁ బంపెడిభారము నీది యీదెసన్. ౬

(త్రిశంకుస్వర్గము)

చ॥ అతనిని యోగి యందు రెవఁ డల్లవసిష్ఠగవీస్రవంతికై
మతి చెడి పోరి యోడి మతిమత్తముఁడై తప మాచరించి బ్ర
హ్మత యొక కొంత గాంచె నలయాతఁడె గాధిజుఁ డాతఁ డిచ్చె స్వ
ర్గతి నొక రాజసూతికి సురప్రభుఁ డొప్పమి కాగ్రహించుచున్ ౧

ఉ॥ గడ్డము మీసముల్ పెరిఁగి గాధిజుఁ జేయవు వేని నేని యా
చెడ్డమునీశ్వరుం డొకని శ్రీవతియన్నను జేర్పఁ బోయి తాఁ
బడ్డ పరిశ్రమంబు భగవంతుఁ డెఱుంగుఁ గృతార్థుఁ డయ్యెనే?
అడ్డఁడె యింద్రుఁ డాపయికథాంశ మెఱుంగనివారు లేరుగా ౨

(పౌండ్రకవాసుదేవీయము)

ఉ॥ ఉండుత్రి జగమ్మునందు మును పుండినయట్టులె యుండు వారు పె
కండ్రు, వృథాభిమానమునఁ గర్జ మెఱుంగక కొంద ఱెట్లొ చే
కొండ్రివమానముల్ దమకుఁ గూడనిబల్ బిరుదుల్ ధరించి; యీ
*పౌండ్రకవాసుదేవుల నెవండు గణించు వచింపు మంబరో? ౧

---

(*హరివంశోత్తరభాగమునుండి.)

క॥...అనిమిషముని యిట్టులనియె నాతనితోడన్,, ఉ॥...నీదు వాక్యముల్ మానవనాథ? యన్నియును మానుము కానివి నాకుఁ జూడఁగన్,, క॥ హరియొకఁడె? నీవెకఁడవె?, హరికిని నీకును విశేషమరయఁగ భూభృ, త్ప్రమాణువుల

(గౌతమీనది—సెలయేఱు)

ఉ॥ కొండలు ఱాల బండ లొఱిఁ గొట్టుక పోవుచుఁ దేల గౌతమీ
చండతరప్రవాహ మది శాశ్వతమై భువిఁ బర్వ నెన్నియో
కొండలనుండి వచ్చి యడఁగున్ సెలయే ళ్లట నూరుఁ బేరు లే
కుండఁగ ''దివ్వటీసరస సుం దెడిదీపములో'' యనం బొరిన్. ౧

ఉ॥ అంతన పుట్టు నంతటనె యాఱుఁ గదున్ రయ మొప్పఁ బాఱు నె
క్కింత వెడల్పుఁ బొడ్గు గలయే అది యే సెలయేఱు, దానిపై
నెంతొ! సహస్రప్రవాహముగ నెల్లపుడున్ బ్రవహించుచున్ బవి
త్రాంతగమై తనర్చెడి మహానది గౌతమియందు శాంకరీ! ౨

---

కుఁగలయది 'పరికింపవు' హరికినీవు ప్రతియోధుఁడవే,... తే॥గీ॥ వలవదుడుగుము నిన్నును వాసుదేవుఁ, డందరే బుద్ధియుతులు నర్వాధివాస, సిద్ధమైవాసుదేవాఖ్య నెల్లైనట్టు, లుర్వీలోపలఁ జత్తుల్యుఁ దొరఁదు గలఁడె,, క॥ నీచక్రమునీశంఖము, నీచాపము నీగదయు నీఖడ్గంబున్, నీచారోపితములు విను, చూచిన నవ్వుదురు వీని శూరులు ధరణిన్,,...క॥ నవ్వేదువారల నెఱుఁగవు, క్రొవ్వున నిటు పలికె దేల? గోవిందుని నీ, వెవ్వనిఁగాఁ దలఁచితి? వతఁ, డువ్విళ్లూరెదు భవన్మదోద్ధతి యడఁపన్,,......వ॥...శైనేయుండు(సాత్యకి) అట్టహాసంబు సేసియతనికిట్లనియె ......తే॥ గీ॥ ఆదిదేవుని పేరు చిహ్నములు మోచి । నంతటనె యాతనికిఁ దుల్యుఁ డండ్రెనిన్నె, సింహకవచంబు దొడిగినఁ జెనఁటికుక్క, గంధగజగంధమునకును గలదె నిలువ,,...వ॥ ... పౌండ్రుండు...ఒకదూత నాదైత్యదమను పాలికింబనిచిన,,...సీ॥ ... తిరిగి తంతటఁ బోక తేఁకువమాలి నాపేరుఁ జిహ్నములుఁ గల్పించికొంటి, వాసుదేవుండన... నేన కా,... బ్రతుకవలతేని వినుము... చక్రమాదిగ విడిచి మత్పాదయుగ్మ మాడిగి. నడికి చనుదెమ్ము నాశరణమ్ము సొరఁగ,, వ॥ అనియిట్లు దూతముఖంబున వెడలిన విమతువాక్యంబాకర్ణించి ... కమలలోచనుండు వానింగనుంగొని సీ॥ ననునట్టులరుగుదెమ్మని యెఁ గావున నెల్లయడియాలములతోడ నరుగుదెంతు, వినుతచిహ్నమ్ములు వీడుమన్నాఁడు గావునఁ జక్రపూర్వతఁ దనరువాని, దనమీఁద విడిచెదఁ, దనశరణముఁజొచ్చి మనుమంటగలదు గావునఁ గడంగి, తనశరణంబె పెంపొనరంగఁ జొచ్చి నిర్భయుఁడనై భూరి

(చ్యవనమహాముని)

ఉ॥ కొండలు బండలుం గలిసి గొప్పగ నెంచి స్వపక్షపాత మా
ఖండలుచేతి కత్తి కిడఁగా గరుడుం డిడెఁ బక్షపాతియై
యుండియు నీకమాత్ర, మదియుం జ్యవనుం డిడఁ, డాత్మశక్తి యి
ట్లుండు నటంచుఁ దెల్పుటకు నోజగదంబ! తృణీకరించుచున్ ౧

క॥ తనబలము నెదిరిబలమును, గననికతన వజ్రి మట్టిఘనహేతియె కీ
ర్తిని గోలుపోయెఁ గొడవ, ల్లనిమొన నటు లాచరింప నవి యేమగునో. ౨

---

సంపదహారింతు తే॥ గీ॥ ధరణినెందుఁ జేరఁగలవాఁడు దాను నాకు, దాఁటవచ్చునె తనయాజ్ఞ దడయకింత, వట్టునేఁడు నెల్లిటిలోన నిట్టులముగఁ, జేయఁగలవాఁడనంతయుఁ జెప్ప మీవు,,... వ॥ ...అద్దేవుండు దివ్యగంభీరస్వరంబున నతనికిట్లనియె,, సీ॥ పౌండ్రభూవర! నీవు భావమ్మునందు మదీయాంకములు మోవఁదివిరితేని, నాపాలికే తెంచి నమ్రుఁడవై యేను నీవాఁడ నాకిమ్ము నీదుచిహ్నము, ములనని వేఁడినలలి శాశ్వతంబులై చెల్లునువెట్టివె చెట్ల చేసి, తింకనైన వినీతి నేతెంచి వేఁడుము ... వ॥'' నీవునన్నురమ్మని దూతచేతఁ జెప్పి పుత్తెంచిన నీదెసవచ్చి తగినబుద్ధియుం జెప్పితి, నిట్లు నేయుము...అనిపలికినఁ బౌండ్రుండతని కిట్లనియె,, మ॥ అవనీనాథులనెల్ల నుద్ధతుల గర్వాంధ్యం బడంగింప నేనవతీర్ణుండ, నెఱుంగవేయకట! మిథ్యావాసుదేవాహ్వయం, బవినీతిన్ ధరియించి కొంటెఱకు మోహభ్రాంతి పుట్టించెదీ, యవలేపంబు నెఱింగి కాదె నిను దండార్హుండుగాఁ జూచితిన్,, తే॥ గీ॥ నాకు వెఱచి కైలాస యానంబు పేరఁ, గొంత కాల మమ్మెయిఁ దప్పఁ గ్రుంకిపోయి, తీవు లేకున్నఁ జూవె మహావిభూతి, మెఱయవచ్చిరు నీయూరనెఱువనైతి,,...క॥ పగతుఁడు చక్రమువైచిన, నగధరుఁడు సుదర్శనమున నదితుత్తుమురై, జగతీస్థలిఁ దొరఁగెడు నట్లుగఁ జేసె సమస్తజగములును ముదమొందన్,,...వ॥ ఇబ్భంగిఁ జగతు నపగతసమస్త సాధనుంగా నొనర్చి యమ్మహావీరుండు. తే॥గీ॥ ఏమిరా! వాసుదేవుఁడ నేనయనుచుఁ, జెప్పికొనవచ్చు నేరియింకఁ జెపుమ నాకు,...వ॥...గరుడ చరణ ప్రహారంబులఁ గృత్రిమగరుడలాంఛనంబగు తదీయ ధ్వజదండంబు ఖండఁబులు నేసి...,, (విస్తరమెఱుంగఁ గోరువారు హరివంశోత్తరభాగము ౬వ ఆశ్వాసము చూడఁదగు)

(కాళింగులు)

ఉ॥ అంగమునిండ భూతి నిడి యల్పపువస్త్రము గట్టి చెంబు చే
లం గొని శుద్ధసద్ద్విజులలాగు నటించుచు నెందుఁ బోవు కా
ళింగులపోల్కి నేఁ డకట! లేకు లనేకు లొకింత నేరు పెం
దుం గనకే వధానిబిరుదుం దలఁదాల్తు రదేమి పాపమో! ౧

ఉ॥ వేసము పొట్టకోస మటు వేసిన వేతురు గాక యీరసా
భాసులు నిక్కపుం ద్విజులఁ బట్టుక "మీరును విప్రులె! మిమున్
భూసుర లంట తప్పు మముఁ బోరునఁ గెల్చినఁగాని మీకు మీ
భూసురనామ మొప్ప" దని మ్రోఁగుదు రేమిటి కంబ! శాంకరీ. ౨

(లూత)

ఉ॥ అంబరమందు *సాలెపురు వాదరు వింతయు లేక ప్రేలుచుం
దం బోకయష్ట తోఁచు నది తథ్యమొ! కా దటమున్నె యల్లియుం
చుం బహుతంతుజాల మది చూరున నంటుక యుండు దాని దా
రంబు మొగంపు దారఫుఁ బరంపరతోఁ గలుపున్ దిగంబడున్. ౧

ఉ॥ నేయను గాత లూత యది నేర్చిన నేఁతగఁ బొట్టకోస మా
నాయము; బట్టకోసము జనంబు కువిందుని గోరుఁగాని యా
మాయపుఁబుర్వ నేఁతకయి మానస ముంచునె! యుంచుఁబో! యెటో
కాయమునందుఁ గప్పికొనఁగా, నది వచ్చునె! ముట్ట విచ్చునో. ౨

---

*21 వ సెప్టెంబరు 1912 సం॥ కృష్ణాపత్రికనుండి

ఈఁగపులి

తే॥ కీటకములందు మిక్కిలి కీర్తిగంటి। నీఁగపులి యందు రందఱు నెల
మి నన్నుఁ। గాదెయంచును మది వృథా గర్వపడకు। సరసులదివిన్న నగుదురు
సాలెపురుగ!, కపటమున నేదొ యొకవన్నె గడను బన్ని,యీఁగలను మోసపుచ్చు
ట నీఁగపులివి। కాని యెదురుగ నిలఁబడి కలనఁ గెలిచి। పేరుపొందిన దేది రూపింప
లూత!। ఎట్టులో యొకరీతి నీకీబిరుదము। కలిగె నామాటలటులుంచు కలిగినంత।
మాత్రమున నూర్ణనాభ మాషదినిమిషులు, తలను దాఁటిన గర్వంబు దాల్పఁదగునె

ఉ॥ అల్లిన దానినే మరల నల్లును, గ్రొత్తవిధాన నల్లఁగాఁ
జెల్లదు సాలెపుర్వునకుఁ జేతయుఁ గా దది యెన్నిసారులే
నల్లినయల్లికే మరల నల్లెడి దానికె నంతసింత మా
యల్లిక యెందుకేని గొఱయైనది గాదుగదా మహేశ్వరీ. ౫

(నీరసాశుఘోషానిరసనము)

చ॥ ఎఱిఁగియు గ్రామ్యపుంగయిత కేమును బాల్పడఁబోదు మే మొకొ
వ్వర మొకవేళఁ బోరికి సభాస్థలికిన్ జనుదెంచెనేని; శాం
కరి! యదికాదుకూడదని కంకకుమమ్మ! ప్రసక్తి దీరును
త్తరపు క్షణంబునన్ మరల దానిఁ ద్యజించెద మాజ్ఞ యిమ్మిగన్. ౧

చ॥ ఎలమిఁదురుష్క నిందగిలి యేగిన నాతికిఁ బ్రీతిఁ గొల్ప మొ
క్కలుఁడు తురుష్కతాప్తికయి కట్టిఁడిమార్గముఁ బట్టు భంగి వెం
గలులకుఁ బ్రీతిగొల్పఁ గలకాకవితం బురుడింప నెంచి క
శ్మలమగు గ్రామ్యథాటి కొడిసాచెడి తప్పను సైఁపు మమ్మరో. ౨

ఉ॥ తప్పులఁ ద్రోఁపనీకు మెడఁదంగలశాస్త్రము గప్పిపుచ్చు మే
చొప్పననో దడాబిడిగఁ జొప్పశలాకలఁ బోలు పద్దెముల్
గుప్పఁగఁ జేయు మెయ్యెడలఁ గొంకు ఘటింపకు మెట్లొ నూఱులన్
జెప్పినదే మహాపదవి సేయుము మాయుము గ్రామ్యవక్త్రముల్ ౩

ఉ॥ కష్టముగా నెటో భవదఖండకృపామహిమన్ము కల్మి నీ
ముష్టికవిత్వమధ్యమున ముద్దులు మాటలుగట్టఁ జాలు ని

---

నీవరాక్రిమమునకును నీయశముకు। నీదుబిరుదంబునకు లోననీవుమెచ్చ। వలయు నీజాతివార్మెచ్చ వలయుఁగాక। యింక నెవ్వరుమెత్తురో యీఁగలపులి!, యెన్నిరో గొప్పకీటము లున్నవినుమి। వానికేమియు గర్వంబు గానఁబడదు, వెదకి రవ్వంత యల్లికల్లుదువా లేదా। మేలు నీదు గర్వము పట్టఁజాలకుండెఁ,జాలునింతటి నుంచైన సాలెపురుగ!,బుద్ధి తెచ్చుకొని నయాన బుజములెగర।వైచి కొనుటచాలించి గర్వంబువిడిచి। భద్రముగనుండు మిదియు నీబ్రతుకు దెరువు.

పిప్పర సోదరకవులు

దుష్టపుఁ బద్యమున్న నది తొల్లి రచించిన దండుఁ, వారి సం
తుష్టికి నట్లు కాదనుచుఁ దోఁపఁగఁ జేయుట యెట్లు శాంకరీ. ౪

ఉ॥ గిరగిరఁ ద్రిప్పమోఁగెడిఁ బకీరుకరమ్మున నొక్క-యంత్ర, మా
"కిరకిర,, బాలురన్ దనుపఁ గీలొ్క-నుభంగిమొ మాన్యమైనచోఁ
బరపరలాడుచున్ గవితఁ బాడెదడావిడిగా నటించుఁ బా
మరులు నుతించుపూనికయు మాన్యతఁగాంచుఁ గదే మహేశ్వరీ. ౫

మ॥ స్వరవర్జ్యత్వమెఱుంగకే పొరిఁబొరిన్ సంగీతముల్ వాడి యె
వ్వరు మెప్పింతురు! గాయకోత్తములు వహ్వ నాఁగ; నట్లే పర
స్వరసందర్భము శ్రోత్రపేయతయు సౌశబ్ద్యంబు లే కెట్టులో
విరచింపన్ గవితల్ శ్రవోయుగళికిన్ విందుల్ ప్రసాదించునే. ౬

చ॥ "పదనిస, సాని దానిపస, పస్రీసరి, గామగారిసా,
సదగద, నీరిసారి, దరిసా, గరిసా, నిరిసా, రిసా, రిసా,
గదగద, పాదపాద, సదగా, పదగా, నిదగా, దగా, దగా,"
యిది యొకగానమేని యెదియేనిఁ గవిత్వ మగున్ మహేశ్వరీ. ౭

ఉ॥ "చేసినదోనముల్ బయలుసేయఁగ నెంతువె! దుష్క-విత్వ వి
న్యాసము బైటఁబెట్టుటకునై గమకించెదవేల" యంచు దే
వాసురయుద్ధముల్ గెలిచినట్టిఁడు పండితరాజుచేత నీ
వీస డిలంగఁజేసి మము నెందుకు దూర్చెద విందు శాంకరీ. ౮

ఉ॥ ఎంచి పురాదులైన పదునెన్మిది వర్ణ్యములంగుఱించి వ
ర్ణించి కథానుగుణ్యముగ నించి రచించియొ యుంచి రంచుఁ బ్ర
శ్నించినచో నదుత్తరము చెప్పటకున్ దగనైనయుక్తి దోఁ
పించి యనంతరమ్ము నడిపించుమి యీకృతి కోమహేశ్వరీ. ౯

చ॥ కవివరులెల్ల మేలనఁగ గ్రంథములన్ రచియించి కవ్రిపుం
జపుల జగమ్ము ముంచెడి ప్రశంస ఘటించియు నేఁడు కొవ్రిపుం
గవులకతమ్మునన్ రసము గన్పడకుండెడి దిక్కు-మాలు కా
కవితకు మమ్ముఁ బాలుపడఁగా నొనరించెదె మాలదైవమా. ౧౦

చ॥ గడియకు మూడువందలఁటి? గంటకు డెబ్బదివందలంట! త
ప్పదుకవనమ్ము చెప్పుటకుఁ బూనినవారిని బుట్టఁజేసి యె
ప్పుడు నరసాశుసత్కవనమున్ బచరించు మదీయవక్త్రమున్
''బడబడ'' మ్రోఁగు''తాషమరపా'' నొనరించెదవమ్మ యీశ్వరీ. ౧౧

ఉ॥ వృత్తవిశేషముల్ చెడి వివేకము పాకముదప్పి సద్గుణా
యత్తతఁ దక్కె శయ్య యొకఁ డంతగ బొంతగ సంగ్రహించి యే
పొత్తును రోయకే పలుకుపోకడ నేరిపి మాదుకైత ను
న్మత్తతమైఁ జరించుకసుమాలగఁ జేసెదె మాలదైవమా. ౧౨

చ॥ తొరతొర గ్రామనామములు తొంబదియో పదియో సహస్రమో
పరపర గ్రుక్కత్రిప్పకయె వాగెడి విప్రవినోదివై ఖరిన్
జరచర నూరు జార్చుటది సత్కవిధర్మము గాదటంచు నీ
వెఱిఁగియు దానికై మనము నేటికిఁ గొల్పెదవమ్మ శాంకరీ. ౧౩

ఉ॥ అక్కటా? నీరసాశువున నందముఁ జందము లేక యెట్టులో
గ్రుక్కలు మ్రింగుచున్ వెడఁగు గొల్లలసుద్దుల నెంతపాడినన్
దక్కునె''కైత''యన్ పదవిదానికి, ''గాడిదగంపెఁడూఁకదాఁ
బొక్కిన నేమిలాభ''మను బొంకక తెల్పఁగదమ్మ శాంకరీ. ౧౪

ఉ॥ అబ్బెన మేల నేయవలె నంబరొ? తంబుర, యొంటికంటి త
బ్బిబ్బ మృదంగ,మీద్వయమె వేషముపట్టిన లోటు గాని యా
బొబ్బిలిపాటగాంధ్రతలఁపుం గొలుపంగల పాటుకైతమున్
సిబ్బితి గల్గి పండితులచే నుతిగాంచెడి కోర్కె యున్నచోన్ ౧౫

చ॥ కవితయుఁగాని సంతతియుఁగాని జనించిన యుత్తరక్షణం
బవిసి నశించెనేని ఫలమబ్బునె? గర్భభరమ్ము దక్కె, నా
యువు లవమేని లేనిసుతు లొక్క సహస్రము రెప్పపాటులో
శివ! శివ! పుట్టనేమి యగుఁ జెప్పఁగదమ్మ, మదంబ శాంకరీ. ౧౬

ఉ॥ ఆశుకవిత్వమందు రస మూరయ రాదని యప్ప నెప్పె నో
యీశకుటుంబినీ! జననమే లిఖియించిన బంతిక్రిందనే

నాశముఁగూడ వ్రాయుటది నల్వకు సమ్మత మౌనుగాక గ
ర్భాశయమే స్రవించుటకు నక్కట! దీనికి భేద ముండునే, ౧౮

ఉ॥ "మారుని నేరఁజాలు సుకుమారుఁడు, కన్నులు చేరెఁడేసి, బం
గారము మే" నటంచు స్తుతి గాంచిన బాలున కేద్భుభంగి వి
స్తారరసమ్ము గల్గుటయు సంభవ మందెడుఁగాక నిల్వఁగా
నేరని కొప్రపాశుకవి నేరుపు లేటికి మాకు శాంకరీ, ౧౯

చ॥ పలుకుల కల్కి నేర్పిన సుభాషితముల్ జతఁజేసి కచ్ఛపిన్
బలుకఁగఁ జేయ దానికి నుపశ్రుతిగా శ్రుతివిందు సేయుచున్
గలకలలాడు కంకణవికస్వర సుస్వర మట్లులుండు మా
పలుకులొనర్చెదే యనుపబాడిగ బండిరవంబు లీశ్వరీ. ౨౦

చ॥ కలుషితమైననీ ర్ధరుసు గాఁ బ్రవహించెదునట్లె తప్పఁగా
తలు దొరలున్ దడాబిడిగఁ; దజ్ఞుల కెట్లు రుచింపనౌ, శర
ల్లలితకలావిలాసవిమలమ్ములు సత్కమలంబులో, రస
జ్ఞులకు రుచించునట్టిద యగున్ హిత మాశుకవిత్వ మేరికిన్. ౨౧

‡(తలకుఁదగనివ్రాఁతలు)

మ॥ కవితాతత్త్వరహస్యవేత్తృతకునై కష్టించునుత్కృష్టవి
ష్టవివేకుల్ కులగోత్రనిందకులు, వేదాచారపారంపరీ
దవవహ్నుల్, సకలాన్నభోక్తలు, సమస్తస్త్రీకుటుంబుల్, మహా
సువివేకుల్, వితరీత మీతెలివి విజ్ఞుల్ రోయ కెట్లుండురే
కవులివ్వారి గణింత్రుని వీరలొకొ లోకం బన్న నేఁ డంబికా. ౧

‡(మే 10 వ తేది 1913 వ సం॥ కృష్ణాపత్రికనుండి)

# చరణాయుధప్రశంస.

ఒకభాషాభిమాని:—

ఈపోట్లాటకు అంతంలేకుండా ఉన్నది. ఈకవులు కోళ్ళనుగూడా మించిపోయినారు. తురుష్కయుద్ధమైనా ముగిసేటట్లున్నది. కాని యీకవుల కలహా మెప్పు డారంభమైనదో దానికి విసుగు విరామము లేకుండా ఉన్నది. అంత

ఉ॥ దుర్మతముల్ కడుం బ్రబలి తొందర గొల్పెడుపట్లు, ధర్మపు
న్మర్మ మెఱుంగునార్యు లవి మాపినయట్లె కవిత్వతత్త్వవి
త్కర్ములు లాఁగఁగా వలెఁ గుకావ్యము; తాదృశధర్మకార్య మే
కర్మ మెఱుంగఁ జాలనియకర్మపరుల్ నిరసింప నేమగున్. ౨

ఉ॥ జన్మము లాఁగి పోయెనొ? యశస్వుల సత్రము లాఁగిపోయెనో?
అన్నము మాల మాదిగల దండఱకుం బ్రియమై తనర్చెనో ?
దున్నల కాలు భార్య లయి తోసము నందెనొ ? పోడ శిష్టసం
పన్నగృహస్థపుత్రికరపంకజ మంటెనొ? వీరియార్వులన్. ౩

ఉ॥ ఏనది కాదు కాని దగు నం చది దేశము నుద్ధరించు నం
చేనరమాత్రులో గిలుకు నేవప్రవాఁతల కూఁతమై యశో
ధీనులఁ బూర్వపండితగతి న్మతిఁ జాన్పెడి జ్ఞానులన్ మహా
ధీనిధులన్ వృథా దెగడు తెల్వులవిల్వల నెంచ నేటికిన్. ౪

కంతకు కక్షలు ప్రబలుతున్నాయి. ఇరుపక్షములచుట్టు గ్రామసింహాలు చేరి గర్జనము మొదలు పెట్టినాయి. ఈపోట్లాటల నాపించే ప్రభువెవడుకనపడడు! వీటివిషయమై ఆంధ్రపత్రికలు జాబులు ప్రకటించకూడదని దొరతనము వారొక చట్టం చేస్తే బాగుండును. కవులకే బుద్ధిలేనప్పుడు నావంటివారేమి చేయగలరు?

(మే 15 వ తేదీ 1913 వ సం॥ సుదర్శనీ పత్రికనుండి)

## కవులకలహములు.

గతవారపు కృష్ణా పత్రికలో కవుల కలహములను గూర్చి విచిత్ర చిత్రావళిలో నొక చిత్రము ముద్రింపఁబడినది. అందు రెండుతలల కోళ్లు రెండు ముఖాముఖిగా నిలువఁబడి యుద్ధము చేయుచున్నటులను ఇరుప్రక్కలను శునకము లు అఱచుచున్నట్లును జిత్రింపఁ బడియున్నది. ఇది చూచుటకు మిగుల నచ్చెరువుగానే కనవచ్చుచున్నది. గాని కొంచెము దీర్ఘదృష్టితోఁ జూడఁగా మిక్కిలి జుగుప్సాకరముగఁ బర్యవసించు చున్నదని తెలుపుటకుఁ జింతిల్లుచున్నారము. ఈ జంటతలల కోళ్లరూపముతో నున్న కవులెవరో యెల్లరును జెప్పకయే తెలిసికొనఁగలరు... ఇంత కాలమునుండి వీరిట్లు వాక్ప్రవాదములు చేసుకొనుచుండఁగానింతవఱకెవరికేమి యనర్థము కలిగినదో చెప్పఁగలరా? వైదిక నియోగికక్షలు పెరుఁ

తే॥ గీ॥ జననమరణాలలీలను విస్తరమొనర్ప, నవతరించినయయ్యలేయగుదురొక్కొ
పండితులటన్నఁ గవులన్నఁ బ్రాజ్ఞులన్నఁ, బత్రికలు వ్రాఁయు వ్రాతఁలప్పగిదిగాక
తే॥ గీ॥ బుద్ధిలేదఁటొ? కవులకు బుద్ధి గల్గు, వార లింక నెవ్వరో? కులాచారములకు
సున్నచుట్టైడి మేటిసంపన్నులొక్కొ? వీరలు నిగర్వులొకొ? గర్వులేరు జనని.
చ॥ కవికలహాప్రచారములు కట్టిఁడులన్ గరఁగింప లేవు కో
ళ్లపుడురు వారికిన్ సుకవు; లన్యులు కొందఱు కుక్కలౌదు రీ
యవినయమున్ సహింపనిగుణాఢ్యుల కీలిఖియించు ప్రాజ్ఞు లే
మపుదురొ? నీ వెఱుంగని రహస్యములుం గలవే మహేశ్వరీ. ౨
గీ॥ కోడిగ్రుడ్డంతయన్నమ్ము గొసరెనొకఁడు, నిమ్మకాయంతగోరెపత్స్మ్మతుండు
వేఱొకఁడు; దీనఁగలసువివేక మజ్ఞు, లెఱుఁగ రది విజ్ఞులకుఁగాక యెట్లు తెలియు

---

గు చున్నవందురా? ఆ పాప మిందుమూలముననే పండలేదు. అదియిదివఱకే పండి బ్రద్దలయినది ... ఈతారతమ్యచర్చ ప్రతివిషయములోనను గలుగుచుండును...''నిరంకుశాఃకవయః'' అనునట్లు వారిలోవారు చర్చచేసుకొనుచుండఁగా నడుమవారు వారిని గోళ్ళతోడను గుక్కలతోడను బోల్పఁజూచుట యనాలోచితము... కోళ్లు, కుక్కలు మొదలగు నీచోపములచే వారినిబ్రజారంగమునఁ బడవేయుటకంటెఁ గొదమసింగములఁగానో మదగజములఁగానో ప్రదర్శించినచో సత్యమైన యర్హమయిన గౌరవమయిన ప్రదర్శనమయియుండును...మఱియు వీరిట్లు నీచోపమలచేఁ జిత్రరూపమునఁబ్రదర్శించుటయే కాక దానివ్యాఖ్యానములో ''ఈకవులకు బుద్ధిలేదు. ఇత్యాది పరమతృణీకారనీచవాక్యములచేఁగూడ సంభావించిరి.

(1913 వ సం॥ రం॥ జూన్ నెల 15 వ తేదీ సుదర్శనీపత్రికనుండి)

ఇప్పుడు వివాదపడుచున్న కవియుగ్మములను గూర్చి కృష్ణాపత్రికలోఁగోళ్లగను గుక్కలుగను పరమనీచోపమగాఁ జిత్రించఁగా వర్తమాన కవులలో గౌరవనీయులయి యున్నవారి నింత నీచపఱుచుట చాలజుగుప్సాకరముగ నున్నదని మేము వ్రాసినది పురస్కరించుకొని ''కవులు కలహించ వలెనఁట'' యను వ్యాసమొకటి సువర్ణలేఖ యొకచదెవరి పేరిటఁ బ్రకటించెను...అంత కంటెను అధికులు చర్చించు కొనుచుందురేని వారి ప్రశంసయే యెత్తుకొనము. ఎందుచేత? వారి

మ॥ ఉపమాకల్పనఁ బట్టి కాల్పనికునం దూహింపఁగా వచ్చు ని
క్కపుసౌభాగ్యము లెన్నియేని; యది యజ్ఞగ్రాహ్య మెట్లో? వృథా
కుపితుల్ తోఁచినయట్లు గిల్కుదురు సంకోచింప రల్లంత న
య్యపలాపంబు సదోవిగర్హితముగా నద్దెంతు రజ్ఞత్వమున్, ౯

ఉ॥ అజ్ఞుల వ్రాఁతలే ప్రకటనార్హములౌనఁట? త్యాజ్యముల్ మహా
విజ్ఞుల వ్రాఁత లౌనఁట? వివేకులు కోళ్లఁట? కుక్కలంట? ధ
ర్మజ్ఞత మేలుమేలె? లిదియు బ్రహ్మసమాజమతప్రవర్తన
ర్వజ్ఞతయొక్కొ? యన్యమతవర్తుల కంబరొ? యింత జ్ఞానమే, ౧౦

---

వివాదము తీర్చుటకు మనమెంత మన బ్రతుకెంత యనెడు స్వసామర్థ్య దౌర్బల్యమును బట్టి మనత్రోవను మనము పోవుదుము. టర్కీ బాల్కను రాష్ట్రముల మహాప్రవిదారణము సంధిచేయ బ్రిటిషు ప్రభుత్వమువంటి వారికే యర్హత గలదుగాని యెలమంచిలి ప్రొప్రయిటర్లు, ఏమిచేయఁగలరు? ...ప్రస్తావనకవు లేతనాన్త్రులుగారు. కలమెట్లు చేతఁబట్టవలెనో తెలియని "చదువరి' ప్రభృత్యస్మాదృశులందఱును వంక దొరకెఁగదా యని యెద్దియేని యనిష్టకారణమున వారిని దోఁచినట్లెల్ల నీచపఱచుట కధికారము లేదు....చమత్కారముగా యుక్తిప్రయుక్తికముగా వాదములు చేయుచున్నారు. సొంపుచెడినట్లు మధ్యస్థులకుఁదోఁచుట లేదు ఇష్టము లేనివారు వారివాదములను బ్రకటించక పోవచ్చును,...వీరికి నిజముగాఁ గవులు కలహించి పాడయి పోవుచున్నారని పరితాపమూ లేక వారిలో నెవ్వరియందేని యనిష్ట కారణమున నేదేని వంకఁబెట్టి యేవో వెలితి "రిమాకున్" లు చేసి తద్వారమున నయినఁ దమయనిష్టమును దీర్చుకొందమను దురుద్దేశమా?...తొలుత రామకృష్ణకవులు తమకీశ్వర వేరులన్న మాట వినగానే తిరుపతి వెంకటేశ్వరులు 'గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినందుకై" కంటగించుకొని కొంచెముద్ఘోషణము చేసిరి. ఇట్లై గుంటూరిశతావధానములోఁ గొప్పరపుకవిగారికిఁ దమ రంగస్థలములోఁ దమతో సముఁడన్న సిద్ధాంతముమీఁద సహాసన మీయఁగా నట్లువలదనిరి. లోకసామాన్యమర్యాదకై మీ రెట్టి యాసన మిచ్చినను మాయభ్యంతరము లేదు గాని ప్రత్యేకించి మాతో సముఁడన్న సిద్ధాంతముపై యాసన మిచ్చిన మే మంగీకరించమనిరి.

ఇందు దప్పేమియున్నదో? సన్యసించి తపమాచరించుకొను వారినైనను నీవు

సీ॥ అమ్మ యెంతటిధన్యురాలో యీబిడ రజస్వల యయ్యె ముగియ దిప్పటికిఁ బెండ్లి
కితని సౌభాగ్యత నెన్న నెవనిశక్యము పెండ్లియాడె నల్వదియేండ్లయాఁడుఁబడుచు
నాపె సంసర్గణపరాయణత్వము మిన్న యాఁ బుత్రవతి పెండ్లియాడె విధవ
ఆతఁ డిందఱకన్న నధికుఁ డేమనఁ? జందెమును ద్రెంచె బాలుఁడైనను దెగించి
తే॥గీ॥ ఇట్టి ధర్మేతరములనే యెపుడు వినుతి, సల్పుపత్రిక లెక్కడఁ? సహజధర్మ
బద్ధ బుద్ధికిఁ గాని కన్పడని సత్య, మనెడి పరమార్థ మెక్కడఁ? యఖిలజనని.

---

కొలఁది వాఁడ నందుమేని యాతఁడూరకోఁడే! అట్టియెడ మానుషము విడనాడని లౌకిక కవిపుంగవులు స్వగౌరవ న్యూనతా పరాభవము నెట్లు సహింపఁగలరు... కాఁబట్టి సర్వవిధములను ఏవంకనో తమ యనిష్టమును దీర్చుకొందమను దురుద్దేశమే యీ పరితాపమునకుఁ గారణమని ఘంటాపథముగాఁ జెప్పవచ్చును... ఈ హృదయ కల్మషముల కొక్క ప్రబల దృష్టాంత మిచ్చుచున్నాము చిత్తగించుఁడు... నిన్నటి సువర్ణ లేఖలో... "ఓర్వలేక తగవులాడు కవులను జుట్టజుట్టున ముడివెట్టి ఇనుప గాలములు వేసి లాగుచున్నారండో? శ్రీరామరామ" యను నెంత సందర్భము లేని యపలాపమును వ్రాయించినారు... "కవులను" ప్రత్యేకించి నిష్టేషముల చేయవలెనా? కవులనే కాని, యోర్వలేనిగుణము గలయితరుల నెవ్వరిని శిక్షింపరాదేమి?... లెడుబీటరుగారు చెప్పినట్లు కామము దీర్చుకొనుటకు అశ్వత్థ మెంత యుపయోగమో క్రోధము దీర్చుకొనుటకిదియు నంతియుపయోగము. ఈయుపపట్టు వర్ణనము సిథాయకమే గనుక ఓర్వలేక తగవులాడు కవుల నొక్కరినే కాక యాగణములోని వారినందఱను గూడ నాలోకమునఁ జిత్రవధ చేయుట తప్పనిసరియని తెలియఁ జేయుచున్నాము. కలహించఁగూడ దను వీరిసిద్ధాంతమే సర్వదా ఆచరణీయ మగునేనియు, నట్టివారినెల్ల నేకోళ్లగనో పోతుకేఁలుగనో చిత్రించవలసి యుండునేనియు నిప్పటివఱ కనేక విషయములలోఁ గలహించుచు వచ్చిన కవులు, విమర్శకులు, పత్రికాధిపతులు, పండితులు, సంఘసంస్కర్తలు, పూర్వాచార పరాయణులు మున్నగు మహామహులనందఱ నీవిధమునఁ గోళ్ళు, కుక్కలు, పిల్లులు, పందులు, గాడిదెలు, గాఁ గూడ వరుసగాఁ జిత్రించి వారికి బుద్ధిగఱపుచుండవలెననియుఁ దెలియఁజేయుచున్నాము. ముందువిఘ్నేశ్వరపూజగాఁ దొలినాఁటి కలహకవులయిన దండి కాళిదాసులను జెఱసెను

సీ॥ ఘనుని జట్టుక సేవజనుఁ డేది వ్రాసిన నది శిరమ్మునఁ దాల్చునట్టిఘనులు
నీచునినీచత సక్రమ్ముగాఁ దెల్పువారి వ్రాఁతలు బుట్ట వైచుఘనులు
సత్యమ్ము నెఱిఁగియు శాంతులపోలిక నొప్పరికించుపరిపాటి నెఱుఁగుఘనులు
ఏదియో పోట్లాట నూఁదినఁ బత్రిక కబ్బు "మేట"రటంచు నరయుఘనులు॥
తే॥గీ॥ పత్రికాధిపతిత్వంబుఁ బడసిరేని, దానివలనను గల్గెడుహాని జగతి
కెంత యని చెప్పఁగలము లోకైకజనని, సత్యమడుగంటు నెగడు నసత్యమెందు

---

## కథాప్రారంభము.

వ॥ అంబా? దీనికేమి ప్రకృతవృత్తాంతమ్మవధరింపుము,

(సూర్యోదయము)

మ॥ పరితస్సర్పదపారభాస్వరగవీపారంపరీసన్నతై
మిరభారుండు దివాకరుండు త్రిజగన్మిత్రుండు మందేహ ధి
క్కరణోద్యోగి వెలింగె నార్యులు "కృతఘ్నఘ్నాయ దేవాయ" యం
చెఱఁగన్ దనక్కరకోటి కాల్కలఁది నెందేఁ బందలై పాఱఁగన్. ౧

చ॥ సరసిరుహాప్తుపాదములు సారెకు నుప్పరమందు, నెంతుఁ గొ
ప్పరపు శిరమ్ములందు నొగిఁ బ్రాఁకి ఘనాలయ పంక్తి మీఁదుగా
ధరణికి డిగ్గి యెల్లెడలఁ దామయి యామెయి వారిశైత్యపున్
భర మణఁజేయుచున్ నెగడెఁ బండితపామరరంజకమ్ములై. ౨

---

క కుకర్గను వారికిఁదగవుదీర్చిన దేవినొక యాఁడుపందిగను జిత్రించి యది మొదలు మొన్నటివఱకుఁ దగవులాడిన శిష్టు కృష్ణమూర్తి, పిండిప్రోలులక్ష్మణకవి, వెంకటరత్నశర్మగారు, వీరేశలింగం పంతులుగారు, వేదము వెంకటరాయశాస్త్రిగారు, కాశీభట్ల బ్రహ్మయ్యగారు, వడ్డాది సుబ్బారాయఁడు గారు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు, మున్నగువారి నందఱను వారివారి యర్హతకుఁ దగిన జంతువులతోఁబోల్చి చిత్రింతురుగాక, అపూర్వోపనిషన్మతము వెలయింత్రురుగాక.

(కొప్పరపువారు కాలుద్రవ్వట)

చ॥ సరసముగ నుండె నుత్తరపుధోరణి యుత్తరగత్తరంబలెన్
ద్వరపడి తిట్టి బందుగులదాపునఁ దూఱుట స్పష్టమయ్యె నె
త్తుటి నెటుఁ జేయనట్టి *యవధానము నెత్తుట వీర్వలాయన
స్థిరు లని యెంతమూర్ఖునకుఁ జెప్పక చెప్పఁ దొడంగె నంబికా. ౧

క॥ అలసూజివీటు ఔరా కా, కులమున మఱికొన్నిచోట్లఁ గోవిదు లెఱుఁగన్
జలిపిన ప్రత్యేకపుసభ, లలవా రెఱుఁగమియు స్పష్టమై కన్పట్టెన్ ౨

‡క॥ ససహాయుంబుగ నవధా, నసభన్ బొనరించునట్టి నరుఁడె ఘనుఁడో తా
న సహాయుఁడు ఘనుఁడో యది, సుమతులకుం దెలియునే ఘనులకుం దక్కన్.

‖క॥ తెలుఁగఁటని మీసఁబఁటని యది, నిలుపన్ వలెనంటని వీరు నేరుతురొక్కో
తెలుఁ, గౌరాని తెలుఁగనఁగాఁ, దెలగాల్మాటాడు పచ్చి తెలుఁగే యగునో.

తే॥ బళిగవిబూహాప్రితతెఱఁగెల్లఁ బాటిమీఁదిపందికొక్కుబబల"మన్నపగిదిఁదోఁచె
వీరికి జవా బొసంగుట విజ్ఞులొప్ప, రయిన సామాన్యలోకు లట్లనరుగాక. ౪

క॥ అని యెంచి హాగు పద్దెము, లను గిలుకన్ మేము వానిలక్షణమును నే
రని పోలిక స్వవచనమున జా,బును బంపితి మంబని వారు పురఁబురఁ బొక్కన్

క॥ పద్దెములు వ్రాసితిమి వి, ద్వద్దశ గూపెట్ట మనము పలుచనగా వా
రద్దె మిటు గొట్టిరని యో, గుద్దుకొనం దొడఁగి రంటని కొప్రపుసాముల్. ౬

*బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీశ్వరులకు......

సీ॥ ... ... అష్టావధానంబు నాచరించెదరేని యద్దానిమించి నేయంగ లేము, శతఘంటకావధానంబు, నల్పఁబూనెదరేని యద్దానిమించి నేయంగ లేము...

‡ గీ॥ అన్యునిసహాయ మించుకయైన లేక, పద్యమవధానమంచు జెప్పంగ లేని, మీమనోధారణాశక్తి......

$ ......తెలుఁగు మీసంబు నిలుపంగ దివురుడింక. (21-8-11)

§ మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బారాయ కవిగారికి. అయ్యా! పద్యమయంబగు తమయుత్తరమందినది, "మీపరువును మాపుమాటకు జవాబు నొసంగిన వాఁడ నమ్మఁడి" అని వ్రాయించినారు. ఏసందర్భమునం దేవిషయమునం

క॥ మనురామకృష్ణులకుఁ జ, క్కనివస్తమ్ములను వ్రాసి ఘనత నొసఁగి రీ
య్యనువున మనలం జూచిరి, యని లోలో వగచిరంటివి యాంధ్రపుఁగవుల్,

క॥ అనుకొంటి మేము వీరికి, ననవద్యపుఘక్కి వదన హైనన్ వ్రాయఁ
జనద, యది గ్రామ్యశైలిం, బనుపమమే యుక్తమనుచుఁ బదపడి జననీ. ౯

క॥ కాని యటు మొదట యోజన, మానసమునఁ దవులకునిక్క మఱి యాధాటిన్
బూని లిఖియింప మైతిమి, దానికె యక్కవుల కెడఁద తబ్బిబ్బగున్యేన్. ౧౦

క॥ తగినంతగూఢ గతిమే, మగుపఱచిన వీరికర్థ మగుటె ట్లటు వ్రా
యఁగ నర్థము తముఁగోరఁగ, నగరాజకుమారి! వీరి నగరాని విజ్ఞుల్. ౧౧

సీ॥ అవి యనద్వాహమ్ము లన, "మాకు నిత్య మి
య్యదియె కూర" కటన్న దెవరు జననీ?
ఒక్కరోని యిర్వరొక్కోని దేవు లనుకేలి
"కెద్దు"లంచనుకొన్న దెవరు జననీ?
"లవణం బనిన నేదొ యవలికిఁ జని తెచ్చి
యెలమి వడ్డించిన దెవరు జననీ?
సభ "నథాతో బ్రహ్మ' చదువ "సీతాత" లో
నవుప్రసంగము నేసి రెవరు జననీ?
గీ॥ వారిలో వారు గారో కొత్రంపువారు, కాక యుండిన గీత మెక్కటన వ్యర్థ
మయ్యె వీరికి నీలాటి యభముశుభము, నెఱుఁగని యమాయికులు సుమ యెల్ల నేల.

క॥ ఇది యిట్టు లుండె మాజా, బది వారికిఁ జేరె మరల నలబాఁగాఁబున్
గుదురుచుకొను నీలోపలఁ, బొదలిన వేడుకవిశేషముల్ వినుమంబా, ౧౩

(మ॥ రా॥ రా॥ ఏకాంబ్రానయ్యపంతులుగారింట విందు)

ఉ॥ ఇంతకుమున్నె విందనుచు నెల్లబుధుల్ విన రామయార్యుఁ డే
నంతసమూనియోగి పిలిచెఁ జట్టన నాఁడె నియోగివైదిక

---

దేరూపముగా మాయేమాట మీయేపరువును మాపినదో యావిషయము విపులముగా వ్రాయించినంగాని మీకుఁదగిన యుత్తరమిచ్చుటకు వీలులేదు. కావున వెంటనే దయచేసి పై విషయమును వ్రాయింతురు గాత.— 21-8-11.

ఇట్లు, దివాకర్ల తిరుపతిశాస్త్రి.

స్వాంతము లెత్తఁ బాటెఁ గొనసాగని యాసనచర్చకల్మి, ధీ
మంతుఁ డితండు మున్ననిన మాటకు దాఁటక వచ్చి చెప్పెరన్. ౧౪

ఉ॥ నేఁ డరుదెంతు మన్న నుడి నిక్క మొనర్పఁ డటంచుఁ బిల్చి మో
మోడిన త్రోవ గన్పడఁగ నొయ్యన నయ్యనఘుండు వోయె “బోఁ
గూడదు కూడు” నంచు నొకకొందఱు దండడిఁ జర్చఁ జేసి రా
పాడి గడింప “కేగుటయె బా” గనె వెంకన నిర్వశంకుఁడై. ౧౫

ఉ॥ విం దనుకూలమై జరిగె విందున లోప మొకింత లేద, యెం
దెందుల కేని మంచి దని యెంచిరొ యేమొ, మఱొక్క పంక్తి మా
కుం దమవారి కందఱకుఁ గొండొక పంక్తియుఁ గాఁగ నేరుపా
టుం దగఁ జేసి రయ్యది కడున్ సుఖ మిచ్చె ననేకభంగులన్. ౧౬

ఉ॥ పట్టురుమాల్ భుజమ్ము పయి బాలరవిప్రభలీనఁ బంక్తికిన్
రాట్టయి యగ్రపీఠమున రాజిలెఁ గొప్పిశెట్టి సుబ్బారావు, బల్
దట్టులు మందసాటికులధన్యుఁడు లోనగువార లాతనిం
బట్టి క్రమమ్ముగా నతనిపంక్తి నెసంగి రభంగురస్థితిన్. ౧౭

తే॥ గీ॥ జరిగె నారీతి విందు ప్రశస్తగరిమ, భోజనానంతరమ్మున నోజఁ గొంద
ఱేగు దెంచిరి వారు కోటీశశర్మ, శాస్త్రిముఖ్యులు పదపటిచర్య వినుము. ౧౮

మ॥ చిఱుమామిళ్లకులుండు యోగ్యుఁ డలలక్ష్మీపూర్వనారాయణుం
డురుకీర్తిస్థవిరుండు వచ్చె నట కుద్యోగిత్వమైత్రిన్, ధురం
ధరులై తక్కిన చుట్టలున్ మఱియు నుం దక్కుంగ లా రొప్ప భా
స్వర మయ్యెన్ దగుపాటిగా సభ భవిష్యచ్చర్య సూచించుచున్. ౧౯

శా॥ ఏకారామయగారి తమ్ములఁట! బీ,యే,బీ,యలై ప్లీడరీ
దాఁకన్ వచ్చిన మేటియంటి! మఱి యా ధన్యుండు తాంబూలముల్
వీఁకన్ గొన్ని ఫలమ్ములుం గొని సభన్ వీక్షించి తాఁ బంచె నా
పోకల్ కొండొక వర్ణనీయములనం బోలుం జుమీ శాంకరీ. ౨౦

ఉ॥ ముందు భుజంగరాయనృపమూర్తికొ, కొప్రపుటయ్యకో, గలం
బందఁగఁ జేసి యాపిదప నన్యులు బందుల కిచ్చి మీఁద న

న్వందితకీర్తి కంఠీజనిభాన్వరుఁ డౌనలమేటి కీయ నా
విం దతఁ డందకే కడు వివేకి మమున్ గరసంజ్ఞఁ జూపుడున్. ౨౧

ఉ॥ రామయగారితమ్ముఁ డలరారెడియోగ్యతఁ బొల్చువాఁడు సు
శ్రీమహితుండు లక్ష్మినరసింహసమాఖ్యుఁడు మా కొసంగెఁ ద
ద్ధీమహితత్వమేమి, మఱి తేఁకువయేమి మది న్నుతించుచున్
బ్రేమ ఫలమ్ము వెంకన పరిగ్రహణం బొనరించెఁ గ్రన్ననన్. ౨౨

చ॥ తిరుపతి పుచ్చుకోక యొక తేఁకువ దాని ననాదరింపఁగాఁ
గరము మదిన్ దలంచి యటు కర్జమునన్ గుశలత్వ మూనె, నం
తరమునఁ బత్రదాత యది తా గ్రహియించె నొకింత చర్చయున్
సరసముగా నెసంగె నది సభ్యు లెఱింగినదే మహేశ్వరీ. ౨౩

ఉ॥ రామయగారికిన్ మఱియు రామయతమ్ముఁడుగారికిన్ గడున్
ధీమహితత్వమందునను దేఁకువయందును గల్గువారకున్
మామదిఁ జర్చ సల్పుచుఁ గ్రమమ్ముగ వచ్చినతోవ నింటి కే
మేమియొ చెప్పి కొంచుఁ దగ నేగితి మానిని వోయె నీగతిన్. ౨౪

చ॥ వెలవెలవోయెఁ జుక్కలు వివేకవిహీనులమోములట్ల ని
ర్మలసలిలాశయంబులు ప్రమాద మెఱుంగని వారి మానసం
బులబలెఁ దెల్వి మీఱె ఘనపుణ్యులు వైదికులు న్నిరాగులున్
గలిసి యొసంగుచర్ఘ్యములు గైకొనుచుండె దివాకరుం డొగిన్. ౨౫

మ॥ అది వర్షర్తువుగాన మేఘపటలం బావంత దగ్గప్పఁ గో
విదమాన్యుండు దివాకరుండు తనగో విస్ఫూర్తిచే జ్ఞానిదు
ర్మదముంబోలె నపాకరించి సుదినప్రఖ్యాతి యవ్వేళకున్
గదియన్ వెల్గఁదొడంగెఁ గాక వితతుల్ గ్రాసార్థ మత్రాడఁగన్. ౨౬

క॥ తరువాతఁ దనదు సొమ్మగు "గురుతరలీల" యనుపదము గొని పద్యంబున్
బురపుర లిఖించి మీసము, స్మరియించుచుఁ గొప్పగంపు చతురుఁడు పెలుచన్

ఉ॥ *పత్రిక నంపి యప్పుడును బద్యము వ్రాయక యుత్తరించుచూ
పత్రికఁ జూచి "వీర్ననకుఁ బద్దెము వ్రాయమిఁ జూడ" నేటి క్రీ

---

*మహారాజశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులకు......చ॥ గురుతరలీలరేపె సభ
హూర్పఁగ నుంటిమిగాని, భానువా।నరమునదక్కరారెవరు,...ఆశుకవిత్వశతావ

యాత్రము మీఁద మాకుఁ గవులే యనితోఁచదు మీఁద తిట్టినన్
శత్రుత మాకుఁ బుట్టు ననుచందముగా మదిలోఁ దలంచుచున్. ౨౮

క॥ వదవదశ*వచనమా వ్రాయుచుఁ, దుదిదనుకం బత్రికలకు దొడఁగెన్ సుకవుల్
పదుగురుగల సభయనక, పైద్యశ్యోరాయివడి వ్రాఁత లెల్లన్ సురిఁగెన్ ౨౯

క॥ †తతిమితతిమి మునుమాకు, త్తరములు లిఖియించునతనితత్తఱమాపై
నిఱిగి సురిఁగి కరిగెనురెంటు, త్తరమే వచ్చుటకు మిగులఁదడవైపోయెన్. ౩౦

---

ధానముల్। విరచన సేయరానలయు, వెంటనె, మేనువియాచరించి ధీ। వరసభమీ ప్రతిజ్ఞ గెలుపం గలమీసము దీయఁజేతుము ...”

గుంటూరు, 22-8-11.

ఇట్లు,
కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ, శతావధాని.

---

గుంటూరు, 23-8-11.

*మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారికి. అయ్యా, ...మీనపుఁ బద్యమున కర్థమే కారణమునను మీకుఁ దెలియలేదనుకొనియెదను ...తెలియదేని పెద్దలనడుగుఁడు... (4) ఈప్రతిజ్ఞ ప్రస్తుతవిషయము కాకపోయినను మీయంతట మీరు పురస్కరించుకొని వివాదమున దిగుటచే నయ్యది యింతటినుండి మీయెడలఁగూడ నిర్వహించుట కంగీకరింపక తప్పినది కాదు....(9) మీరు మాకుఁ దెలిసినయంశములలో నేకదేశప్రవిష్టులు మాత్రమేయయినను మీకోరికంబట్టి మీ సభకు రా నుద్యోగింతుమే యనుకొనుఁడు రేపిఁక నుకరాంధ్రభాషైక దేశమగు గ్రామ్యభాషయందుఁగాని నిరవ్యతిగణప్రాసశాబ్దసాభాస కవిమార్గమునం గాని యసత్యత్రిఁగాని మమ్ముజయింపుఁడని తాలుదప్పినచో మాగ్రహాచారమందుకు నుడఁ బడవలసినదేనా! అందులకుఁ బ్రాజ్ఞులు సమ్మతింపవలసినదేనా! మాకుఁగల శత్రులలో నేకైక దేశమునసంతో యింతో యెంతో తెలిఁగినవారెల్ల మమ్మాదరింపఁ దగువారేనా! శాంతంపాపం...(12) ఈవ్రాఁతవలనఁ దెలుఁగు నేని మీకువదలితిమని యనుకొనకుఁడు....”

---

గుంటూరు, 27-8-11.

†మ॥ రా॥ రా॥ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారికి, అయ్యా,(1) జరూ

క॥ లలి “బాజానందడిమం, గళ సూత్రిము మఱచినట్టు”.గా సభకై యుకౕ
గిలికిన రవివాసర మా, పలికెకౕ జని వచ్చె సోమవాసర మంతకౕ. ౩౮

చ॥ సభయగునన్న యాదినము నందడిగా జను లేగుదేర రా
సభ మయి పోయె నెయ్యెడల సందుల గొందుల వంటపూటియిం
డ్ల భరముగా జనుల్ విడిసి “డాబులు డాబిరి యేలసేయరో
సభ” యని కొప్రపుంగవుల సారెకుఁ గేరఁ దొడంగి రంబికా. ౩౯

సీ॥ పుట్టుదిట్టము లేదు పో? నిల్చు టెట్లు కొప్పరమంచుఁ బలుమాఱు వలుకువారు,
తన్నుఁగఱ్ఱలబల్మి తనయున్నతిని నిల్పు నెంతదనర్చనటంచు నెంచువారు,

రు “అని 25 వ తేదీని మేము వ్రాసిన యుత్తరమునకు 27 వ తేదీ 11 గంటలకు మీ రిచ్చిన జవాబు అంనది... ౧. సభ ముందు మీరే చేయవలెను, ముందుత్తరము వ్రాసి యవధానాశుకవిత్వముల కై కాలుద్రివ్విన వారు మీరు కాని మేము కాము, ...౨. మావిషయమై మీరును మీవిషయమై మేమును నవధానపు టేర్పాటులు చేసికోవలసిన దే కాని యయ్యవి సభ్యులేర్పఱుపఁదగినవి కావు, ఉభయులచే నేర్పఱుపఁ గొనఁబడిన సభ్యులు న్యాయాన్యాయములును రసారసములును దారతమ్యములును విచారింపఁదగినవారు మాత్రమే ౩. ఈవిషయముల కంగీకరించుచు మీరు సభ సమకూర్పుఁడు, లేదా మేము సమకూర్చెదము...౪. జరూరని వ్రాసినను పెనుకటి వలెనే ఆలస్యము చేయక రేపు సూర్యోదయమునకుఁ దప్పక జవాబు పంపవలెను.

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

---

ఉదయం 8 గంటలకు 28-8-11, గుంటూరు,

అయ్యా! ఈదినమున సభ తప్పక జరుగు ననుమీ ప్రకటనను బురస్కరించుకొని యనేకు లనేక గ్రామములనుండి వచ్చి నిరీక్షించుచున్నారు. వారిని వ్యర్థాశుల నొనరించుట యుచితము కాదు కావున నవధానసభావిషయ మేమయిన దియుఁ బ్రకటించి వారిసందియము తీర్పుఁడు మాయుత్తరమునకుఁ బ్రత్యుత్తరము రాకుండఁగనే మేము ప్రకటించుట యుక్తము కాదుగదా?

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

తన్నానుబంధులే తన్ను వంచన సేయ నవసరంబైనప్పు డనెడువారు,
నేల విడిచిసాము లేలకో? యొకచోట నంతలోనే యుండక నెడివారు 33

తే॥గీ॥ వింధ్యగర్వంబగస్త్యునవంధ్యమహిమ, ముగ్గడించి యున్నీ? యనియొఱలువారు
హంసకాకచరిత్ర మిప్పుడవునను, స్మృతికిఁ దగిలె నటంచు వచించువారు.

మ॥ ఒకచో శైలగ నొకచో వడిగ నూహియారియంచుఁ గవ్యగ్రణీ
ప్రకరం బెంచఁగ నంచ యేగె, నటు "రార" మ్మన్న కాకంబు ము
న్నొకతీ, రాపయి నొకచో తీరు, పయి నెన్నో తీరులై డస్సి, నూ
టొకయానమ్ములు చూపి కాదె శరణం బొందెన్ మరాళప్రభున్. 34

క॥ అని పూర్వగాథ లెన్నుచు, మనమునఁ దమపడిన శ్రమకు మతిమతి విసువుం
గనుచుఁ దిరిగిపోనెంచుచుఁ. బునఃపునర్యో జనలకు బుద్ధి చొనుపుచున్.

ఆ॥ వె॥ కొండవీటిసామి దండ నుండెడి లేడి, కొండ తేనిమూఁతు కుబ్జమునకుఁ
దఱుచు భయము చెంది దండంబులిడు నొయ, ద్దానితోడఁ బెనఁగుతలఁపు గొనును.

తే॥ గీ॥ సింహగమనంబు నేర్వంగఁ జిన్ని లేడి, కెన్ని జన్మమ్ములెత్తినయేని గలదె
సాల్యసాలకభావసంబంధ ముడుపఁ; దలఁచుటది యెంతయేని యొఱఁ దప్పిదంబు.

క॥ తన పాదములు మనమ్మున, ననయము మననమ్ము సల్పినప్పటికిన్ దాఁ
గనికరము కరము గని దా, నిని మున్వగఁ జూడకున్న నేరము హరిదా. 38

క॥ హరికిన్ హరిణమునకు నం, గర మది హాస్యాస్పదంబుగా దనువారుం
డరు దానికేమి హరిణము, కరి నెదురైయంద మెట్లు ఘటియించునటుల్.

ఉ॥ రంకుపు శిఘ్రిగామియని రాజులు పట్టపుటేన్గు వీడి రా
జ్యాంకము గాఁగఁ గైకొనిరె యక్కటకి యేనుఁగుతోడఁ బోర నా
జింకకు శక్తియున్నదె? ప్రసిద్ధికినై "యెదిరింపు" మంచు నే
కొంకును లేనివారు పురికల్పినమాత్రన యేమిలాభమో. 40

చ॥ అరులకభేద్యమైన చతురంగబలమ్ములు గల్గుటేనితో
గొఱియలగొల్లటేఁ డెదురుకోలు ఘటింపఁగ నెంచి "మీరలున్
గొఱియలతోనె రండనుచుఁ గోరిన "సీ" యని రోసి దానికే
"సరి" యని సిద్ధపడ్డ వెడజాబుపరాబుల డాబు లేటికో. 41

క॥ తిరుపతి యెట్టిదియో కొ, వ్వరమెట్టిదియో కవిత్వభర మెట్టిదో సం
స్కరణం బెట్టిదియో ధి, క్కరణం బెట్టిదియో తెల్పఁగల రవ్వారల్.

చ॥ పరు వెటువంటిదో చెలుచు బాసయు నెట్టిదొ లేశమేని సం
స్కరణము పూజ్య మయ్యు సరిగంగలనాడుట యెట్టిదో సమ
స్ఫురణకు నాసనమ్ము నెడఁ బోరెడిధీరత లెట్టి వొక్కొ వి
ష్టరము లొసంగు టెట్టిదియొ సత్కవితా వనితా వినోదముల్. ౫౭

ఉ॥ కోరిక యెట్టిదో యచటఁ గొం కుదయింపమి యెట్టిదో పరి
ష్కారము లెట్టివొక్కొ మమకారము లెట్టివొ యంతఁ బోక ధి
క్కారము లెట్టివో పయివికారము లెట్టివొ బారుబారలం
కారము లెట్టివొక్కొ యధికారమదెట్టిదొ కారమెట్టిదో. ౫౮

ఉ॥ సారము లెట్టివో పయి న సారము లెట్టివొ కాలుద్రవ్వ ఝుం
కారము లెట్టివో పయిఁ జకారము లెట్టివొ యంతలో దభ
క్కారము లెట్టివో మఱి నికారము లెట్టివొ పిమ్మటం దిర
స్కారము లెట్టివో పొరిఁ జూకారము లెట్టివొ కాలు లెట్టివో. ౫౯

ఉ॥ బీరము లెట్టివో తిరుగు బేరము లెట్టివొ పిమ్మట న్నమ
స్కారము లెట్టివో పయిఁ బ్రకారము లెట్టివొ యాపయిన్ వష
ట్కారము లెట్టివో పయి నకారము లెట్టివొ మీదుమీదు నా
కారము లెట్టివొక్కొ నుడికారము లెట్టివొ వైరమెట్టిదో. ౬౦

ఉ॥ హారము లెట్టివొక్కొ వ్యవహారము లెట్టివియొక్కొ యీచమ
త్కారము లెటివొక్కొ బయికారము లెట్టివియొక్కొ పై బహి
ష్కారము లెట్టివొక్కొ యుపకారము లెట్టివియొక్కొ యీయహం
కారము లెట్టివొక్కొ యపకారము లెట్టివొ నేరమెట్టిదో. ౬౧

ఉ॥ పారము లెట్టివొక్కొ పయివారలశూరత లెట్టివొక్కొ స్వీ
కారము లెట్టివొక్కొ గుణకారము లెట్టివొ చుట్టునున్న ప్రా
కారము లెట్టివో పయి లకారము లెట్టివొ చాటు చాటు న
త్కారము లెట్టివో తెలుపఁగాఁ గలవారలు పండితుల్ గదా. ౬౨

చ॥ కవి యన నెట్టిఁడొకొ కవిత గాఁ దగునట్టిది యెట్టిదొకొ వృథా
రవణము లెట్టివొకొ కవులరావము లెట్టివొకొ సత్కవీశ్వరో
త్సవ చరితము లెట్టివొకొ బుధత్వ మదెట్టిదొకొ యేరి కేరికిన్
శివకొ శివకొ సామ్య మెట్టిదియొకొ చెప్పఁ గలారు బుధోత్తముల్ గదా. ౬౩

చ॥ ఎవరును నేరు సుకవియెడ నెల్లరు మెచ్చఁగఁ గూకుచున్న వె
ప్పరు సుకో! యెరికిం దగదొకొ యకవులకొ శక్తులు పట్టి చూచి "వీ
రక్రవు లలవారలో! కవులు గాఁ దగువార"లటంచుఁ దెల్పఁగా
నెవరితరంబుకొ పండితకవీంద్రులు దక్క జగత్త్రయమ్మునన్. ౬౪

ఉ॥ రా మనిరొకొ! పండితులు, రమ్మని కోరనె లేదొకొ సద్యశః
కాములు మీరు వారివయిఁ గా లటు ద్రివ్వి యుపేక్ష సేయఁగా
నేమి! వృథాగ లోకమున కింత పరిశ్రమ మేల పెట్టినా
రీమెయి నూరకుంట తగునే! యని కొంకెద మంచుఁ బోవుచో. ౬౫

ఉ॥ ఏమిది! యీజనంబునను నింతటిపక్షము వారియందుఁ, ద
న్మానము వీరి కింతగ మనమ్మున కెక్కఁగ నేల! కావ్రిపు
న్మానము కోపపాత్రముగ నాటగ నేల! స్వదేశవాసు లన్
ప్రేమముగూడఁ గన్పడ దరిపత్రికరమ్మును మించి రీవ్రిజల్. ౬౬

చ॥ అని మనమందు నెంచుకొని యవ్వలి పక్షపువారు "మీరు వ
చ్చిన పనిచూచిపోవుటకుఁ, జెప్పెడిమాటలు పెద్దమాట, లే
ఖ్యను లయి మీకుఁ గష్టములు గప్పెదకొ రింతటి కంఠశోషకుం
బని గనుపట్ట" దంచు నుడువన్ "బని లేనిదె వచ్చినారమే. ౬౭

మ॥ కవితావాద మటన్నఁ జూచుటకునై కష్టించి యీసత్ప్రభా
సువిశేషంబుల నాలకించుటకు నచ్చోనుండి యిచ్చోటికిన్
జవసత్త్వమ్ములు వెచ్చఁ బెట్టుకొని రాఁ జన్నే! వృథాహంకృతి
ష్ఠవిరుల్ సించినపత్రికల్ గని యథార్థం బంచు నూహించుచున్. ౬౮

మ॥ అదిగా మారక వ్యాఘ్రముం గదుపులా నంతంత మిత్త్రెక్కి నె
మ్మదికి న్నెమ్మది దక్కి హీనములపై మాత్సర్యమున్ బ్రక్కి సా

గద యంచున్ దల ద్రొక్కి పాలుకవులన్ గన్గొంచుఁ జనన్ రాదె! యే
మిది! మీపూనిక యెందు డిందె!' నని పేర్మిన్ ద్రిబలుల్ గాఁ గూడదే ఉన్

చ॥ అడిగెద మేము మీ; మ్మ్రకుసుఁ డట్టులె మమ్మ్రను మీ, రటన్న వె
న్బడమి యదెట్టిదో? కపటపద్ధతు లుద్ధతు లెట్టివోక్రా! యా
గడబిడ లేమి యయ్యెనుకొ? కా లటు ద్రవ్వుట దేడ కేగెనో!
మడవులు ద్రొక్కి మీసమును మట్టునడావడు లేడ డాఁగెనో. ౨౦

ఉ॥ "మీసము" లంచు మీసములమీఁదికిఁ బోవుటె కాక వారియ
ర్థాసనమందుఁ జేరుటకు నాసన మూఁచుటె కాక యెన్నియో
దోసపు బాసలన్ గిలికి దుందుడు కందుటె కాక పై రసా
భాసము చేసి పాఱుటది భావ్యమె కొప్పగపుంగవీశ్వరుల్. ౨౧

చ॥ సమరము చూచి ఖేచరులు సంబర మందట యెందు విందు మ
య్యమరులుతోలె సభ్యులు జయాపజయార్థులు గాక వారు వి
శ్వము లిడ నెవ్వ "రద్గుఁడు వసన్ గనుఁ డగ్గెద' యంచు వారు న
క్రమముగ వ్రాయ నందులకుఁ గాక పరాఙ్ముఖులైతి రేటికో. ౨౨

ఉ॥ గ్రుద్దెనఁ టాంజనేయుఁ డొక గుద్దను రావణుఁ బట్టి, మూర్ఛమై
నద్దివిజారి జాఱి తెలివంది "బళీ" యని మెచ్చెనంటి? యా
సుద్దికి నంజనాసుతుఁడు సుంతయు నంతస మంద 'కొరవి? నా
గుద్దురుచిన్ వచించు టొనఁగూడెను గా? యని వంచె వక్త్రమున్. ౨౩

ఉ॥ "మీసము" లన్న "జు" ట్టనుచు మిమ్మ్రను వారన వచ్చుఁ గాదె! యే
వాసియు లేనివారియెడఁ బంతము పాడ్ఙ్ఞుల కేలని? మీరసా
భానపువాఁతయే తెలుపుఁ బండితదూరు లటంచు; సత్వభా
దోనము మీది, మీ రిఁక నొదుంగక చేసెడి దేమి కైసరుల్. ౨౪

వ॥ "గురుతరలీల" పద్య మది కో! యని యార్చుచు నుండె మీరె పై
బరు విడుకొన్న వారలు సభం బొనరించుట కంచు, నేల యీ
పిఱికితనంబు నెవ్వఁ డని బిట్టడుగన్ వలె నంచుఁ బోయి కొ
వ్వరపుకవుల్ కనంబడక వచ్చిరి వార్త్రముఁ జూడ నంబరో. ౨౫

చ॥ ఆపు దాకచోట విందునకునై చనియుంటిమి మేము మా నివా
సపదము చూచి వీరలును జాతిరో! యని యాడుకొంచు న
ట్టిపనియు నుండునే! యనుచు, డీకొని కొట్టెడిసేనపోలికన్ న
య్యపరిమితప్రజానిచయ మయ్యెడకే చనుదెంచె నంతటన్. ౨౬

శా॥ అందుం గొందఱు బ్రాహ్మణుల్ మఱియు వైశ్యశ్రేష్ఠులుం గమ్మవా
రెందుం గన్పడి రిందఱున్ వితతులై యేతెంచుటం జేసి యం
దం దించించుక గోష్ఠి గల్గు టనుమేయం బయ్యె నాయంబ! మే
మెందు న్మెట్టనియుండ మిందఱును దాదృగ్రక్తి నంపన్నులన్. ౨౭

ఉ॥ నాలవజాతియందలిజనంబులు తూర్పున నుండ్రు గాని యీ
నాలవజాతివేఱు వయి నాగరికత్వముమాట కేమి వి
ద్యాలయములన్నఁ బ్రాణముల నర్పణ చేసెడిపాటిభక్తులుం
జాలఁ గలారు కమ్మకులజన్ములలో శతమున్ సహస్రమున్. ౨౮

ఉ॥ చారలు నన్నులుం గడు నవారిగ వీధికి రెండుప్రక్కలన్
బారులు గట్టి నిల్చి యిటు వచ్చుట, క్రొపువారిఁ జూడఁగాఁ
గోరికతోడ నేగి తమకున్ మఱి వా రగువట్టమిన్ వృథా
యై రహిఁ నిండ్లకున్ మరలు, టాదిగ నొండొరు లాడుకొం చొగిన్. ౨౯

శా॥ అయ్యా! తిర్పతివెంకటేశ్వరులు! మే మత్యాశమై వేడ్కన్ మీ
కయ్యంపున్ సభఁ జూడ వచ్చితి మిటన్, గా ద్రివ్వినా రెవ్వ రా
య్యయ్యల్ మోమును జాటు వెట్టిరిఁక మా యాయాసముల్ వ్యర్థమే
యయ్యెన్, వచ్చినత్రోవఁ బోవుదుమొ, లేదా? యుందుమో? తెల్పుఁడీ. ౩౦

చ॥ ఎఱుఁగుదు మేము "కొత్పర" మదెట్టిదొ? వారిని జూడ రాము, మి
మ్మెఱుఁగము మీదుపొత్తముల నింపెసలారు "ఫొటోలు" దక్కనేఁ
డరసితి మయ్యె ధన్యము భవాదిక; మూరక పొమ్మటందురో?
దరిసెన మిచ్చి నందులకుఁ దగ్గఫలం బొసఁగం దలంతురో. ౩౧

చ॥ అనుచు ననేకభంగుల జనావళి మాపయిఁ గల్గుప్రేమమున్
నుపడఁగ జేయుచున్, బలుకఁగా నభుడేము వసించుసౌధ మె

య్యన డిగి నాటకాలయమునం దొక మేటిసభన్ బొనర్చి నే
ర్చినగతి వారికిన్ గలుగఁ జేసితి మగ్గల మైన మోదమున్. ౧౩

సీ॥ “తిరుపతివేంకటేశ్వరులఁ జూచితి” మంచుఁ బలుమాఱు సంతసంపడెడివారు,
ఉవ్వెత్తుగా లేచి యొక్కడదండములఁ బడి నమస్కారమ్ము లిడెడివారు,
కొపరింపువారల కీగొడవఁ దెచ్చుట మేలె యయ్యోఁబోరి యని పేర్కొనెడువారు,
కయ్యంపుసభఁ జూడఁగలభాగ్య మిఁకఁ లేదు వారుపాటిరటంచు దూఱువారు,

గీ॥ పాట కేమి యొనర్తురు వారికున్న, సరకు నెఱుఁగమె యని చర్చసలుపువారు
ఐనచోఁ గాలు ద్రవ్వనేల నెడివారు, అడుగుమవ్వారి నట కేగుమనెడువారు.

ఉ॥ అన్నిట వీరిదృష్టిని శతాంశము వారలు గారు దద్దడన్
దుస్సుకవిత్వమందు వలఁతుల్ మనవారలె యౌదు, రంచు; నే
మున్నది దానిలో ననుచు, నుండిన దేదియొ యున్న దంచు, నా
తెన్నొకకష్టమే యను, చుదీర్ణతరమ్ముగ వాదులాడుచున్. ౧౪

ఉ॥ ఏమియు రానివార లెటు లేది యొనర్చిన మంచి దౌ సుధీ
గ్రామణు లట్లొనర్చునెడ గ్రాంథికు లొప్పరు సాఁగఁ దీతు రిం
తే, మనవారు వోలె నలతిర్పతివేంకటపండితుల్ వచ
స్తోమము జార్చ లేరె యది దోసము గాఁ దలపోయ కుండుచో. ౧౫

ఉ॥ జార్తురు గాక నో రెటులొ చయ్యన, నెయ్యన నల్లె పద్దెముల్
గూర్తురుగాక వీరు “చెవి గోసిన మేఁకల” పోల్కిఁ జాలనే
పార్తురె! డయ్యరే? యుభయు లంత బలాఢ్యులె దేహదార్ఢ్యమం
దేర్తురు కొప్పరంపుఁ గవు లీకవియుగ్మము నెక్కు డ్రేల్మిడిన్. ౧౬

చ॥ అనునెడ దేహదార్ఢ్యమునఁ గా యలవారలు గాలు ద్రవ్వ రి
ప్పనియెడ నేను జాలనొకొ? పాండితియన్న భయమ్ము గాని వీ
రిని మఱి వారినిం గలిపి రేనియు నాబుజ మొక్కటే సుఁడీ
పనిఁగొని యాఁపు నం చొకఁడు బాహుబలాఢ్యుఁడు పల్కె నల్కమై. ౧౭

క॥ అని వారి వారికిన్ దోఁ, చినగతిగాఁ “బిచ్చపాటి” చెప్పికొనుచు భో
జనపుం బసలకుఁ జని మఱి, దినమున నటనుండి బయలుదేఱిరి వారల్.

చ॥ నెలవును ద్రానె సూరులనకుఁ జెచ్చెర వేంకటశాస్త్రి మున్నె, యీ
కలహము లేలునంతకును గాల్గదలింప నటంచుఁ బంతమున్
గలిగి వసించె నప్పురిని, గయ్యపుసంగతు లాలకించి శి
ష్యులు మఱికొందఱయ్యెడకుఁ జూడఁగ వచ్చి తనున్ భజింపఁగన్. ౯౦

చ॥ సరసులు యోగ్య పౌజనులు సంతతమున్ గవితాదరమ్మునై
నెరఁగుచు విందులన్ దనిపి యెంతయు గౌరవ మాచరింప న
స్పురమది వాసమై యచటిపూజ్యులకున్ దలలోనినాలుకై
తిరుపతి యప్పు డప్పు డరుదేరఁగ, వెంకన యుండె నయ్యెడన్. ౯౧

శా॥ "ఆసీమాంత మెనర్చి గాని విడువం డావెంకటేశుం" డటం
చాసీమన్ జనులెల్లఁ జెప్పికొన నిత్యమ్మున్ గవిశ్రేణి కెం
తే సంతోసము గూర్చుచున్ విమతు లంధీభూతచేతస్కులై
యీసున్ జెంది కృశింప మూడునెల లందే యుండె నుద్దండతన్. ౯౨

ఆ॥ వె॥ మొదటఁ గాలు వెట్టినది యల్ల* శిష్టాహ్వ, నామధార్యగేహసీమ యచటి
నింబభూరుహంపునీడ సాక్షాత్కల్ప, పాదపంబునీడ గాఁ దనర్చె. ౯౩

ఉ॥ చాపలు నిండి బల్లలకుఁ జాలి గజికకణకీలితంబు భూ
మీపద మాక్రమించి పయిమిక్కిలి వీథికిఁ దాఁకి గేహపుం
దాపున నున్న యన్యసదనంబుల ప్రక్కల నిల్చి సారెకున్
శ్రీపతి వేంకటేశ్వరులు చేయుప్రసంగము విందు రెల్లరున్. ౯౪

శా॥ ఆరంబాని నింబమూ సీనివాస మదియొకి యభ్రంకషానూనశా
ఖం బచ్చో నెపు డీవు పొల్చు టది సిక్కెంబే, భవత్సాక్షికం

---

(గుంటూరినుండి బ:కలు దేఱు సమయమునఁ జెప్పినది.)

* సీ॥ తిరుపతి వెంకటేశ్వరుని కొండకు నీకు భేదమే కనుపట్టలేదు తల్లి, శ్రీ
శైలమల్లేశు శిఖరమ్మునకు నీకు భేదమే..., మధురమీనాక్షి వేశ్మస్థలికిని నీకు
భేదమే..., కాశికావిశ్వేశగర్భగుడికినీకు భేదమే... తల్లి, తే॥ గీ॥ ఎట్టిసుముహూ
ర్తమందుఁ దాఁగట్టెనొకొ, ఘనుఁడు శిష్టాహ్వనామధాఖ్యాక సుకవి, అడుగు
వెట్టిన దాది బ్రహ్మసభఁ జేసి, పంపుచుంటివి నినుబీడ వలసె నేఁడు. (వెం॥ శా)

బుం బూజ్యాశయసాక్షికంబు నగుచుం బొల్పారుతత్త్వప్రభా
లంబంబౌ కవితాప్రసార మది యేలా నొక్కి వ్రాక్రుచ్చుటల్, ౯౫

మ॥ ఎటు నీభక్తులవాఙ్మధుద్రవము లందేపారె, శత్రువ్రజం
బటకున్ వచ్చి మనంబునందు నెటు "ఫీ" లౌవార, లాకొప్రపం
గటువాక్యమ్ముల కెట్లు వా రురక దుఃఖం బందువా, రెట్లుగాని
గుటకల్ మ్రింగెడివారొ నీ సమది మెఱుంగున్ జెప్పఁగా నేటికిన్. ౯౬

ఉ॥ ఐనను శాఖ బాధ కయి యాపలికిం జని తప్పచొప్పలన్
బూని యవాచ్యముల్ గిలికి పుచ్చియు నెమ్మన మాఁగ లేక మా
పై నెనరున్నయట్టులుగ వచ్చి రసం బది గ్రోలి పోవు వా
రేని యథార్థముం దెలియు నెల్లరు నీవును డాఁగుచుంతురే. ౯౭

చ॥ ఎలమి వచించి తీరవలె నీకపటాత్ములసత్స్వభావ; మీ
యలఘుల కేమి శత్రువులపైఁ మఱి మావచనంబు లెట్లు వీ
నులకు రసాయనంబు లగునో యవి జీర్ణము లైన వెంట లే
ఖుల కపవాదముల్ గిలుకఁగాఁ గరముల్ దురగాడు రెట్టులో. ౯౮

క॥ ఖలజనులవర్తనములకుఁ, దల యూస తోఁక యని చెప్పఁ దరమే యలపా
పుల కేమి నింబకుజభూ, తలసభ ఁవి యెంత కేని దగు జగదంబా. ౯౯

శా॥ అరు లగువారి కిట్టు లెదయందలికుంపటివోలె నుండి యా
తిరుపతివెంకటేశ్వరులు "తీర్పరులన్ బిలిపింపుఁడీ, సభన్
జరుపుఁడి మీసముల్ తెఱుకఁ జాలినచోఁ బెఱుకుం డ" టంచుఁ దీ
వరముగఁ దెల్పఁ గొప్పగవువారిబడాయి కిమ్మక్రమమ్ముగన్. ౧౦౦

ఉ॥ తగ్గి యిదెట్టు లేనియును దప్పికొన న్వలెనంచు నంతటన్
బగ్గెలు వ్రాయ మాని తమపక్షము దుర్బల మౌట నెట్టులు
న్నెగ్గ దటంచు లో నెఱిఁగి *నెయ్యుఱకుం గడు గూఢవృత్తి పై
నగ్గతి డాఁచి స్నేహ మగు టర్థ మటంచు లిఖించుచు న్వెసన్. ౧౦౧

---

చెన్నపురి; లైబ్రరీ, గురువారం.

*....నిన్న కొప్పరపుంగవులు నాపేర 8 పేజీల ఉత్తరం వ్రాసినారు, వివాదప

చ॥ పయికిఁ బ్రగల్భవాక్యములె పల్కుచు నప్పరసుండె తీరికన్
గయికొని కూరుచుండిరి ప్రకంపితమైన మనంబు చందమె
ల్లయెడల నెల్లరుం దెలిసి "బ్రావొ" రంచు వచించుచుండున
ప్రియములు పూర్తిగా వినియు బీరము పూనర వారు మాటలన్. ౧౦౨

ఉ॥ అంతట వారిపక్షమున కాదరు వాకుల వృద్ధుఁ "డక్కటా!
యంతన తేలి పోవు నని యంపు మటంటిమి పత్ర మల్లవా
రెంతటి పట్టు పట్టిరో కొని యిప్పరి మీఁదరు కొప్పరంపు వా
రెంత లవారి ఘాటి; కిపు డేమనుకొన్న మతేమి లాభమా. ౧౦౩

మ॥ పులిపై బెద్దను వేసి చెట్టుపయికిం బోవన్ వెసన్ దక్కఁ జ
స్థలమందే యది పీఁట వెట్టి యెటులో సాధించుఁ గాదే పగన్
దొలి నాలోచన చాల దయ్యె నపు డేదో వ్రాయు మన్నార మి
ష్టులఁ దెంబో కది "యేకు పే,, క నెడిసామ్యం బయ్యె నెట్లో కదే ౧౦౪

ఉ॥ పాపము! "వారిదాసులము వారలలోన శతాంశమేనిఁ గా
మోపము వారి,, కంచు నతిమోగ్యుఁడు కొప్రిపు జ్యేష్ఠుఁ డప్పుతా

---

రిత్రమును వ్రాసినారు, తమదోషము లేశమును లేదనియు వెం॥ శా॥ అన్యాయముగా గర్హించిరనియు, మొదలుగా వ్రాసినారు. దానివైఖరిచూడఁగా వివాదమునుండి తప్పించుకొనుట కిష్టపడుచున్నారని దోఁచుచున్నది. అట్టిప్రయత్నమున్నచో తప్పక మీరును అంగీకరింప వేఁడెదను ఈ వివాదసభలు కార్యకారులు కావు. నడుమ వారికి పండువు, పోరాడువారికర్వరకు శ్రేయము కన్పడదు, ఈసభలలో తీర్పుతీర్చువా రెవరు? ఎట్లుసాగును? "లోకోభిన్నరుచిః, తత్రాపి స్వస్వపక్షాభిమానోబలవాన్ బాధతే, వారు "ఛాలెంజి,, ప్రచురించినందుకు, శివరామశాస్త్రి మరల ప్రచురించెను. ఇంతట నాఁగిన బాగుండునని నేను తలంతును నాప్రార్థన మిదియే. ''.... ఏవిధముననైనను తగవుమాపుకొనుట బాగు, నేను వారికేమని సమాధానము వ్రాయుటకును పాల్పోకయున్నాను, జబాబు వెంటనే వ్రాయించవలెను...."

వే॥ ప్రభాకరుఁడు.

నోపిన యంతవట్టు మొగ మోడక చెప్పె వృథాభిమానపుం
దాపము నాఁడు మామదికిఁ దద్వచనమ్ముల నెక్కొనీ దహో. ౧౦౫

ఉ॥ ఎంతటి ధైర్యముల్ మఱియు నెంతటిశక్తియు లేక యున్న ని
శ్చింతగ నాఁటి సత్సభ "సనేమిర వారల శాసనంబు మా
చెంత ఘటింపఁ గూడ,, దని చెప్పఁగ నేర్చునె? వేఱు సీమ య
న్నంతన భీతి పుట్ట వలదా? కలదా? యిటువంటిచేవయుల్. ౧౦౬

చ॥ ప్రముఖుల పెంతమంది పని పట్టిరి మక్కొటని? వారిముందు మా
ఱ మయితి మింత కెంతటిపరాభవ? మూరక కొప్పరంపువా
రి మొరప మిక్కుతమ్మునఁ బోరిం బోరిఁ దగ్గఁగఁ జూచ్చె నేయుపా
యమున నొ వీరిపైఁ బడున పాయముఁ బాయఁగఁ జేయఁగా వలెన్ ౧౦౭

మ॥ * అని యోజించుచు నుండె నంత నొకనాఁ డాయీప్రసంగంబు నె
ల్లను విన్పింప సభం బొనర్చి తగుహేలన్ వినిక్కి నేయంగ వ
చ్చినవా రెల్లరుఁ బత్రికల్ వినుచు మంచిన్ జెడ్డ యోజించుచుం
డు నెడన్ గొందఱు వచ్చి రయ్యెడకు నెట్లో యానద స్వాఁగఁగన్ ౧౦౮

* నిష్పక్ష పాత హృదయులును యథార్థపరిజ్ఞాతలును గుంటూరుపురవాస్తవ్యులు నగు నార్య సోదరులారా! కొప్పరపువారు ప్రతిజ్ఞా పూర్వకముగా 27 వ తేదీ ఆదివారమునాఁడు సభకురావలయునని ముందుగా మాపైఁ గాలుద్రవ్వి పత్రిక వ్రాసి, యందులోని యసందర్భములను దెల్పుచు మేముత్తరమీయఁగా వానికిఁ దగు సమాధానము వ్రాయక యేవో కొన్ని యుక్తులతోఁ గొన్ని యుత్తరములు వ్రాయుచు సభ ఆదివారము దప్పించి సోమవారమునకుమార్చి తుద కాదివారమునాఁటిరాత్రి యనేకగ్రామములనుండి నిచ్చేసిన మహాజనుల నిఫలమనోరథులం జేయుట యుచితము కాదని మేమాదివారమునాఁడు వ్రాసిన యుత్తరములోఁ గొన్ని పండితసమ్మతములైన నిబంధనము లుదాహరించి "యీ ప్రకారము మీరు సభకూర్పఁడు లేదా మేము గూర్చెదము అంగీకారానంగీకారములు శేపుదయమునకు దెల్పఁడు లేదా మీరీయుద్యమము మానుకొన్నట్లే ప్రజలుదలంతురుగాక" అని స్పష్టీకరించినను దానికి జవాబు వ్రాయక సభానికా యదినమునందుఁగూడ నుదయము 8 గం॥కు మరల రిమైండరు పంపినను దాని

ఉ॥ వచ్చిరి గాని యీసభ యవార్యముగా జరిగెన్, సమస్తమున్
విచ్చిన నంటిపందుబలె విజ్ఞులదృష్టికి స్పష్టమయ్యె "ని
ష్పచ్చర మొందు కీర్తి గబాగబలాడరొకోకొ?,, యటంచు వె
న్నిచ్చిన వారి మాటకి "హిహిహీహి యిహీహిహీ?,, యని కొంద ఱాయ్యెడన్. ౧౦౯

---

కని నేమిముచ్చటలుకొక చల్లఁగా నాదినమెల్ల దాఁటించి ఆమఱునాఁడు 29 వ తేదీని మాకొక వసరగను లేకున్నను నేఁమమరల "మియుద్యమము మానుకొనవలెను యనితలఁచి నేము దాకినాడ వెళ్లుచున్నా"మని వ్రాసిన యుత్తరమునకును దగిన సమాధానము నేము వ్రాయుచుండుటచే వారు సభను మానుకొన్నట్లు ముమ్మాటికిని స్పష్టపడినది. పిదప సభామాటట్లుంచి మీ మా యుత్తరప్రత్యుత్తరములలోని సారాసారములును న్యాయాన్యాయములును ప్రాజ్ఞులమూలముగాఁ దీర్చికొని పిమ్మట విద్యావాదమునఁ బ్రవర్తింతమనియు, ఇందులకు రేపుదయము 8 గం॥కు లోఁగా జవాబివ్వవలయును 29వ తేదీ రాత్రి 7గంటలకు మా వ్రాసిన యుత్తరమునకు నేఁడు 10, గంటలకు ననవసరపు యుక్తులతో దానికిఁగూడ నంగీకారమును దెల్పక "యుత్తరప్రత్యుత్తరములు ముగించుకొన్నాము" అని వ్రాసిన యుత్తరమునుగూడఁ జూచి వారికి జవాబు వ్రాయుట యింతతో ముగించుకొని ఆయీయంశములు లోకులకు ప్రకటింపఁ దలఁచి ఈనాఁటి సాయంకాలము 6ఘంటలకు శ్రీ ఫస్టుకంపెనీ నాటకశాలలో నుపన్యసించుచున్నారము గానఁ దామెల్ల విచ్చేయఁ బ్రార్థితులు.

ఇట్లు,

గుంటూరు, 30-8-11.                తిరుపతివేంకటేశ్వరులు. శతావధానులు.

పైనుదాహరించిన యాహ్వానపత్రిక ననుసరించి శ్రీ ఫస్టుకంపెనీ హాలులో వ॥ న సేటులు వారలును నితరులునునగు మహాజనులు నియమితకాలమునకు మున్నే వచ్చియుండిరి. పచ్చయప్ప కాలేజి యుపాధ్యాయులగు బ్ర॥ శ్రీ॥ మల్లాది వెంకటసోమయాజులవారి కోరిక ననుసరించి శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులు బి. ఏ. ఎల్. టి. (నీగురు కాలేజీ యుపాధ్యాయులే) గారగ్రాసనాధిపత్యమును వహించిరి. వీరు సంస్కృతాంధ్రములలో గ్రంథముల రచించిన పండితకవిసత్తములు. పిదప నాయీయుత్తరములు తిరుపతివేంకటేశ్వరులు వినిపింపఁ దొడంగిరి. మొదట వెంకటశాస్త్రిగారు శ్రీకొప్పరపువారి మొదటియుత్తరమును మాత్రము

ఉ॥ పనిగొని యుత్తరాల్ వినుచుపట్టున నాసభ నాఁగుపూనికన్ వ
చ్చిన యల శ్రీనివాసగుణశేఖరువైఖరి "కొప్పరంపున
ర్తనములయుత్తరమ్ము లవి ప్రాజ్ఞసభానుకూలదుర్వచః
ఖను లని యెల్లవారలకుఁ గన్గొనఁ జెప్పక చెప్పె నొప్పఁగన్. ౧౧౦

---

వినిపించి ఆనాఁడే 12గంటలు మొదలు మూఁడు గంటలవఱకును గోష్టులోఁ గంసాలులనుగూర్చిన వ్యాజ్యములో సాక్ష్యమిచ్చి యుండుటవలని యాయాసము చేఁ గాఁబోలును పదపడి యుత్తరములను దిరుపతిశాస్త్రిగారిని వినిపింపుమనిరి. తిరుపతిశాస్త్రిగారు వినిపించుచుండఁగాఁ గొందఱు పెద్దమనుష్యులువచ్చి యంతతోఁ బ్రకృతసభ ముగించుటకై వెంకటశాస్త్రిగారిని గోరిరి కాని తగినంత హేతువునఁ జూపి కోరనందున వెంకటశాస్త్రిగారందుల కంగీకరింపరైరి. పిదప గంభీరముగాఁ దిరుపతిశాస్త్రులుగా రాయాయీయుత్తరప్రత్యుత్తరముల నుపన్యసించుచుండఁగా వేంకటశాస్త్రులుగారు దానినాఁపనుంకించువారితో సహేతుకముగా మెల్లఁగా నుపన్యసించుచుండిరి పదపడి సభ నాఁపుడని కోరినవారు తామేదో మధ్య చెప్పుటకు నవకాశమిండని కోరిరి అందులకును దుట్టతుదకుఁ గాని వీలులేదనియు నప్పుడేని యగ్రాసనాధిపతుల నడుగఁదగియుండుననియు వెం॥ శా॥ గారు బదులు చెప్పిరి. పదపడి యుత్తరములనెల్ల దిరుపతిశాస్త్రిగారు వినిపించిన పిదప నెవరు సమర్థులో, యెవరు కారో, యెవరియుత్తరములు దరువుగా నున్నవో యెవరివట్టివి కావో యెవరు కోరిన షరతులు పండితసమ్మతములో యెవరివి కావో, యెవరి వెనుకయీఁత వలన సభ కాలేదో, లోనగు నంశములు సభ్యులకే కాక సభ నాఁపవచ్చిన యుత్తమపురుషుల హృదయములకుఁ గూడ స్పష్టపడినవి. ఆ యీయంశములనే శ్రీ అగ్రాసనాధిపతిగారు తుట్టతుద నుపన్యసించుచు "మీసములపద్యము యొక్క యర్థమును గూర్చి", తాముగూడ నిదివఱకుఁ బొరపాటుగానే యన్వయించుకొంటిమనియు నిప్పుడది స్పష్టముగాఁ దెలిసినదనియు నుభయభాషలు రానివారు దానిజోలికిఁ బోఁగూడదనియు సంస్కృతము రాని తెలుఁగు గణనీయము కాదనియు నుపన్యసించుచుండఁగా సభ నాఁగుపూనికతో వచ్చేసిన వారు ప్రకృతమా విషయము నాఁగవలసినదని కోరిరి. దానిమీఁద నగ్రాసనాధిపతిగారు "వీరికోరిక ననుసరించి యాపద్యార్థము నిప్పుడు విస్తరింపక వదలితి"మని చెప్పి యావిషయము మానితమకీయుభయకవులయందును భగవంతుఁడు న్యాయముగాఁ దోఁపించిన యభిప్రాయమును వెల్లడించిరి. ఆ దివిని సభ్యులెల్ల నా

చ॥ జ్వరితుఁడ నయ్యు సజ్జనులు సారెకు రమ్మని పిల్వ రానిచో
గరువము గాఁ దలంతు రని కస్తి గణింపక వచ్చినాఁడ ని
ష్ఠురపు నిరోగివై దిశలపాల్తి సుమంతయు నే నెఱుంగ దు
ర్భర మనమాన కక్ష యిటు రాఁ దగి యుండఁగ నెట్లెఱింగెదన్.

ఉ॥ వినను గాలు ద్రవ్వఁ దొసఁ గాదెన నుండుటఁ జేసి యంత మా
న్యై నెపముం గడ దీ విపుడు పత్రిక నంపెద వేనిఁ బోరికిం
డా నయిపిల్చినట్ల యయి "తక్కెడ" సామెత గాఁ దనర్చు నీ?
మానఁగదయ్య యిట్టి యసమాన పుఁ గక్షకు దీక్ష యేటికిన్.

ఉ॥ ఎప్పటికేని మాయెదుట నే పడఁగా వలె వార, లప్పుడా
తప్పు మదైత పద్ధతులు తజ్ఞులకున్ విశదంబు కావలెన్
చిప్పు ప్రసంగముల్ సలుపు పెద్దలతోడుత నీకు నేల? నేఁ
జెప్పిన మాట చొప్పునకుఁ జేతము చొన్పుచు మిన్నకుండుమీ.

చ॥ వెనుఁబడి కాకపుల్ తనదు వీపుజయిం జరణమ్ము లుంచి తా
నిన నది లెక్కగాఁ గొనక చిప్పకుఁ బూనక వైనతేయుఁ డే
మనక శిరమ్ము వంచుకొని యల్లనఁ బోవఁడె? శక్తిమంతు లెం
దును నలఁతుల్ పొనర్చు నలతుంటరి దుడుకుల్ గణియింప రంతగన్.

---

పుగారి సేగున వ్రాసిన జాబు చేరినది, మా యుభయుల నమస్కారములను అంగీకరింప వేడుచున్నాను, యథార్థవాదియొక్క వ్యాసము యథార్థముగ నున్నను లేకున్నను దానిసత్యాసత్యములు మేము గ్రహింపజాలము .........మీరిలేనిపోని కలహములలో జిక్కికొని ఆరోగ్యమును, బుద్ధిని చెడ గొట్టుకొనుట మాయ కిష్టము కాదు. వారిని గెల్చినను మీకీర్తి హెచ్చునా? ఇదివఱకే మీఖ్యాతిజగద్విఖ్యాతమైన పుడు మీకీపోరాటము లెందుకు? వారు కుర్చీమీద గూరుచుండిన మన కేమి? ఇంటి కప్పమీద గూరుచుండిన మన కేమి? మీబలాబలములు లోకము పూర్తిగ నెరిగియే యున్నది. ఈ పోరాటములను గుంటూరు చెరువులో దొక్కి వెంటనే బయలుదేరి రావలయునని మా ప్రార్థన..."

ఆ॥ నారాయణరావు.

ఉ॥ ఇంతకు నీవు పత్రికల నెన్నిటి నంపిన నేమి లాభ? మా
వింతకవీశు లెన్నఁటికి విజ్ఞులు తీర్పరు లున్నసత్సభా
భ్యంతరమందు నిన్నెదురువా రనుకోకుము వారితండనాఁ
గాంతు రెవారు వారికడ గంతులు వేయుచునుం డ్రెఱుంగుమీ, ౧౨౮

శా॥ "ఓ కెన్నో మఱివంక" లన్నఁ దెలియన్ రాజింపఁగా లేనిస
ద్ధీకుల్ వారికిఁ దోడు, వారిదియుఁ దాదృగ్విశేషంబె యీ
యేకాకారులు సత్సభాస్థలికిఁ దా రేమంచు నేతెంత్రి? నీ
వీకార్యమ్మునకుం గడంగకుము మేమే యుంటి మన్నింటికిన్. ౧౨౯

చ॥ అనుటయు నాతఁ డప్పటికి నన్యము చెప్పక మిన్నకుండె నె
మ్మనమున బాల్యచాపలము మానని చందము తోఁచుచుండె, నా
తని కొకకొంత తిర్పతి స్వతంత్రత నిచ్చె ననంతరంబు వెం
కనఁ గికురించి యిర్వురను గ్రక్కున నేగిరి "ప్రస్సు" ప్రక్కకున్. ౧౩౦

ఉ॥ * పద్దెము లచ్చు వేసి యవి పంపి నభోమణి రెండుయామముల్
ప్రొద్దును దాఁటునప్పటికిఁ బూర్తి యొనర్చిన మేటికావ్యమున్
దద్దయు మెచ్చుకొంచు బనదగ్గఱకున్ జనుదెంచి చెప్పి రిం
కెద్దియుఁ జేయ రామి సహియించెను వెంకన కొంతసుప్పతో. ౧౩౧

---

మ॥ రా॥ రా॥ శ్రీ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారికి.

* చ॥ తిరుపతి వేంకటేశులకుఁ దెంపరివై సరివైఖరిం గవీశ్వరుఁడగువాఁడు నోటనుడువన్ గడు సిగ్గిలునాశుధారకుల్, ఖురికొలుపం దలంచితె 'నమోనమ' యంచు వచింపకేటి య, ల్లరియిది సింగ మేభపలలంబు భుజింపక పూరిమేయునే. మ॥ అనిమిత్తంబుగఁ గాలుద్రవ్విన త్వదీయాహంత నాఁపుందలం, పున నీనీరసనిర్గుణాశుకవనంబున్ జెప్పి నిన్నెల్ల నెం, చిన యుష్మద్గురుపద్యులన్ సుకవితాశ్రీధుర్యులన్ మానిపిం, చి నినున్ గెల్వఁగ వచ్చినాఁ డిదె సభం జేయింతువో వత్తువో. ఉ॥ గంటలు గట్టికొంటివట? "గంటకువందలు వేలుపద్యముల్', గెంటుదునంచు' నేఁడు పరికించెద గెంటుటమెట్టిపోని నినుం, గెంటెద నేవధానమున గెల్చెద నీరసధారయందు నీ, ఘంటికలూడఁ గొట్టెదను గాచుకొనం గమా కింపుమిత్తఱిన్. సీ॥ గురుపాదసేవఁ జేకూఱిన వ్యాకృతిపాండిత్యగరిమ యుం టుండనిచ్చి, ఉభయభాషాకావ్య విభవాభిరామమౌ పాండిత్యగరిమ యుటుండని

శా॥ * రామస్వామి యనంతరమ్ము కవిసుధీరత్నమ్ము చెన్నాపురన్
సోమా పద్దెము లల్లి తెచ్చి యవి మమ్మాక్షేపింపఁ డన్నన్ క్షణం
బేమిం జెప్పక పిమ్మటం జదివి "సో? యీపద్దెముల్ వారిదౌ
సామర్థ్యమ్ముఁ గడున్ యథార్థముగ నిచ్చల్ నచ్చి వాకుచ్చెడిన్ ఁవ్రా

---

చ్చి, రసవత్ప్రబంధనిర్మాణధీచాతురీపాండిత్యగరిమయటుండనిచ్చి, సురుచిరలక్షణభరితాశుకవిత్వపాండిత్యగరిమ యటుండనిచ్చి॥ గీ॥ ఆశుతరసంబటంచుఁ గొండాడఁదగిన, తావకాశుకవిత్వంపుఁ జేవగూడఁ, దావకశతావధానవిధంబుఁ గూడఁ, జూడఁదలఁచితి వేంకటసుబ్బారాయ! చ॥ తిరుపతి వేంకటేశ్వర సుధీవరశిష్యుఁడ నాదుపేరు వేలూరి శివరామశాస్త్రి యని లోకము వాకొను నాఢ్యమైన వ్యాకరణము జీవనమ్ము నధికారము కావ్యపురాణనాటకాకరములఁ; జేయఁజాలుదు నఖండము నాఁగ శతావధానమున్॥

గుంటూరు
31-8-11

ఇట్లు వినీతవశంవదుఁడు,
వేలూరి శివరామశాస్త్రి,
శతావధాని.

---

* మహారాజశ్రీ కొప్పరపు సుబ్బరాయశర్మగారికి—సీ॥ అఱవదేశంబున నవధాన మొనరించు, టోకాదని యిదియు గుంటూరుసీమ, పల్నాటిసీమలోఁ బద్యంబులను జెప్ప, టోకాద! యిదియు గుంటూరుసీమ. ఆయూర నాయూర నాశుకవిత నెప్ప — టోకాద! యిదియు గుంటూరుసీమ, గుడివాడసీమలోఁ గొన్నియూళ్లను జెప్ప — టోకాద! యిదియు గుంటూరుసీమ, గీ॥ యెట్లుదక్కించు కొందురో యుపుడుమ్మురు, నిందుకొల్వున ఘనుసన్న దండిబిరుదు, లూరకేపోదు పూజ్యులఁ గాఱులటిన, నాశుకవిసింహ కుండిన హంసలార. ఉ॥ బట్టులరీతిఁ బద్యములఁ బల్కెదె కాని శతావధానమెం, తప్పులనేది చేసితిరి; పండితులెల్లరు మెచ్చినారలో, గుట్టుగఁ బోవకీగతిని, గొంటెతనంబు జేయఁజూతురే, "పెట్టులు క్రొవ్విపుంజులయి, చీతనుఁ జూపిన" లాగుఁదోఁపదో. గీ॥ జగతివైదికులౌట మీసాలఁదీసి, కొన్న నెవ్వరునవ్వరు; నిన్ను నవ్వ, కుండురే కన్నవారు నియోగివయ్యుఁ, మీసములఁగాచుకోలేక మిడుకుచుండ. క॥ గంటలఁ గట్టెవరే! ము, క్కంటికిఁ దురగములకు హాలికవితానంబీ, గంటలు మఱియే కార్యము, పొంటె వచింపుండు కొ

ఉ॥ వారలకన్నఁ దెల్గునెడ వారక సంస్కృతమందుఁగూడ నీ
వారయఁ బెద్దపండితుఁడ వైనను వారలు బ్రాహ్మణుల్ మహా
శూరులు మేల్నియోగులును "శూద్రుఁడ వీ" వని యీసడింతు రీ
వేరమునందుఁ గా లిడక వేగమ యేగుమ యంగలూరికిన్.

తే॥ గీ॥ వారితప్పదుఘారను వడిగఁ బోయి, సభ్యులగరంప నీకు నసాధ్య మొక్క
డేని పనివడ్డచో మేమె యేగ వలయుఁ, బిదపనిదితప్పటంచు నొప్పింపవలదు.

చ॥ అనుటయుఁ బిన్ననవ్వ నగి యాతఁడు "చిత్త" మటంచు నేగి గొ
మని మది నెంచెనో? తుదకు నాతనిపద్దెము లచ్చులోనికిన్
జనుటయ కాక, కొప్పరపుసన్నిధికిం జనె వీని నెల్ల మే
మనిపినవే యటంచును యథార్థ మెఱుంగని వారు దూఱఁగన్,

ఉ॥ ఉన్నయథార్థ మియ్యది మహోత్తము లొప్పుదు రంచు మేము సం
పన్నగృహస్థులం దనుప వ్రాసితి మింకొకకుఱ్ఱశిష్యుఁడున్

---

ప్రపుంగవులారా. సీ॥ శతఘంటకవనంబుసల్పుదు మన్న మీ- శక్తియడంపనేఁ జాలనొక్కొ-, అష్టావధానంబు నాచరింతుమనమీ - శక్తియడంపనేఁ జాలనొక్కొ-, ఆశుకవిత్వంబు నాచరింతుమనమీ - శక్తియడంపనేఁ జాలనొక్కొ-, సద్గ్రంథరచనంబు జరపుదుమన్నమీ - శక్తియడంపనేఁ జాలనొక్కొ-, గీ॥ ఇంగిలీషున వత్తురో యెఱిఁగియడపఁ - గరము నేఁజాలనొక్కొ- మూగురవులేల, రండు వేగముదొరుదులుదెండు పెట్టి - పొందు నిందుసభను గొప్రపుఁ గవులార. గీ॥ ఓడినారం తలపోయువాఁడమిరు - నాకుఁ బ్రత్యుత్తరంబును నీకపోన, ముద్రవహియించురేని నీముచ్చటెఱిఁగి - ముందుపనిఁ జూడుఁడీ కొప్రపుఁగవులార. క॥ ఇవ్వారా మా కవికిఁబోలెన్ । జవాబునొసఁగకయె వృథగ జంపునఁ జిపినన్, వ్యవసాయము సేయకుఁడీ । వ్యవధింగయికొనక యిందు ప్రత్యుత్తరమున్,

అంగలూరు,
3-9-1913.

ఇట్లు, బుధజనవిధేయుఁడు,
త్రిపురనేని రామస్వామి.

కొందఱు *సూర్యాలుశిష్యు లొకకొన్నిటి నంపిరి, మే మెఱింగిన
ట్లందఱు గాక యున్న జను లందరు గొందఱు మాన్ప నేర్తుమే ౧౧

చ॥ "తిరుపతివెంకటేశులకుఁ దీవ్రముగా సభ కేగుదెం డటం
చఱిముఱి వ్రాసి కొప్పరపుటాయన దా సభ కేగుదెంచెనే?
"పరపర" వ్రాసి రమ్మనినఁ, బాఱుద మంచల సూర్యాలుఁగుఱ్ఱ లెం
చిరి యని తోఁచుఁ జర్చఁ దగఁ జేసిన యోగ్యుల కెల్ల నిప్పనుల్. ౧౨

---

రాముఁడయ్యెడవిఁ గోతుల సాయము గోర లేదె? నీవు, శ్రీ గ్రహించి మీరు దయ చే
జయంబు వహించుఁడో బుధుల్. 9. క॥ తప్పక దయచేయుఁడు మీ. రిప్పరికి జ
బుదీని కిడుఁడు సరగున౯। మెప్పగనుఁడయ్య వైళమ? కొప్పరపు కవీంద్రులా
గుణమణులారా!

ఇట్లు
సుకవిపాదరేణువు,
వల్లమవాటి నరసింహశర్మ.
VIth Form C. Division,
Noble College.
Masulipatam.

---

శ్రీమత్పరదేవతాయై నమః.

11-9-11 బందరు.

*గురువర్యా! చ॥ మనమున భక్తినిల్పి దను మాధవపాద సరోజ యుగ్మ్మ చ
తనపరిలబ్ధదివ్యకవితా వనితా మహితప్రభావ సం। జనితలసద్యశః కుసుమ
జాలవి నిర్మితహార ధారుడై। తన రెడు వేంకటేశ్వరబుధాగ్రణిని మీపదుసా
కంజముల్ ఉ॥ ఇందులనుంచు పద్యముల నేనెరచించియు నచ్చువేయఁగా, నం
య మొందుగల్గితమనన్నిధి కంపితి వానిఁజూచి నా, కుందయ వ్రాయవేఁడెదను గా
కకయెట్టులు సేయుమందురో? యందులనుండుదోషములనన్ని యుదిద్దుచునంపవేఁ
దగ౯ మ॥ తమసందర్శనమెప్పుడబ్బునని చింతా క్రాంతచిత్తుండనై, కుముదంబులే
శశిఁగోరుభంగిఁదమవాక్సూనామృతాన్వేషసం, భ్రమమేపారనెసంగువాఁడనిటు

క॥ ఎటు దోఁచిన సరియే మే, మిట లేశమెఱుంగ మెఱిఁగియే మెవ్వరి నాఁ
గుటకు యతించితిమో? వి, స్ఫుటముగ శునుమున్న దానిఁ జూపితిమిక దా.

చ॥ చరితము గాన వ్రాయఁ దగుసంగతి వ్రాసితి మంతె కాని యే
తెఱుఁగరు మేము క్రొవ్వమున కిట్టులు శిష్యుల రేఁపి పంపుసం
బరమున కొప్పవారమొ? స్వబాహుబలమ్మునఁ బోవువారమో?
యరులు నిజం బెఱింగియును నాడఁగఁ జూచ్చిరి వేఱురీతిగన్, ౧౩౬

చ॥ ఎఱిఁగిన దేకదా? జగతి యెల్లఁ గుశిష్యుల రామకృష్ణులన్
మఱి యలయిర్వురందునొక మానిసె కన్న బహుశ్రుతుఁడు కొ
ప్పరమున వారి కంపెనొకపత్రిక *"నేత్రవధానమందు వ
త్తురె,, యని రామకృష్ణు లటుదూఁకఁగఁ జేసి రనంగఁ జెల్లునే॥ ౧౩౭

---

రాగ్రేసర స్తుత్యని,త్యము లేఖార్థము చూచునాఁడఁగృపతోన్నపంగఁ బ్రార్థించెదన్

చిత్తగించవలెను ఇట్లు తమశిష్యుఁడు

కోకా రాజారావు, హైస్కూలు, బందరు.

మ॥ రా॥ రా॥ శ్రీ. కొప్పరపు సుబ్బారాయశర్మగారికి... మ॥ "ధరణీచక్రము గూలఁగా వలదె! సప్తాంభోధి భాస్వద్వసుం,ధరభారంబు వహించి మించునలమాతంగంబులున్ వీడి; కొప్పరపుంబండితమానులార? తమకున్ భాషాద్వయీ కావ్యసం,భరితుల్ తిర్పతివేంకటేశ్వరులతో వాదంబు శ్రేయంబొకో,, మ॥ కరిశార్దూలమృగేంద్రసత్తములు గంగాభంగకల్లోలలీ, ల విజృంభించి పెనంగుచుండఁ గవిమార్జాలాదిసంపూజ్యలీ,రవధానంబు రచింపబూనితిరహా? హాస్యంబె యార్యోక్తియున్ శివుఁడుం దాండవమాడనాడవె పిశాచీభూతభేతాళముల్ ... ఉ॥ చెప్పినమాట చెప్పక యె చెప్పఁగ నేర్తుఁగవిత్వధారగా, నొప్పిదమౌనిధంబున బుధోత్తములందఱు మెచ్చనీరమున్, దప్పిక ద్రావుభంగివచనంబున గెల్వఁగరందు నన్న మెయామీ, కొప్పరపుంవీశ్వరులకుందగదే మొకొ? నాప్రతిజ్ఞయున్......"

---

*విద్యాచర్చాపత్రిక.

"అయ్యా? తమకును బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరమహాకవులకును, ఒక మాసమునుండి జరుగుచున్న కవితా కలహంబును పత్రికాముఖంబున వింటిని

చ॥ పనిగొని రామకృష్ణులు "సెబాసు! బళీ!యని,, కొప్పరంపువా
రొనరుచు తప్పు లన్నిటిని నొప్పులు గాఁ దలపోయుచే రెఱుం
గని? దలవారిబంధు వను కారణ మొక్కఁడె చూచి యట్లనన్
జనునె? యశక్తి దుర్జనత సర్వ విగర్హిత మెన్ని భంగులన్॥ ౧౩౦

క॥ ఇది యిట్టులుండె మమ్మున్ బదిబది, యాసీమ సున్న ప్రాజ్ఞులు పూజా
స్పదులుగ నవధానాదులఁ, బొదలించుచునుండి రరులు పురపురఁ బొక్కన్.

శా॥ ఆపైఁ గొప్రవఘవారిపక్షమున వా రాలోచనల్ సేసి రిం
కీపై నెయ్యది కార్యమీపురమునందే వారికిన్ సారెకున్
బ్రాపై గౌరవ మిట్టు లౌనె? యిది యెప్పాటన్ సహింపంగ నాఁ
గోవం బూనుటయే యనుగ్రహము గాఁ గూర్పుండి రవ్వారిటన్. ౧౩౧

సీ॥ చుట్టుపట్టులనుండి చూడ వచ్చినవారిసంఖ్య వందలకన్నఁ జాలహెచ్చు
వచ్చి "మాయూరికి విచ్చేయుఁ,, డనువారిసంఖ్య యేఁబదికన్నఁ జాలహెచ్చు
"రాఁజాల,, మన్నఁ "దీగదు రాక, యనువారిసంఖ్య యిర్వదికన్నఁ జాలహెచ్చు
ఏమాట వినిచిన నింపుమై వినువారిసంఖ్య యొ? వేలకుఁ జాలహెచ్చు
తే॥ గీ॥ పద్ధతినియోగులం దెరో పట్టుదలకుఁ, నేగకున్నను నెల్లవారేగి వారి
చుట్టునుం గూరుచుండి చూచు టెట్లు, ప్రతిమతములు వారిపక్షమై తిరిగిపోవొ

శా॥ * దైవాద్వైత మొకండు దక్క నఖిలద్వైతంబు నద్వైతమున్
శైవంబున్ మఱి వైష్ణవంబు నొకపై ఛత్రంబుగా వారలన్

---

...సర్వసాధారణమైన యాశుకవితకేమి? తమకు నేత్రావధానంబున నెన్ని బి
రుదులున్నవో... వానిని మీకంటె నతిశయించి కాఁకరపల్లి విద్వత్సభలో ది 20
సెప్టెంబరు 1911సం॥ రం తేదీని తత్తదంశంబుల నెలవేర్పుయగాఁ బెట్టుకుచున్నా
ను గనుక నీనోటీసు అందిన వెంటనే మీప్రజ్ఞా విశేషంబును గనుపఱుప నారో
జునకుఁ గాఁకరపల్లిమీరు రాఁగోరెదను" లేనిచో మీతోనిద్యాపర్చలకు రాఁజా
లను,, అని నాకొక జాబైనను వ్రాయఁగోరెదను....

ది 14—9—1911 సామవేదుల సూర్యనారాయణావధాని
నేత్రావధాని, అండష్టావధాని. మకాం కాఁకరపల్లి అగ్రహారం, తణుకుతాలూకా

*దైవాద్వైతము.

☞ వరాః—అనఁగా? నిది యొకనవీనమతము, దీనికే పద్ధతినియో

బూవుంబంతులపోలిక౯ జూచెదరు. రేపు న్మాపు నవ్వారితోఁ
బోర్పవై యుండుఁ బురంబు వారివచనంబుల్ వేదముల్ వీరికి౯. ౧౪౨

చ॥ ఇతరులమాట కేమి? మది నించుక గోపము కల్గి యున్నవా
కుతుకముగూడ వారనినఁ గొండొకపర్వులు వాఱు వారివా
క్ప్రతతి వినం గుతూహల మపారము గల్గియుఁ బోను వారిపెం
కెతనము నాకు నచ్చుమియె కేవలమింతకు మూల మెమ్మెయి౯. ౧౪౩

ఉ॥ "పెంకెలు గారు సాధువులు పేర్మికి నిక్కలు గర్వదూరు", లం
చంకిలి లేక చెప్పికొనునట్టిరునుం గల రల్లవారి; ని
శ్శంకగ వారు వారి కటు చల్లఁగఁ దోఁచుటయు న్నిజంబె యే
పంకము యస్త్రదాదులకు వారు రుచింపరు వేయునేటికి౯. ౧౪౪

ఉ॥ పాండితి లేని యీమనము పాండితిపట్టున వారి గెల్వ లే
మొండొక త్రోవఁ జూడవలె "హుమ్మను" వారిది మావఁగా వలె౯
గండతనం బడంచుటకుఁగాఁ గబురంపితిఁగాని బెల్లపుం
గొండకపీఁదుర్లఁ డేమిటికిఁ గొంకెనుపి "రా", నని యుత్తరం బిడె౯, ౧౪౫

తే॥ గీ॥ వీరి కూర్చుండి పెట్టి రీవైర మనుచు,నతఁడుకొండొకనిరసించినట్లువినికి
యితరులకు నత్లైతోఁచుఁగాకిదియునట్టి,దెట్టులగు? నాననముసీయ రేమిమనకు.

ఉ॥ పండితపామరుల్ గలిసి వారలకే హితు లైరి వారల౯
గండ డఁగించు టెట్లు? మనకక్ష జయించుట యెట్లు? తోఁప దొ
క్కండు నుపాయ మంచుఁ దనగాదిలిపద్ధతివారితోడఁ గొ
ల్వుండి విచారణల్ సలుప నొండొక నేర్పరి పల్కె నీగతి౯. ౧౪౬

---

గమనియుం బేరు, ఇది సదుద్దేశముతోడనే శ్రీనందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితులవారు పుట్టించిరి, వైదికు లనురులనియుఁ దామదేవతలమనియు వారిసిద్ధాంతము, ఆయాయంశము, దైవాద్వైత పదమే తెల్పెడిని, సుప్రసిద్ధాద్వైతము వీరికి ననురాద్వైతము, విస్తరము వారివిశ్వవత్యసురవిజయము లోనగు గ్రంథములవలన నెఱుఁగఁదగు. ప్రకృతకలహమునకుఁ గారకు లేతన్మతావలంబులలో స్వల్పసంఖ్యాకు లని చదువరు లరయుదురుగాక.

చ॥ మఱియొకఁ డిట్లు పల్కె "మఱి మాట వచింపకుఁ డింతకన్న నొం
డరయఁగ రాదు పాయ మొకఁడైదు గురేనియుఁ జాలు వార్లకుం
దఱు నొనరించినంత విలువైచెలువారెడు నంత హాసగా
దొరక వలెన్ సరాసరిగఁ దూఁగెడువారుగ నుండఁగా వలెన్. ౧౪౮

తే॥ గీ॥ శాఖ కొక్క కొక్కరుండు గాఁజర్చ చేసి, యేర్పర్చ వాళ్లు చేయించితి మేనిఁ జాలు
సంధి కన్నప్పుడేమని సమ్మతింప, రరయరేని "సంధి మిచ్ఛంతి" యన్న నొడువు.

సీ॥ ద్వైతులకెల్ల నాతనిచేతఁ జేయింత మద్వైతులకు నెల్ల నతనిచేత
నతనిచేఁ జేయింత మలవిశిష్టాద్వైతశాఖకెల్ల నతండు చాలువాఁడు
ఇంక ద్వైతాద్వైత మిందుఁ జేసెడివార లెందరేనియుఁ గల రెంచ నేల
శుక్లయజుశ్శాఖ సుముఖులకెల్ల నయ్యనఘుచేఁ జేయింత మతఁడె చాలు

గీ॥ తప్పవరి దేనియగుఁగాక తగు మనుష్యు, లిరువురకు సంధిఁ గూర్చుచో నేమిదానఁగు
హైకినటియింత మిట్లు చేర్చ వాళ్ళు దొరకు, వఱకుఁ బిమ్మట మనయిచ్చను ఱుకవచ్చు,

ఆ॥ వె॥ సంధి కొప్పిరేని "చాల లే" కందము, సమ్మతింపరేని "శాంతిదూరు
లంద మవల; దీనియట్టియుపాయమ్ము, మనకుఁ గానరాదు మఱియొకండు

క॥ చెఱియొకటిగఁ బంపినఁ గొ, ప్పరమునకున్ లాఘవంబు పైఁ బడ దెవరో
యెఱఁగినవా రెట్లాడిన, నరయరు, దూరగులు యోగ్యు లందురు మనలన్!

తే॥ గీ॥ ఒకరొకరొకరికి నెప్పట్ల నోడువారు, కారు తుల్యులు కయ్యమ్ము గలిగినప్పు
డేరి నేరు జయింతురో యింతలోన, సంధి చేసిరి పైవారు శాంతి గోరి, ౧౪౦

క॥ అనుప్రథ గల్గిన మనకున్, ఘనతయె మనకవుల కింతకన్నను గొప్పం
గొని తేఁగలమో మును పా, సనమేనియుఁ గోరు టేయశమ్మునకె కదా.

తే॥ గీ॥ ఆసనంబిడ నందుల కల్లవారి, మీసములు బీఁకుదు మటన్న బాస చాలు
నిపుడు మనపన్నగడ ఫలియించెనేని, "కోటలోఁ బాగ వేయుఁబో" కొప్పరంబు

క॥ అనునతని మాట చొప్పున, ఘనుఁడా వృద్ధుండు సలుపఁగా నెంచియు వా
ళ్లను కూలింపమిఁ గొండొక, దనుకన్ మాకడకుఁ గాగితము రా దయ్యెన్

గీ॥ అంత బ్రాహ్మణకోడూరియగ్రజన్ము, లెల్లమమ్ము నాహ్వానించి యెలమి నొక్క
సభను గావించి మేటియుత్సవ మొనర్చి, గౌరవించిరి వైరులు కళవళింప,

# బ్రాహ్మణకోడూరు శతావధానము.

సుగుణకలితకవితావనితానేతలును సురుచిరాలంకారవిధాతలును విలసితపాకత్రాతలు నఖిలార్థదాతలు నగు శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల యవధానవిధానంబులం బరికించి యానందించి యీజంట సత్కరింపవలయు ననుతలంపున గుంటూరుమండలమందలి బాపట్లతాలూకాలోని బ్రాహ్మణకోడూరు నివాసులంద ఏకగ్రీవముగ నిర్ణయించికొని తద్గ్రామంబునకు వారలఁ బిలువనంపిరి. కడచిన శనివారము 9-9-11 న వారలను, శ్రీమన్మధ్వశాస్త్రసంపన్నులుఁ బాలసరస్వతీ బిరుదాంచితులును, లలితగతి శతావధానధురీణులు నుభయభాషాకవితాధురంధరులు నయిన శ్రీ కాశీ కృష్ణాచార్యుల వారినిఁ దద్గ్రామంబున కాపురజనులు రావించి గ్రామోపకంఠంబుననే యీత్రిమూర్తుల శిబికాసుఖాసీనులం గావించి నానావిధ హృద్యవాద్యంబుగ నూరేగించి బ్రహ్మశ్రీ పెరవలి పార్వతీశ్వర శాస్త్రులవారి భవనంబున విడియించి యుచిత సత్కారంబులు సలిపి సగౌరవంబుగ నాఁటికి వీడ్కొనిరి. అయ్యెడ నీక్రిందిపద్యముల నొక బాలుఁడు చదివెను.

ఉ॥ స్వాగతమయ్య! మీకు విలసత్కమనీయ యశస్సుధారస
శ్రీగురుతావిభూషిత విశేషనభోంతరరమ్యదీధితుల్
సాగరకన్యకాఘనకుచస్థలచందనచర్చితప్రభా
భాగమరమ్యదేహు లగునార్యులు తిర్పతి వేంకటేశ్వరుల్.

ఉ॥ స్వాగతమయ్య సత్కవిహృదంతరదంతురిత ప్రభావసం
ధ్యాగమతర్పితాఖిలజనాహ్వచకోరులు దర్పవద్విరో
ధ్యాగతహుంకృతిస్ఫురదహంయులు నిస్తులితోరుశక్తి సం
ధాగరిమావధానకృతిదాతలు తిర్పతి వేంకటేశ్వరుల్.

ఉ॥ స్వాగతమయ్య మీకు రచనాతిశయాన్వితకావ్య సద్యశో
భాగ విశేషవేష్టితవిభాస్వరలోకులు గౌరవ ప్రభా
సాగరమజ్జదుత్తమవిశాలయశస్కరిపుప్రభావు లం
హోగరిమ ప్రణాశనమహోయుత తిర్పతివేంకటేశ్వరుల్

ఇట్టియుత్సవంబునకు సుగుణ సంపత్తి గలపౌరులయుత్సాహము నైకమత్యమును గాగణములు, అచ్చట కాపులుఁ గరణాలు" వీరగ్రజన్ములు వీరలితరులంచు భేదభావంబుంచికొనక యెల్లరు సోదరుల భంగిఁ జెలంగి మెలంగుటఁ జూడ నేరికేని వింత పుట్టింపక మానదుఆహా! యైకమత్యమన్ననిదియకదా? యైకమత్యము, ఇట్టియైకమత్యముకదా భరత ఖండవాసుల నుద్ధరింపఁ గలదు మఱియు నీవర పౌరులు నలుగడలనుండియుఁ దత్ప్రజ్ఞాదర్శనంబునకై గౌరవనీయులగు మఱికొందఱఁ బెద్దలరావించి వారల నుచితవిధుల మన్నించిరి. వీరల సౌజన్యము శక్తి, సామర్థ్యము, నిష్కల్మషహృదయతయు, నెంతయు శ్లాఘనీయములు.

మఱునాడు 10-9-11ఆదివారంబున నవధానసభ సేయ నిశ్చయింపఁబడియె, ఆనాఁడు భోజనానంతరము రెండుగంటలకు శ్రీనాగమల్లేశ్వరాలయపురోభాగంబున స్థాపింపఁబడిన నారికేళస్తంభవిలసితంబై పచ్చతోరణంబులరాజిల్లు తాళదళంపుఁ బందిట సభకూర్పంబడియె, అందు నానాగ్రామ సమాగతవిబుధవరులును గూడియుండిరి. నాఁటిసభ కగ్రాసనాధిపత్యము వహింప శ్రీకాశీకృష్ణాచార్యులవారు ప్రార్థింపఁబడిరి పిమ్మట వారియాధిపత్యము క్రింద నాసభసుముఖంబుగఁ బ్రారంభమయినది. అవధానంబును ముగిసె అంతటఁ దద్గ్రామవాసులు నితరులును జక్కని మృదుమధురశైలిఁ గొన్నిపద్దెంబుల, శ్లోకంబుల,రచించి యవధానుల కర్పించిరి. తదనంతరము సభ చాలింపంబడియె.

ఉ॥ రంగారావు, బి, ఏ., డిస్ట్రిక్టుకోర్టు వకీలు.

---

(అవధానప్రారంభపద్యములు.)

చ॥ "వయసుగతించు చున్నదిఁక వద్దవధానము,,లంచు మేము త
ద్దయు బతిమాలి యేటి కవధానములన్ సమకూర్చె దన్న"నా
దయ కొకఁడున్నె వార్ధకము తాత!,, యటంచు వచించెదేమొ య
ట్లయిన "తథాస్తు" నీయభిమతార్థమె తీర్చెదమమ్మ శాంకరీ॥ తి॥శా॥

శా॥ ఊరేగించుటె కాక మాయెడల మీయూరెల్లఁ జూపించు వి
స్తారోదారపుగౌరవమ్మునకు నేచాయన్ బ్రతీకారమొ
ప్పారన్ జేయఁగ నేర్తు మేము;రసవద్వ్యాహారముల్ గొన్ని శ్రీ
వారింబొల్చ గడించుకొన్న వెటులో వాక్రుత్తు మాలింపుఁడీ॥ వెం॥శా॥

(అవధాన పద్యములనుండి 2 మాత్రము)

(బ్రాహ్మణకోడూరు)

మ॥ గణనీయుల్ ద్విజు లల్లరాజులు యశస్సాంద్రముల్ కిరాటుల్ లస
ద్గుణగంభీరులు కమ్మవారు తనరన్ దోరమ్ముగా ధాన్యపుం
గణముల్ గొల్లుగఁ బుట్లు పండఁగల భాగ్యంబెందుఁ బెంపారు బ్రా
హ్మణకోడూరుపురంబు చెన్నలరు లక్ష్మ్యావాసమై వాసిమై. 5

## ఆంగ్లేయులప్రభుత్వము.

శా॥ పాఱంజొచ్చె నృశంసవర్గములు, దైవారంగ నీరెల్లచోఁ
బాఱంజొచ్చె సమస్తమానవులకున్ బల్ సౌఖ్యసంపత్తి పెం
పారన్ జొచ్చె సితాస్యరాజ్యమున "నాహా! యిట్టి రాజుల్ ముదం
బారన్ వర్ధిలఁగావలెన్ మనకు విద్యాసంపదల్ గావలెన్. 23॥

## అవధానాంతమున నితరులు చెప్పిన పద్యములనుండి కొన్ని.

మ॥ సకలాంధ్రావనిపాలకోత్తమ సభాస్థానమ్ములన్ సత్క్రవి
ప్రకరమ్ముల్ దలలూఁచి మెచ్చఁగఁ గవిత్వస్ఫూర్తినైకావధా
నకళోద్భూతజయేందిరా ప్రథితసన్మానమ్ములన్ గాంచుచున్
"సుకవీభేంద్రమృగేంద్రు,,లన్ యశముఁ గైకొన్నారు వీరిర్వురున్. 3॥

శిష్టాహనుమచ్ఛాస్త్రి.

---

మ॥ కవితాకన్యనుఁ బెండ్లియాడియు మహాకళ్యాణముల్ పొందియున్
వివిధోపాయపుధారణావనితనుం బెండ్లాడి తర్వాత నా
నవతుల్ గూడి యనన్యచిత్త లగుచున్ సంసక్తి సేవించ నా
రవితారం బగుకీర్తిఁ జెందుకవి సమ్రాట్టిల్లజుల్ మీరెగా.

మొదలి నాగభూషణము.

---

సీ॥ ఎదిరిగొడుగుఁగన్న నీసడించెడిసాము లెవరికి ఛత్రమ్ము నెత్తువారొ
యొకరుగజంబెక్క నోర్వలేని మహీంద్రు లిభము పైనిడి దేరియింపు గాంతురొ

కలనేన్నరుల చామగలఁ జూడ మనుదారక వీవన లెవరికి వేయువారో
పై రాజూహైనఁ గప్పంబిడు టొప్పని యిను లెవ్వరికిఁ గానక లిడెడివారో
తే॥ గీ॥ అమ్మహాస్మలు భారతీ హావభావ, విలసనము లెల్లయెడఁ జల్లి వెలయువారు
నీకె కనరయ్య! తిరుపతివేంకటేశ, కవులు కమలాంగనాఖర్వగర్వహరులు.

ఇట్లు సజ్జనవిధేయుఁడు  తాడేపల్లివెంకటప్పయ్యశాస్త్రి.

---

సీ॥ భువిలో ప్రసిద్ధమౌ భూసురాన్వయమందు నరుదారఁగా జన్మమందినారు
శ్రీశైవంబున నై శ్రీదేశిక సేవచే మించు విద్యల గ్రహియించినారు
శతవధానప్రవీణత రాజసభలందుఁ బలుమాఱు జయములఁ బడసినారు
పాణిగృహీతాది భాసురగ్రంథముల్ చేసి సత్కీర్తిని జెందినారు
తే॥ గీ॥ ఇట్టి సుగుణంబులను గల్గునట్టిమిరు, భవ్యతరకీర్తి నెక్కొంగవశమె మాకు
గీర్తికాంతాసమాసక్త మూర్తులార: సరస తిరుపతి వెంకటేశకవులార.

తెలికపల్లి వీరరాఘవశాస్త్రి.

---

సీ॥ ప్రతివాదిజనభయప్రదమైన యస్మ్ముఖం బంతేవసత్పాళి కమృత మొసఁగు
సభ్యులకడ లిడఁజాలెడుయద్వాణి కర్ణంబులందు సౌఖ్యము ఘటించు
తత్థ్యాంశమన్న స్వతంత్రించు యద్ధాటి మిథ్యాంశమన్నఁ దామిన్నకుండు
త్రైలోక్యరంగనర్తకియైన యత్కీర్తి విబుధమనోగోష్ఠి విడువకుండు
గీ॥ సత్త్వరుః వీశతలును శతావధాన, ధారణాధోరణీ చిత్రితప్రముఖులు
నస్మదీయగురూత్తములవని నాయు, వునుయశంబును గనుచుంటపానరుఁగాత
సీ॥ ఆంధ్రదేశావస్థితాశేషభూమిభృత్కోటీరమణిఘృణిఁ గూడియాడి
సవితాకృతానేకగణనీయ పూర్వపుణ్యాతిశయంబులఁ జోతలంది
గోదావరీతీరసాలంకపామోఘపాండితీప్రథకు జీవంబువోని
సమసీయుగచనాప్రపాకారకారణయశస్సీమంతినీలాస్యశేష మరసి
తే॥ సరససగసపుష్టి భావత్కసత్ప్రబంధ, బంధబంధురతత్కవిత్వప్రభావ
భావగంగాప్రవాహాభాస్వత్తరంగ, రంగకలనయఖండచిత్రంబునొసఁగె
సరసతిరుపతి వెంకటేశకవులార.
సీ॥ అన్యాదృశంబైన యశమును గర్హించుదోషజ్ఞబృందంబుఁ దూలనాడి
విషమపరీక్షావివేచనాప్రౌఢులౌ సంస్థానపతుల సంశయము దిద్ది
భిన్నభిన్నరుచిప్రభేదముల్ గల్గులోకుల నెల్ల నొకమేకున బిగించి

అష్టావధానశతావధానామరభాషితపాండితీబలము నొసఁగి

గీ॥ అఖిలదిక్కుల జయవైజయంతికావి, జృంభణము మీకుముందఁగై సేసియుంచు
తమపురాకృతపుణ్యంబు దరమె పొగడ, సరస తిరుపతివేంకటేశగురులార!॥

అవ్వారి, సుబ్రహ్మణ్యశాస్త్రి

సీ॥ పట్టుమంచొక గీతపద్యమ్ము వ్రాయరాదా! యేమి నోరులేదాయెఁ గాని
ఆశుధారయటన్న ననలెమా చేతఁగాదా! యేమి ధారలేదాయెఁగాని
అవధానతంత్రంబు లందు మాబుద్ధిపోదా! యేమి మేధ లేదాయెఁగాని
వాఙ్ముఖమ్మున మాదువక్త్రమించుక సాగదా! యేమి మాటరాదాయెఁగాని
గీ॥ మాకు ననుకొను పండితుల్మహిని నెందఱో కలరుగాని యీమేలుపోకలు [illegible]
పడఁగ నవధానమొనరించు వారుగలరె, ధరణిఁదిరుపతివేంకటేశ్వరులు ద[illegible].

కాశీ, కృష్ణాచార్యులు, శతావధాని.

---

సీ॥ కన్నబిడ్డలవలెఁ గాపాడి విద్యల శిష్యాళి కెప్పుడు చెప్పుచుంద్రు
సాహితీగ్రంథముల్ చక్కఁగ బోధించి పండితులను జేసి ప్రబలుచుంద్రు
సారకవిత్వంపుసరణిని నేరిపి సద్గ్రంథములఁ జేయ సాకుచుండ్రు
ఆశుకవితధార నలవడఁగాఁ జేసి ఛాత్రులఁ గనుఁగొని సంతసింత్రు
గీ॥ పుడమి వీరికి సరియగు పురుషు లెవరు, నరుఁడు నారాయణుండును బరమకృపను
వరుసఁ దిరుపతి వేంకటేశ్వరులె యగుచు, జగతిజన్మించినారలు సత్యమిదియా.

నోరి, హనుమచ్ఛాస్త్రి.

---

క॥ నిక్కనసీల్గినఁ దమకెవు, డెక్కుడివారేని సామ్య మెనయరు నిక్కం
బిక్కరణి నేను వ్రాయఁగ, నక్కఱయే లేదు జగతి యంతయుఁ బలుకున్.

వలివేటి, వెంకటనరసింహము.

---

☞ దిజ్మాత్రముదాహరించితిమి, తక్కినవి యచ్చయియున్న పుస్తకమున
నెఁ జూడఁదగు దానివెల రు0—2—0అణాలుమాత్రము.

---

క॥ పిదపఁ బినపాడులోనొక, సదస్సిటులె జరిగె నంత ఛాత్రుఁడొకఁడుగో
విదమయ మగు కాలేజీ, సదస్సులో శతవధాన చతురిమ నెఱపెన్. ౧౬౫

# శ్రీ పినపాటి శతావధానము.

ఆర్యులారా! జగత్ప్రసిద్ధులగు బ్ర॥ శ్రీ॥ తిరుపతి వేంకటేశ్వరకవులు గుంటూరు పురవాసులచే ప్రార్థితులయి అప్పటి బ్ర॥ శ్రీ, కాశీ కృష్ణాచార్యుల వారి అగ్రాసనాధిపత్యమున అవధాన సభ జరిపి స్వకవితా సుధాసారముచే తద్గ్రామవాస్తవ్యులను సంతసపఱిచిరి, పిమ్మట వారిసమావేశమును జేసికొన దలంచి మేము అతికుతూహలాయత్తచిత్తులమయి మాగ్రామమునకు దయచేయుండని వారిని (ముప్పరను) ప్రార్థింపవల్లెయనిరి 21-9-11 తేదీని సాయం సమయమున వారు దయచేసి మాచే నునర్పఁబడిన వాహనాదియుత్సవముతోఁ గూడ పురజనులు జయధ్వనులొనర్చుచుండ మాగ్రామము నలంకరించి భోజనానంతరమున కొంతతమకవితామృతముచే మమ్ములనానందిపఁజేసి నాఁటిరేయి సుఖముగఁబుచ్చిరి, మరునాఁడు అనగా 22-11-9పగలు మ॥ శ్రీ॥ కాశీకృష్ణాచార్యులుగారి యగ్రాసనాధిపత్యముక్రింద పగలు3ఘంటలకు అవధాన సభ ప్రారంభింపఁబడియె నాఁటిదినంబున తెనాలిమున్నగు గ్రామముల లౌకిక వైదిక విద్వద్గణ్యులు విచ్చేసిసభ నలంకరించిరి. మరునాడు సభ బహుజనపూరితంబగుటం జేసి సమ్మర్ద మెక్కుడు గలిగినందున 3ఘంటలకు మాత్రము 31 మందికి ఏకైకపాదక్రమంబున జెప్పి ఆమరునాడు సాయంసమయమున తక్కినది పూర్తిచేసి సభికులను శ్రవణానందము నొందచేసిరి. అవధానము సంపూర్తిచేయుటకు పట్టిన కాలము మొత్తము 8 ఘంటలలోపు అయియున్నది.

ఇట్లు విన్నవించువిధేయులు,

తెనాలితాలూకా — పినపాటిపురవాస్తవ్యులు.

---

(అవధానప్రారంభపద్యములు.)

ఉ॥ ఒక్కొకచోట నొక్కగతి నోజగదంబ! భవద్విలాస మ
న్నొక్క ఘటించు వస్తుచయమంతయు శక్తిమయంబు దానికిం
దక్కినవార లెందులకుఁ దారసమర్థులటం చెఱింగి నే
నిక్కృతికిఁ గడంగెద నిహీని యనిపింపకుమమ్మ శాంకరీ. 1

ఉ॥ మానియుఁ జేయఁబూనిరని మాపయిఁ గోప మదేల నీకు, మా
పై నెనరూను ప్రేరకులపై ననురాగ మదేలని యెట్టులో

భూనితి మిష్ట పొమ్మనినఁ బోదువె? ''ఓటుకరమ్ము గ్రుక్కి-జం
పూనఁ బనేమి రోఁకలి, కెటో నటియింపు శతావధానమా॥ 2॥ వెం॥ శా॥

మ॥ స్వయమేపారశతావధానకవితాసామ్రాజ్యసంస్థించి త
చ్ఛయశోమూలము గాఁగ, నీవగటి వేషాలెన్ని నాళ్లింక, నూ
పయికేరే నరుదేర వారల నదల్పం జాలుధీశక్తి యి
చ్చి యెటో మన్నుట నీక భారమగు నీచిత్తంబు కాఁ మేశ్వరీ॥ 1॥ తి॥ శా॥

అవధానపద్యములనుండి కొన్ని.

వైదికనియోగులకు సఖ్యమును గూర్చి.

ఉ॥ ఎవ్వరు వైదికుల్? మఱియు నెవరు నియోగులు? సూక్ష్మనిష్ఠితో
చివ్వకు డీకొనన్ గలుఁగు చేటిఁక కఁదక్క్షన జాతివారికిన్
నవ్వఁగ సందుగాదె! యటు నవ్వఁగఁ జేయుట ప్రాజ్ఞధర్మమే?
యెవ్వగనైన వీరిరువు రేకముగాఁ జరియించు టొప్పదే॥ 7॥

బ్యాసుగారిచట్టము.

మ॥ కలికిన్ గంటికిఁ బ్రీతిగొల్పునెడ వేడ్కన్ దేని నేనిన్ నరుం
డెలమిన్ గైకొనవచ్చు దానివయినెం దేఁ జేర్చి వో నప్పుడ
క్కలికిన్ వీడఁగవచ్చు నొండొకట భాగ్యంబున్న నిశ్వస్తతోఁ
గలియన్ వచ్చును ''బాసు,, చట్టము రసీకారంబు గావించుచో॥ 15॥

ఇప్పటివారి కవితా సంస్కారము.

శా॥ చారుశ్రీకములౌ నలంకృతులకున్ సన్మానమున్ బెట్ట రం
గారం బెల్లను గారమయ్యె గుణముల్ ఖండంబులై పోయెను న్
స్కారమ్మెల్ల నశించె భాషలకు దౌర్గత్యంబు ప్రాప్తించె సం
స్కారమ్ము ల్వెనరించువారికతనన్ సర్వంబు నానెంబడిఁ॥ 27॥

పృచ్ఛకుఁ డిచ్చిన విషయము.

సీ॥ శాలివాహనుని దౌ శకమునఁ బదునూఁడు వందలయేండ్లపైఁ బార్థివాఖ్య
వత్సరంబున మాఘబహుళచతుర్దశి శివరాత్రితిథి రాజశేఖరుండు
వీరనారాయణాభిఖ్య గల్గిన రెడ్డి శంకరమునికి కలంకదాన

సుమరఁగా నగ్రహారముగాఁగ నొసఁగె నీ పినపాటిగ్రామంబు నృపుఁడు; నేఁడు
కారణం బెద్దియో గల్గి నేఁడె యయ్యె నైనను బంటు లత్యధికముగను
తే॥గీ॥ బండఁ జేసెడి సూరాణుల ప్రాభవమున, సిరియు సంపదయు దగల్గి చెలఁగుచుండె
నెల్ల కాలమ్ము నీరీతి నెసక మెసఁగ, వృద్ధిఁగాంచుత మీపినపాటియూరు ॥61॥

సభ జరిగినచోటు.

సీ॥ ఎచ్చోట నిత్యమ్ము నెసకం బెసఁగుచుండు లీలమై మదరాసు రైలురోడ్డు
ఎచ్చోట నిన్నైకొల్వ నెంచి కొల్పింతుమే నాఱువందల గజాలై చెలంగు
ఎచ్చోట పేదా నెంతే నొప్పఁ దేవదూలములతోఁ దేవవాసములతోడ
ఎచ్చోట నియుంతరం బింపౌగు సత్ప్రవీపటలిచే సద్దవీపటలిచేత
తే॥ గీ॥ పేరుగోష్ఠంబుగాని యేయూరనైన, మఱియుఁ బట్టణములనైన వఱల దిట్టి
“సభలు,, నాఁ జనునిట్టాని నాలకొలకు, కొల్లకోటామఁ గట్టించెఁ దులకమెసఁగ

సమస్యాపూర్తి.

శా॥ కుంచాలన్ గొలిపించి యిచ్చితినిగా గుగ్గిళ్లకై యుల్వలన్
గంచాలం దిడఁబోకు మన్న మిపుడెక్కన్ బోదు సంసారి “చా
వంచాలం డిగి దప్పెగొన్నవిరసుబ్బా! నీక్షు వేవేగదె,,
(న్నుంచాలన్ బిగియించె గుంజలకు నమ్మా! బిందియన్ దేగదే?)॥ 62॥

సమస్యాపూర్తిః.

శ్లో॥ సహి సంతతిస్తు నరకార్ణవాపహా, త్వతిదుఃఖ మాత్మపితరం నిరీక్ష్య సా
తనయా దదౌ స్వతనయం తతస్త్వహో! (అనుజో బభూవ తనుజోఽపి యోషితః)

అవధాన మొనరింపఁ జేసినవారు.

సీ॥ తూములూరిమహాబ్ధిసోముండు విద్వద్విధేయుండు కోటయ ధీరుఁ డొకఁడు
పినపాటి వంశాబ్ధినిధుఁడు శ్రీవీరభద్రయ కవిత్వరసప్రధానుఁ డొకఁడు
శాస్త్రసూత్రజ్ఞ సద్వయవారాశిచంద్రుఁడౌ శ్రీరామనామకసూరి యొకఁడు
తూములూరన్వయసోముండు శ్రీసూర్యనారాయణాభిధకవి గేయుఁ డొకఁడు
తే॥గీ॥ లక్ష్మీకాంత నొకండు సులక్షితుఁడయి, వఱలు నన్నముభొట్లసు వంశజుండు
పేరుఘటియించి రవధాన మాఁగఁ బిన, పాటిసాంబశివాభిఖ్య భవ్యుఁ డొకఁడు

అవధానాంతమున నితరులు చదివినపద్యములనుండి కొన్ని.

మ॥ తము సన్మానముఁ జేయ శక్తియొసఁగుమంతన్ లేదు మీశక్తి యి
త్థ మటంచున్ గ్రహియింపలేము నరనాథ ప్రార్థ్యసై యొప్ప కా
ర్యము చేయన్ సమకట్టినార మిట లోపాలోపముల్ దిద్దుమా
ర్గము మీదేయని వేఁడుకొందుము నమస్కారంబు గావించుచున్.

చంపకమాలిక.

తరతమభావమున్ భువిని దజ్ఞులు పండితు లెల్లవారు గొ
ప్పరవు కవిద్వయంబునకుఁ బండితులై యలరారుమీకు నీ
వఱకె గ్రహించినార లది బాగుగ లోకమువారు గూడ నె
ల్లరును గ్రహింపఁగా మనములన్ బొడగట్టినకోరిక పేర్మి చే
కుఱఁగను వారికిన్ దమకుఁగూడను గన్నులిఖించినాఁడఁ గొ
ప్పరమిట కేగుదేర దల వారికిఁ గార్యభరంబు పొందొకో?
.............దీనికిని సాటిగఁ గొండొకఁ జెప్పబోవఁగా
వారకొనవచ్చునే! తొచటఁ దోయజమిత్రుని ముందు దీపము
ద్ధురమగు? నేన్గుముందటను దోమను బోల్పఁగవచ్చునే? ధురం
ధరమయి యెల్లమానవులఁ దానయి పూతులఁ జేయు గోవు ముం
దర ఖరమున్ మహేశ్వరుని దాపున రాక్షసవర్గ మెందు నుం
తురె! యనిప్రేక్షకుల్ తమమదుల్ బయిపెట్టఁగ నొప్పనట్టి శ్రీ
తిరుపతివేంకటేశ్వరుల దివ్య కవిత్వ మహత్త్వ మిప్పు డా
దరమునఁ జూడఁగల్గె ఫలితంబుగ నయ్యెను జన్మ మిత్తఱిన్.

తూ॥ కోటయ్య

---

ఉత్పలమాలిక.

నీతులు పల్కవచ్చుఁ బరనింద లొనర్పఁగవచ్చు నిట్టు లా
సేతు హిమాచలంబును బ్రసిద్ధి వహించు నృపుల్ సెబా సనన్
భీతులు త్రోవఁబట్టి తల వెనక్కుఁ ద్రిప్పుచు జాఱుచుండఁగన్
జాతవిరోధులే పలుకు సాగక యొక్కెడ మూల్గుచుండఁగన్

ధీమత్పణ్డితమణ్డలీహృదయసంతోషప్రదా సద్గుణా
నైవాన్యం నముపైతి కిన్తు భవతో గ్లిహ్వాం విహాయ క్షణం

వేమూరి, శివస్వామిశాస్త్రి.

సీ॥ మీధారణాశక్తి మితిలేనిదనుటకు డంబా శతావధానంబె సాక్షి
సాహిత్యసామ్రాజ్యచక్రేశు లనుటకుఁ దమరుకూర్చిన పుస్తకములె సాక్షి
కాకవీశ్వరమత్తకరిహరు లనుటకుఁ గొప్పపుంగవుల నేకుటయె సాక్షి
అఖిలరాజన్యపూజ్యత నొంది రనుటకుబిరుదులున్నవి వేనవేలు సాక్షి

గీ॥ ఎలమిమిముఁబోలుసుకవీశ్వరులుధరిత్రిఁగలుగ రనుటకుమాయవల్ల మియె సాక్షి
విమలమతులార! తిర్పతివేంకటేశ, సుకవిమణులార! బహుతరాసుకవులార ॥3॥

గూడ, కృష్ణయ్య, పెరవలి.

# గుంటూరుకాలేజీశతావధానము.

చ॥ ఎఱుఁగడు పిల్లకాయ యెటులే నొనరించు శతావధానముల్
సరసులు మీర లెల్లరును సభ్యులు పేర్మి ననుగ్రహింపుఁడా
దరమునఁదప్పులన్ విడిచి తద్దయు నొప్పులు చూచి మెచ్చుఁడీ
తిరుపతి వేంకటేశ కవిధీరుల శిష్యుని వ్యాద్రికానునిన్॥ (వెం॥శా॥)

☞ అవధానపద్యములన్నియు వదలఁబడినవి.

శా॥ నీకున్ శ్రీయును ధీయుఁగల్గుత మఱి నీ కంఠసారస్య మా
స్తోకంబై యలరారుఁగావుత నిరుం దూలింపఁగా లేరదు
ర్ధీకుల్ గాత్ర్యశతావధాను లెఁకవ్యర్థీభావనుం గద్రమ గా
కేకాకారయశంబు గైకొనఁగదోయీ! ఛాత్రచూడామణీ. ॥3॥

మ॥ కుతుకంబొప్ప సరస్వతిం గొలిచి నేఁ గొంతార్జనం జేసితి
న్మతిమన్మద్గురులు బ్రహ్మఁ గొల్చి మఱికొంతన్నేర్చితిన్ విద్దెని
చ్చితి నీకు న్నఁటిఁగొంతమందికి యశశ్శ్రీనిల్పితీ తోజగ
న్నుతనామా! శివరామ! నీకు నొనరింతున్ దీవనల్ హెచ్చుగన్. ॥4॥

మ॥ ఎదిరిం దమ్ము నెఱుంగకే యెవరొ మస్త్రం తేని నిందించునా
యదన న్వచ్చితి వద్దు చొచ్చితివి నిన్నవ్వారు లక్షింపనై
రది లోకం బెటులో యెఱింగె సభ గణ్యత్వంబు నీ కిచ్చి ర
య్యా? దేనల్ నండె భవద్యశంబు శివరామా! శాస్త్రిచూడామణీ!॥ 5॥

సీ॥ నీతండ్రి వేదవిద్యాతత్పరుం డటం చున్నచో నెట్లు నిన్నొప్పు మనుకొం—
నీతల్లి లోకవిఖ్యాతదివ్యచరిత్రి యంది గన్నఁదా నెంత ముదముగనును
నీయన్న విద్యావినీతితత్పరుఁ డట నిపుడున్న నెంతటియెలమి గనును
నీతమ్ముఁ డవధాననిపుణుఁ డీకృతి గన్న నెంతయా మోదమ్ము నెనయు నుకొం—
గీ॥ ఇది మహాత్మ్యంభవంబు సీయెల్లబంధు; వులును బొందెడి మోదమ్ముగలిసియొక్క—
నన్ను నేపొంపెభరముఘనంబు మోయు, టెట్లుశివరామ! చెప్పమో యూ! కుమార!.

మ॥ కలవిద్దెం బలుమంది కిచ్చితిని వీఁకం గొంద ఱెట్టెట్టులో
యెలమిం గూర్చిరి పంగనామ మిడి యొక్కెఁ గొంద ఱానందముం
గొలుపం బూనిరి నీకతమ్మునఁ దగ్గుంగాక యాయెగ్గుఁ ద
గ్గులు; వేవే శివరామశాస్త్రి! మది పొంగుంగాక నాకుద్ధతి౯. 7.

శా॥ "సంతానం బది లేదు నా" కనుమనశ్శల్యంబు నీవైదుష్షీ
కాంతుల్ ద్రోచెఁగదోయి! తండ్రి! నిను నాకాక్రాంతుండుఁ దద్భార్యయున్
స్వాంతం బుంచి యనుగ్రహించి బహుధా సంతుష్టునిం జేయుచు౯
మంటు న్ధాత సమస్తలోకమును సమ్మానించుఁ గాత న్నినున్॥8॥

చ॥ "అఱువదినేడు లాయు"వని యందురుగా కలిలోన, నల్వదీ
వఱకె గతించె నిప్పటికి వ్యాఘ్రము మన౯ జర నోరువిప్పి మ
స్మరయు చునుండె మాభరము సంతయు నీతలఁ దాల్చి చేయు మే
ర్పఱచినతోవ నోయి శివరామకవీ! బహుశావధానముల్॥ 9॥

క॥ "య"న్ననుచుఁ గొందఱనఁగా, "బ"న్ననుచుం గొందఱనఁగ బాలుఁడవయ్యున్
నిస్సీమ యశముగొంటి మహాస్వాగర! వృద్ధినందుమా! శివరామా!॥ 10॥

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శతావధాని.

మ॥ జగతీనాథులు పెక్కు మంది ముదితస్వాంతంబునం గానఁగాఁ లం
పఁగ సాంగంబు సలక్షణంబుగ శగద్వావింశతిం జేర్చి హె

ప్పొంగఁజూ యేలిన యీ యవధాన కవితాసామ్రాజ్యభారంబు మో
యంగఁ జాలంగదవయ్య తండ్రి! శివరామయ్యా! చిరంజీవివై॥ 1॥

మ. శిష్టులెంచిన రూపడంచుచు ధరిత్రీనాథు లర్పించు స
న్మృష్టపదల్ గైకొనుచుం బ్రమత్తుఁడవు గా కుద్యన్మహేంద్రుండవై
ప్రకటింపం బగు ప్రౌఢవాక్కవితావీరుండవై వర్ణనీ
యకరాకాంతి వహింపుమయ్య శివరామయ్యా! చిరంజీవివై॥ 2

శా. బాల్యాదేశికమున్నె వైదర్భ్యరీతిని కొల్పంపుంగవిం గ్రంథసా
కల్యంబుం బొనరింతొ లేదా యని నీకై కొంకు నస్మన్మన
శ్శల్యం బిప్డిటి కూడఁదీసితివి వత్సా! నత్సభాశోభివై
కల్యాణంబులఁ బొందుమయ్య! యిఁక వీఁకన్ శిష్యచూడామణీ. ॥3॥

మ॥ అవధిదేవులు నిన్ను మానకవితా వ్యాహార వారాశినం
భవదీయాషరసాభిలిప్తలలిత వ్యాహారసీహారులై
యవలోకింప శతావధానముల మాకానందముం గూర్పి గా
రవము న్నిల్పితివయ్య మా ఋణము దీర్చన్ శిష్యచూడామణీ. ॥4॥

శా॥ స్వర్గక్ష్మాతలనుతాళ్ల రద్భుతపద వ్యాహార మేపార మా
కర్ణబ్రహ్మసుధీగురూత్తముని వాచాపూర్తిఁ గీర్తింపఁగా
నిర్ఘాతంబునఁ గోరి మా దరికి భక్తిన్ దెచ్చె వెంచెరఁగా
పర్ణం జేసితి వస్మదీయ గురువిద్యావంశ చూడామణీ. ॥5॥

దివాకర్ల, తిరుపతిశాస్త్రి, శతావధాని.

సీ. శతవధాన విధాన సందర్భముల నెల్ల నేర్చి దిక్కులఁ గీర్తి దార్చినావు
అవధానములఁ బెట్టినట్టి చిక్కుల నెల్ల నేర్చి నీవు నీవ తీర్చినావు
సమము ద్రుంగఁగ వ్రాయు నద్భుతాశ్రిలకష్టమార్చి గెలని నారిఁ బేర్చినావు
ప్రజ్ఞామనరకంబు పోవునా యనుచింత దీర్చి రాజ్జతుఁ దుష్టిఁ గూర్చినావు

తే. మేలు, శివరామశాస్త్రి! నీ నెచ్చెలిగురుని, కనుపమయశంబు ఘటియించునట్టి శిష్యుఁ
డిదె, గురువులతోఁ గుస్తీలాడ కెప్పుడు, గురుయశంబుల నార్జించికొనఁగ దయ్య.

కాశీకృష్ణః, శతావధాని.

... ... ... ... ... ...



కం॥ మాకును మాశిష్యులకును, నేకులు ప్రాజ్ఞు లిటు లెల్లయెడఁ జేసెడియ
స్తోకపుగౌరవముల కల, లౌకికు లెంతేని జింతలన్ జివికి వెసన్. ౧౬౯

సీ॥ యత్నమెంతేని యొనరించియుంత ''విశద,, లాఖ్యఁదగుపత్రిలో సభననుఘటించి
రాసభావిశేషంబుల నరసి తీర,వలయు నంతియె యంబరీ నీ వరయ లేదె.

సీ॥ వాని''కలవాటులేనియా సాహసములు''కొప్పరపు సాము లొనరింప నొప్పికొనరు
పావనీ మేమి సేతురు వారిఁ బట్టికొనిన, గ్రహములను బట్టి మిక్కిలి కష్టపడిరి.

కం॥ ''తాటికెగఁ ప్రాఁకఁ బూనిన, చోటన్ మఱియెంత దనుకఁ 'జోచో'' యనుచున్
మాటికి నెగఁద్రోయుదు,, రను,మాట కుదాహరణముగ శ్రమంబది యొప్పెన్.

సీ॥ కొప్పరం బవధానంబు కొఱకుఁ బూని, *వశము గాకపడెడిభంగపాటులెల్ల
మాప యునిబోల్పఁదొడఁగిరిమంత్రిబలము, చాలఁగలమాటలౌకికాచారపరులు.

మ॥ అవధానం బెటు చెడ్డ నేమి, ''బళి, మే, లాహా, జగమ్మందు లే
రవధానుల్ మఱి యొకర్ రిట్టి రని యాహాకారముల్ వ్రాసి తా
నెవఁడో పత్రిక కంప దానిఁ గని ''యిట్లే నిక్క మంచున్ జగం
బవలోకించు మనమ్మునందు నిజ మేలా తేలు నప్పట్టునన్. ౧౭౪

ఉ॥ §''బాగుగ నుండెఁ గొప్పరపువారి'' దటంచు లిఖించునప్పుడున్
డాఁగెను గిల్కి రెండవదొ పొరుటాపొరుటి వ్రాఁతలు డాఁగ నేలనీ యే
నాఁగుడొ నెట్టఁ బెట్టునెడ వ్రాయనకాఁ డటు సేయఁ గాక ''మేల్! నీ
బాగుని భళానీ భళా'' యనెడిపట్టున డాఁగుట కర్థమే మగున్. ౧౭౫

---

* ఈభంగపాటులనుగూర్చి పూర్వరంగము 108, 109, 110, 111, 112, పుటలుచూ.

§(1911 సం॥ రం 13వ అక్టోబరు తేదీ, ఆంధ్రకేసరి పత్రికనుండి.)

(గుంటూరి శతావధానము.)

...సభ అసమాన వైభవంబుతో జరుపబడినది. 51 పృచ్ఛకులకు నిరాఘాటముగా జరుపబడినది. అవధానపుపద్యములైనను ప్రబంధపద్యములను మించియున్నవి యిందియంతయు జూచినతోడ ప్రతిపక్షులకు నోరెత్తుటకున యినను సందుదొరికినది కాదు అంత సభానంతరమున ప్రతికక్షివారిచే కూడ మెప్పువడసిరని వ్రాయుట

క॥ కలనిజమెల్ల నిటులె యీ, కలహమ్మునఁ దెలిసికొనినఁ గాక తెలియ దే
వలుగో పేర్మార్చి యెదో. గిలికెడి నిజ మెట్లు తెలియుఁ గృతబుద్ధులకున్.
ఉ॥ ఇయ్యెడ భిన్నభిన్నతను వేటికి నెత్తిరొ? ప్రత్తిపాటికా
మయ్యయు, రామకృష్ణులును, నందఱు దాఁ బెడె కాళ్ళనూరినా

---

కు గడుసంతసిల్లుచున్నారము యిదివఱకీగ్రామంబున జరిగిన సభలలో నేదియు నింత జయప్రదముగా జరిగి యుండలేదు,

ఇట్లు, యథార్థవాది.

---

(ఆన 1911 వ సం॥ అక్టోబరు 4 వ తేది ఆంధ్రపత్రిక నుండి.)

## గుంటూరు సమాచారము.

గతనెల 18 వ తేదీని గుంటూరుతాలూకా "విశదల" గ్రామమున కొప్పరపు సోదరకవిశ్రేష్ఠుఁడగు బ్రహ్మశ్రీ వెంకటసుబ్బరాయ శర్మ కవిగారిచే శతావధానము జరిపింపఁబడినది. నాటిసభకు బ్రహ్మశ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగా రగ్రాసనాధిపత్యము వహించిరి. నాటి శతావధానమునకు గుంటూరు నుంచి యుద్యోగస్థులు, విద్యార్థులు, న్యాయవాదులు, పండితులు, కవులు సుమారు 150 మంది వచ్చియుండిరి. వారికందఱికి పిండివంటలతో సహభోజన సదుపాయములు జేయబడినవి. వీరిధారణాశక్తియును, సమయోచిత యుక్తి శక్తులును, కవితాపటుత్వమును' మేధాశక్తియును, శ్లాఘనీయములు. సభానంతరము కొందఱు పండితులు, కవులు తమయుత్సాహములను దెలుపుచు గొన్ని పద్యములను జదివిరి.

ఒకపృచ్ఛకుఁడు.

☞ ఇట్టివ్రాఁతలు పెక్కులు, లోపల నిజమెఱిఁగియుఁ గప్పిపుచ్చి శాఖాభిమానమును వెల్లడించునీవ్రాఁతలోఁగూడఁ జక్కఁగఁ బరికించువారికి "విశదల"లో నవధానముకన్న భోజనమే కొండొకమెఱు గనుతత్త్వార్థము దొరకకపోదు. అది యటులుండె, ఈరసాభాసావధానము మాయవధానముకన్న వేయిరెట్లధికముగ నున్నదని వ్రాసిన యతనివ్రాఁతను పూర్వరంగము 46 వ పుటలోఁ జూడఁగోరెదను.

రయ్యయుఁ జట్టిసింగయయు నట్టిరె నాఁ డగుపోచిపోత లీ
యయ్యలు పూర్వజన్మమున యం దొకరే యని తోఁచు నంబికా. ౧౭౮

క. అవధానం బారీతిగఁ, జవుటం బడునిట్టులట్లు సమయుడు శాఖా
యువతీమనోహరులు తమ, నునివేకము నెల్లఁ దెలుపఁ జొచ్చిరి వెలుపన్.

ఉ. వేంకటరామకృష్ణులను వీరికిఁ దోడుగఁ దెచ్చి తిర్పతిన్
వెంకన నూడఁ బుత్త్రమిది వీ లని కొందఱు వారికోసమై
శంకలు గొట్టికొంచుఁ జని సాగము గన్గొని "స్త్రీ" యటంచు ని
ష్ఠ్రింకుల నింకెనట్లు జను లెంచఁగ నింటిమిసుమ్ము శాంకరీ. ౧౭౯

చ. "తనికినపోసినకట్టెపయిఁ గొండొక తాటిఫలమ్ము పట్ట" యు
య్యనపుడ రామకృష్ణు లిది యారని యుండవలెన్ దెగించి యి
ప్పని పయిఁ బెట్టికొన్నఁ బినపాండితి బైటికి రాదె నూరపుం
జనులు సమీపగుల్ బలె స్వశక్తి మహత్త్వ మెఱింగి నవ్వరే. ౧౮౦

తే.గీ. "ఎడమచేయి చూఁపుచుఁ బుట్టచేయి చూపు" నటన్న, సాహితమొ వీరికవధాన చర్యపట్టి
తరుఁ సామగ్రిలోన భేదంబు బోలెఁ, డెసఁగుఁ గొప్పింబునకు రామకృష్ణులకును,

ఉ. వచ్చిన రాకయున్నఁ దమవారుకుల్, దోడుగ నంపుతేనియున్
మెచ్చు ఘటించుఁగాని యనుచు మేటులు మేటులు "శృంగభంగముల్"
వచ్చికమోఁపులుంబలెనె పంపిరి సాహసుని రామకృష్ణు లే
మిచ్చఁ దలంచిరోని నిజ మొక్కటె బయలౌ నని తా రెఱుంగమిన్. ౧౮౨

ఉ. వేంకటరామకృష్ణులవివేకవిశాలపు 'శృంగభంగమున్'
జంకల నూని జన్మదినసన్మన సే యనధీనశాప్తి ని
ష్టింపుగ గొన్ 'శతఘ్ని'యై, బరియించుచుఁ గొప్పవారి బందుగుల్
పంకపుఁదోపలం బడి స్వపద్ధతి వెళ్లఁగఁ బెట్టి రంతటన్. ౧౮౩

తే.గీ. బందుగులటన్న దగ్గఱివారు గారు, ఏకశాఖీయులని యో నీవెఱుఁగుమంబ!
వారు లోలోనఁ గొప్పవంపువారినత్తు, నెఱుఁగ రనుకొను మెఱిఁగియు నిట్టులైరి

తే.గీ. ఒకరొ యిద్దరొ తక్కఁ దక్కిన సమాగులందు, గొప్పరపుధారయున నొప్పుకొన నివారె
కాని యాసన చర్పాభిమాన హాన, హాన సాంతవు లై మేను మఱచిచెడిరి. ౧౮౪

సీ॥ "పండితబ్రువ,, మంచుఁ బండితిట్లులుతిట్టియెవ్వాఁడుతన హైన్యమెఱుకపఱచె,
"సత్యవాది,, యటన్న చాటుపేరున లేనిపోనివాదుల నేఁడు పూని వ్రాసె,
అతని కెక్కుడుగ 'యథార్థవా,,ద్యభిధానమున నెవ్వఁడులిఖించెననృతములను,
వంటబ్రాహ్మణునుత్సవమ్మున కెవ్వాఁడు తనయశ్వము నొసంగి ఘనతఁజెఱిచి

తే॥గీ॥కొనియెనీసల్వురనుమఱికొంతమంది, దక్కుమాయందు ద్వేషంబుదగులుజనులు
లేరట నియోగులందు నివ్వారికతన, వృథగ నెందఱికో చెడ్డ పేరు వచ్చె.

మ॥ జననీని కొత్రపువారి వక్షమది నీచంబో ఘనంబోని కనుం
గొనుమీని వఁటనియోగి నశ్వముపయిన్ గూర్చుండఁగాఁ బెట్టి యూ
రున నేగించిరి వాద్యఘోషములతోఁ గ్రొంగ్రొత్తదీపాలతో
"ననయుల్ వీరికి బుద్ధి లే' దని పురం బాబాలమున్ గోలగాన్. ౧౮౮

మ॥ శివరాముం డవధానమున్ సలిపి వానిన్ బేర్చుడన్ వానిగా
రవ మొప్పన్ ఘను లట్లు చేసి రని యోర్వన్ లేక కొత్రపంబు దా
నవధాన మ్మిటు చేయఁ జాల దెటు లట్లో నుత్సవం బంచుఁ గుం
దు వెలార్చన్ దమపాచకాధముని నెందుం దిప్ప రప్పట్టునన్. ౧౮౯

తే.గీ॥ దీనిచేతనె సకలంబు తెలిపినట్టి, దయ్యెఁ బ్రాజ్ఞుల కిఁక నన్య మనవసరము
ఐననాయాయిసందర్భచుంతొయింతొ, తెల్పకున్న దూరగులకుఁ దెలియుటెట్లు

చ॥ "విశదల"లో విధాన మది వెల్లిగఁ దోఁచినమీఁదఁగూడ నీ
ర్విశయము దక్కి గుంటురుపురిన్ సభఁ బెట్టి చెడంగఁ జూచి "దు
ర్దశులకు నుత్సవం బనినఁ దప్పగ నుండు" నటంచు నెంచి యీ
పశుకృతి కిచ్చఁ జేసి నగుఁబాటులపాలయి రంబనిలౌకికుల్. ౧౯౧

మ॥ అభిమానంబన గర్తపూస్థితని యోగన్యాగేసరాధీన నుం
చు భయం బించుక లేక చెప్పఁ దగు నెచ్చో వార లద్దాన్నికై
శుభదూరంబు నసత్యమున్ శుభద మంచు న్నమ్మి భాషింతు రే
రభసప్రక్రియ కేని సిద్ధపడి యారంభింత్రు దుర్వ్యాహృతుల్. ౧౯౨

క॥ కుకవిశ్వముపై నెక్కిన, నిక్కువుసంతోస మందునిపుణులు కవులం
దెక్కువ తక్కువ లరయుదు, రొక్కని యెడవిన్న నవ్వరొక్కని విబుధుల్.

క॥ ఇది యిట్టులుండుత రాజీ, కుదిరింపఁగఁ బత్రమది యొకొండు మును పె యా
సదమతులు వ్రాసియుంచిరి, కద? తచ్చరితమ్ము వినికి గావింతు మిఁకన్.

క॥ ఇరువదినాలుగు దినములు, పరిపరి యోజించి తుదకుఁ బత్రిక మా కి
చ్చిరి తెచ్చి* గౌరవస్థులు, మఱిమూఁగురు; దానిఁ గాంచి మదినుద మొదవన్.

ఉ॥ అంతకుమున్నె "పత్రి మిటులా గతమా," నని నిన్నె నాఁడె వా
క్కాంత యనుగ్రహమ్మున నొకానొక కల్పన దోఁపఁగా,, యశః
కాంత వివాహముం,, గుఱిచి కట్టియ యుంచిన పద్యసప్తకం
బెంతయుఁ జేర్చి, వారు విని హెచ్చిన మోదముగాంచి రయ్యెడన్. ౧౬౭

---

*(1911 సం, అక్టోబరు 20, తేదీ కృష్ణాపత్రికనుండి.)

బ్రహ్మశ్రీ తిరుపతివేంకట కవీశ్వరుల సముఖమునకు. ఈదిగువ సంతకము చేసిన వారు నమస్కరించి వ్రాయు విజ్ఞాపన:—

ఈపురమున నీమధ్య శతావధాన సభ జరిగినది మొదలు దమకును గొప్పరపు సోదర కవులకును వైషమ్యము లేర్పడి ఉత్తర ప్రత్యుత్తరములు నడచినవి. మాగ్రామములో తమ తమ మధ్య వైషమ్యము లేర్పడుట మాకు మిక్కిలి శోచనీయముగా నున్నది. తమరును కొప్పరపు కవీశ్వరులును మాకు గౌరవార్హులే యగుట మాగ్రామమునుండి వారలను మిమ్ములను సఖ్యపరచి పంపుట మాకు యుక్తమనియు గౌరవమనియు దోచుచున్నది. కావున మాయుద్దేశ్యమును మీరును అంగీకరించి మీరాసభ మొదలింతవరకు నొండొరులంగూర్చి వచించినవియు లిఖించినవియు మరల్చుకొనుచు నొకరినొకరు లిఖితరూపముగ తెల్పుకొని యెప్పటి స్నేహభావ మవలంబించిన మేము మిక్కిలి సంతసించెదము. మావిజ్ఞాపన నాదరించి మీవైషమ్యకారణములను మరచి మాకు సంతసము కూర్పుదురని నమ్ముచున్నాము.

గుంటూరు. }
4—9—11 }

చిత్తగించవలెను.
ఇట్లు తమ విధేయులు.

యేకా రామయ్య, జి. రామనాథయ్య. వంకిపురం కృష్ణమాచార్యులు. న్యాపతి హనుమంతరావు. కొండ వెంకటప్పయ్య.

## యశః కన్యకాపరిణయము.

సీ॥ తారతమ్య మెఱింగి తరలి వచ్చెడియారు కొప్పరం బం జెఱుంగుదురు మీరు
తప్పెటల్ మ్రోగంగఁ దరలి వచ్చెడియారుకొప్పరం బం జెఱుంగుదురు మీరు
తరుణతాభరము హెచ్చఁ దరలి వచ్చెడియారు కొప్పరం బం జెఱుంగుదురు మీరు
తగుబాంధవులతోడఁ దరలివచ్చెడియారు కొప్పరం బం జెఱుంగుదురు మీరు
తే॥ గీ॥ తిరుపతియొకకన్యకా దాత తెరువు వదలి, వచ్చుచోనింత యాతిథ్యమిచ్చు రాక
యున్నచో నప్పుడే పెండ్లి సున్నయయ్యె, నొకరు వారింపనేటికో యోగ్యులార. 1

సీ॥ కలదొక్క కూఁతురు కలిగెఁ బెండిలి కాకమున్నె వడుగు గాక మున్నె మాకుం
నాంధ్రగీర్వాణభాషాంగనాతిలకమ్ము లిరువు రక్కన్నియ నెత్తి పెంచి
రీడేఱె నెందఱో యీకన్నెఁ బెండ్లాడఁగా నెంచి యత్నించి కడకు దీని
చే నీసడింపుల నూనిపోయిరి తల నరయంగఁ దఱియయ్యెఁ బరిణయంబు.
తే॥ గీ॥ లేకయే పోయె ననుకొనుపాక మెఱిఁగి, కొప్పరపువారు తరలి రాఁగోరి రంత
సంతసించితి మంతనే జాఱఁదొడఁగి, రూరకుంటిమి తప్పేమి యోగ్యులార. 2

సీ॥ 'తల నరసిన నాతిఁ గలయుట కామశాస్త్ర విరోధ'మని మదిఁ దలఁచిరొక్కొ?
'ఉభయభాషలు నేర్చు నువిదఁ బెండ్లాడఁగాఁ దగ'మంచులోలోనఁ దలఁకిరొక్కొ
'పెక్కుమాటలు నేర్చు పెంకెపిల్లనుగొన్న మాటదక్క' దటంచు మానిరొక్కొ
'ఎందఱో జంకిన యమ్మెలాఁడినిగొన్నఁ బరువు దక్క'టంచుఁ బఱచిరొక్కొ
తే॥గీ॥ 'కట్నమే చాల' దనుకొని కనలిరొక్కొ, వారు గోరినదిచ్చు మానేరమేమి
ఎట్టులో పెండ్లిపొసఁగించియెలమిమైన. దన్యమునఁబండితులఁదన్పఁజలపుఁడయ్య. 3

సీ॥ వియ్యమ్మునకు వారె విందుల నంపింపఁ దుల లే దనుచు మున్నె పలికినాము
''కాదుకూడ,,దటంచుఁ గాల్పెకల్పక రాగ ''మంచిదే''యనిసమ్మతించినాము
ఒకమీసమే కట్నమోలిమైఁ గోరఁ దక్కిన మీసమునుగూడ నునిచినాము
కన్యావరణదాఁకఁ గార్యంబొనర్చితి. మంతలో సుముహూర్త మగునటంచు
గీ॥ దలఁచుచుండఁ బురోహితుల్ దగినవారు, కావలసి వచ్చిరంతటఁ గాలివాన
వచ్చి కథయాఁగె నిందలి పొచ్చె మెఱిఁగి; యేలనెపపెట్టెదరు మమ్మహీనులార. 4

సీ॥ ''ఎంత మీసమ్మైన నివి యెందుకికలె,,యంచు నీసడించిన రోసమేమి మాకు
''వైదికకన్యక వలదు కైకొను,,టంచు నీసడించిన రోసమేమి మాకు

''శాస్త్రంబు చదివిన సతియేల మాకంచు నీసడించిన రోసమేమి మాకు
''హెచ్చువంగడపు మీయింతి మాకేల,,యం చీసడించిన రోసమేమి మాకు
గీ॥ మొదటఁగోరితి పిమ్మటఁ జదువు సంద, లేతిఁగిరో? యేమొ వెనుదీసి రెండుకేని
సమ్మతించితి మింక మీరెమ్మి గూర్పఁ; బూనుటది పునరుక్త మోజ్ఞానులార 5
సీ॥ రుద్రాక్షపూస లెఱుఁగ దాల్చువారికి బంగారు వారికే బాంధవంబు?
వెలిబూది దాల్చువారలకుఁ దిర్మణి తిరుచూర్ణాలవారి కేచుట్టఱికము?
''ఇత్వర్థలితిభావ,, లేవేళఁ బలుక్రవారలకుఁ దెల్గులతోడ రాజియేల?
గురుపాదసేవఁ జేకొనిన విద్దియకు బాజారు విద్దియతోడ సఖ్యమేల?
గీ॥ ఏడ 'తిరుపతి, 'కొవ్వురం, బేడ సహహ, ఆహవమె కాని మఱి వివాహంబె కాని
స్నేహమే కాని మాకెట్లు చెల్లుఁ జెప్పుఁడ, నరసులార, గుంటూరు వాస్తవ్యులార 6
సీ॥ గోదావరీనదీ కూలమ్మునకుఁ గొండవీటి కూపమ్ముతో నేరమేల?
ఆమ్రాదితరుజాల మలరుతోఁటలకు గోఁగాకుభూములమీఁదఁ గాఁక యేల?
ఎచటఁజూచిన నిప్పులే వొల్చుపొలములకేలయ్య? జొన్నపొలాల చెలిమి
తిరుపతివేంకటేశ్వరున కంకాలమ్మ జాతరమీఁది విశ్వాస మేమి?
గీ॥ ఇంతకును గాలుద్రవ్విన దెవ్వరో యొ,ఱుంగుదురు మీ;రలెవరిస్వరూపమెట్టి
దో యెఱుంగుదు రరక యేగోవిధమున, మమ్ము నెపపెట్ట నేల? యోమాన్యులార.7



చ॥ పదపడి కొన్ని పద్దెములు పత్రికలోఁ *బ్రకటించి సంశయా
స్పదులగు లోకులం దనిపి ప్రాజ్ఞుల సంధికిఁ గొల్పు యోగ్యులన్

---

(*1911 సం, అక్టోబరు 20, 28 తేదీ కృష్ణాపత్రికనుండి.)

పైసంతకము లొనర్చినవారికి నమస్కారపూర్వకముగా మా యొనర్చుకొను వినయపూర్వక పద్యమయ విజ్ఞాపనము:—

ఆర్యులారా! 4-9-11 తేదీగల తమ పత్రిక 28-9-11 వ తేదీ సాయంకాలము సుమారు 5½ గంటలవేళ మ॥ రా॥ రా॥ కొండ వెంకటప్పయ్య పంతులుగారు బి. ఏ; బి. బిల్; గొల్లపూడి రామనాథయ్యగారు బి. ఏ; బి. యల్; గోవిందరాజు శ్రీనివాసరావు పంతులుగారు బి. ఏ; బి యల్; అను నీపెద్దమనుష్యులవలన మాకు నంది యపారానందమును సునర్చినది. దానిపైఁ గొన్ని పద్యములు భగవతి తోఁపింపఁగా నయ్యవి యన్నియును దమసన్నిధి కంపికొన దలఁచితిమి గాని

ముదమున ముంచి యచ్చటనె మోదమొలర్పఁ గవిత్వగోష్ఠి పెం
పొదవఁగ నుంటి మావయికథోదయముఁ వినుమంబ పేర్మిమై. ౧౯౬

(అప్పుడుప్రకటితమైనపద్యములు)

సీ॥ అనవసరమ్ముగా నాసనమ్మును గోరి యవధానవిఘ్నమ్ము నాచరింప
"మది యయుక్తం,, మటంచు నగ్రాసనాధిపుఁడనినపిమ్మటఁగూడఁ బెనఁగబోము
పెనఁగియుఁ దుదకది గొనలేక సభవీడి యవలి కేగి యసూయనందఁబోము
అందియు నాటకాభ్యంతరమ్మున నుండు నప్పుడు పద్యమ్ము లంపఁ బోము.
గీ॥ ఎఱుఁగకే మీసములఁబట్టి యెట్లొ ప్రేలఁ, బడము దుందుడుకందము పలికినట్టి
పలుకుమూఁడులోకమ్ములనిలిపికొనఁగఁ,జాలుదుము పండితులయొద్ద సరసులార 1
సీ॥ ఒకని పెండిలిలో మఱొకరుఁ డావల్లకీ నిఱుక నుంకించు టెంతేనిఁదప్పు
ఎఱుఁగక యత్నించిరే యందమా పైనిఁ దెలిసియుఁ బెనఁగు టెంతేనిఁ దప్పు
అధ్యక్షుఁ "డిది కూడ,,దంచుఁ జెప్పనమీఁద నేని యాగమి మటెంతేనిఁ దప్పు
అక్షరతత్త్వంబు నరయ కాపై భీతి దీఱి కాల్ద్రవ్వు టెంతేనిఁ దప్పు
తే॥గీ॥ "మీసముల,,పద్యతాత్పర్యవాసనయును,మంత తెలియక ప్రేలాడు టెంతయేని
దప్పు "తప్పని,, నేఁ జెప్పటొప్పగాదు, పండితులచేతఁ జెప్పింపవలయుఁ జుండు 2
సీ॥ తిరుపతి వేంకటేశ్వరులతకుఁగవయును గొప్పరంబున వారి గొప్పఁదనము
ఆంధ్రగీర్వాణభాషావరత్వము గ్రామ్యభాషావధూటీప్రభావగరిమ
ననియమాశుకవిత్వమునఁగల్గు లోపం బనియమాశుకవననిర్ణిద్రమహిమ
అవ్యాజరచనావహస్యత్వమును బూర్వసంచితపతనప్రశస్తతయును॥
గీ॥ సభయొనర్చినపైఁగదా! సహృదయహ్లాద;యావగతమగుఁ, గాల్ద్రవ్వుటలఁతి
వారు, నేఁడుఁదగు కార్యమా! యెంత చేవయేని,నుండియే తీరవలెఁ జుండి యోగ్యులార!

---

గ్రంథవిస్తరభీతియును విలువగలతమకాలమునకు లేనిపోనిపని గల్పించినవార మగుదుమేమో యను సందియమును వెనుకంజ వేయించుటచే నందలిదశాంశమును మాత్రముఁ బంపికొనుచున్నారము. వ్రాసి పంపినచోఁ దమకుమాత్రమే యిందలి మంచిచెడ్డలు బోధపడునుగాని యావదాంధ్రలోకమునకును బోధపడవని పత్రికాముఖమునఁ బ్రకటించికొంటిమి. ఇందుఁగలతప్పులను మన్నింప వేఁడుకొనుచున్నారము. (తిరుపతివేంకటేశ్వరులు)

సీ॥ ఊరూర నారేగు నుత్తరప్రత్యుత్తరముల కేలాగు నాశము ఘటిల్లు.
నొప్పు తప్పుగఁ దప్పు నొప్పుగా లిఖియించు "సత్యవాదుల" వ్రాఁత సహ్యమయ్యెట్లు
క్షమాపరమ్ము తెలుఁగకే ప్రవర్తించు "యథార్థవాదుల" ధార్ష్ట్యమడఁగు నెట్లు
తిరుపతికన్నఁ గొప్పర మెక్కుడనెడి యీ పాటిబండలగోల దాఁటు టెట్లు?
తే॥ గీ॥ ఊరకే స్నేహమును గూర్పఁ గోరినారు, మీర మాయికు, లివియన్ని యేరికతనఁ,
గల్గెనో యింత యోజింపఁగా భవత్సు, సత్యము సహింతు మింక విజ్ఞానులార॥౮॥
సీ॥ అకటా! కవులకు నపయశంబబ్బెఁగా! యనెడి మీహృదయంబు నరసినాము
అది యాసనప్రసంగాధీనమనెడి మీయాశయం బాసాంత మరసినాము,
ఆప్రశంసను దెచ్చునమలాత్ము లెవ్వరో ఆమూలముగ మున్నె యరసినాము
ఈ సభ్యమైనఁ గూర్చియుందు మూలమున వారనఘాత్ములగు పూనిక నరసినాము
గీ॥ ఆపులించినఁ బ్రేవుల నరయఁగలరు, కవులు, రవి యెఱుఁగని చోట్లు గాంచఁగలరు
కొప్పరపు సోదరులెయెఱుఁగుదురు సకల, మకటా! యాసనం బెంత చిక్కు దెచ్చె
సీ॥ "ఒడలెఱుంగని సివమున్నదే" యెందేని మాశక్తి నెఱుఁగమే మాన్యులార?
ఈతమి మించు లోఁతెందేనిఁ గలదె? కా నిండయ్య యొకసారి నిండుసభను
వైదికత్వమున కేవం బేటి కెట్లొ మీసాలు దీయింపుఁడీ నరసులార
విద్వద్వినూతనముల్ విను టగ్రామమున కేమపయశమ్ము సుగూర్పవరయు.ఁ డనఘు
తే॥ గీ॥ లార! సత్యవాదులును, యథార్థవాదు। లిప్పరమ్మునఁ బుట్టుటెంతేనిఁ దప్పు
గాని విద్యలలో నేరుగను జాలి నెఱుఁగు। పూనికలు తప్పుగావయ్య పూజ్యులార!
సీ॥ "శ్రీకృష్ణబుధుండు కరమందు లిఖియించినకన్నఁ జేసిన', దెంత సత్యమయ్య!
"అభిమానమున మమ్ము నర్పించిరే కాని "శుద్ధమూర్ఖులె" యంటు సూనృతం బె?
"రామకృష్ణులఁ బట్టి రహిఁ దట్టినా'రన్న వ్రాఁత యెంతటి సత్యవంత మయ్య!
"నలుబది మందికే సలిపి రివ్వా"రని వెక్కిరించుట యేటి ఫక్కి యయ్య!
తే॥ గీ॥ తమ తెఱుంగని దిందులేశమును లేదు। ఆసనమె తెచ్చి పెట్టె నీయనృతములను।
నిజము చెప్పి యశమ్ము చే నెగడరయ్య। వలదు జంపింక గుంటూరు వాసులార
సీ॥ "కృష్ణ" వ్రాఁత నిష్టేని మీరొకసారి పరికింపుఁడీ హితవాదులార।
"దేశమాత"యొనర్చు దివ్యోపదేశమ్ము లరయుఁడీ యొకసారి యార్యులార।
"ఆంధ్రకేసరి" లోని యంశమ్ము లొకపరి చూడుఁడీ యిష్టేని శుద్ధులార
తక్కు పత్రికల యథార్థంపు వ్రాఁత లింకేనిఁ జూడుఁడి మహాజ్ఞానులార॥

గీ॥ సభను జరిగినయట్టి వాస్తవమదెట్టిఁ?, దెట్లువ్రాయుచున్నారొ, యొఱిఁగిశాంతి
చేయుఁ డీవ్రాఁతప్రోలికిఁ జెడ్డయశము, గూర్చు నిజ మెట్లొ పైకి రానేర్చు నేని.

సీ॥ వేనవేల్ సత్యవిజ్ఞాను లుండియుఁ జెడ్డకీరితిఁ గొనునె గుంటూరుపురము
సభ నున్న మీవంటిసరసులకన్న నాకాశంపుసూర్యుఁడా? కర్మసాక్షి
పంచభూతముల మాపాండిత్యతత్త్వంబుఁ జెప్పఁగా నవ్వించెదరె పౌరు
లెవ్వరో యొకరిద్దఱే హేతువై పురమ్మున కప్రతిష్ఠ రాఁబోఁబునయ్య.

గీ॥ 'రజకువాక్యమ్ములనువిని రాము'లౌట, యుచితమయ్యమీవంటియోగ్యులనసకల
మెఱిఁగినందుకు ఫలమేమి? యిట్టిపట్టు, నందుదాసీనులగు టెంత యర్థమయ్య

సీ॥ "ఆననం బొప్పలే"దని కోపగింతురా? అది గోరుటే పెద్ద యనుచితంబు
"అనుచితం"బనుట కేయాధారమందురా! కొంప్రపుకని దాఁచికొనుటె సుండదు
"అనుచితంబగుకోర్కె ఘను"లెట్లుకోరువా రందురా! అది ప్రమాదాతిశయము
మఱిప్రాజ్ఞులకును బ్రమాదమాయందురా! $ "వారికే"యంచు నిర్ధారణంబు.

గీ॥ చేసిరెవ్రాసిరి వ్యాఖ్యాతృ శేఖరులు, ప్రమాదములు విశ్వసింపమిమాకుఁ దప్పు
అంతమాత్ర తానగంతులకనుమతింత్రె, సోదరులు చెప్పఁడయ్య! యోసూరులార.

సీ॥ ఉచితమో యనుచితంబో చేయుపండితుం డరయఁ గావలె భవిష్యత్ప్రశంసన
అని * భర్తృహరిచెప్పటైనఁ జూడక యేరిప్రేరణమ్మునను దుర్వాదులగుచు
గాలిదబ్బివ్వ యెన్నియోగాఖులు ప్రకటించి తలకుఁదగని ప్రయత్నములొనర్చి
"పండితసభ"యన్న పైఁ గొంత శాంతించి పండ్లబిఁక మొకింతవ్రాఁతయందుఁ

గీ॥ జూపి, ప్రాజ్ఞులసమ్మతి పాపకార్య, మనుచు మము వెక్కిరించిన యట్టివారి
నఖ్య మది మాకు లేకున్నఁ జచ్చిపోము, వృథగ నెపవెట్టకుండుఁడు సుప్రథితులార.

సీ॥ 'ఓంశాంతి'యనెడుమీయోగ్యత వేనోళ్ళ శ్లాఘింపవలెఁ జుండు సరసులార
ఈయూహ మీకప్పుడే పుట్టెనేని మీసములమీఁదికి వారు చనరుసుండు
అంతకొక్కింతపైనైనఁ బుట్టినవారు "కుచమర్దనములు" పేర్కొనరుసుండు
నకలమ్ము జరుగుపై శాంతిఁజెప్పటకన్న నన్యాయముండునయ్యా! మహాత్ము

$ శ్లో॥ ప్రమాదోధీమతామ" పీత్యత్ర, అపిశబ్దఏవకారార్థక ఇత్యభియుక్తాః.
* శ్లో॥ ఉచితమనుచితం వా కుర్వతా కార్యజాలం, పరిణతిరవధార్యా యత్నతః పండితేన. (భర్తృహరిచూ)

గీ॥ లార! విద్వత్తులోఁ దప్ప ననన్యవిషయ, మందుఁ గొప్పింపువారిసఖ్యంబు మాకు
సమ్మతము, దానిలోఁ గూడ సమ్మతింతు, మేని భారతి మమ్మింక నీసడించు.
సీ॥ చోరవమై నెదిరించి సొంతకాయకోఁతలు కోసినారు కటార్లు దూసినారు
అవధానమందు మిమ్మతిశయించెద మంచు వ్రాసినారు సవార్లు చేసినారు
మీఁది మీఁదికివచ్చి మీసాలపైఁ జేయి వేసినా ర్చెదుగుడుల్ గూసినారు
మసిపూసి యెట్టులో మారేడుగాయఁ గాఁ జేసినా ర్త్ర హైడఁ బాసినారు
గీ॥ పెనఁగి మామీసమింతేనిఁ బీఁకకుండ, నెదిరియవధానమున మమ్ముఁ గదుమకుండ
నేటి సఖ్యంబు మాకు? మీకేటిభరము, సభను సమహూర్చుఁడయ్య! యశస్వులార.
సీ॥ బందరేమయ్యెనో? "ప్రిన్సు" లేమయ్యెనో? పుస్తకా లేమయిపోయెనొకొ—
అచ్చేమి యయ్యెనో, ఆస్తి యేమయ్యెనో? వర్తకం బేమి కావలసెనొకొ—
'నూఁక' లేమియయ్యెనో? బాలురేమయిరొకో? యుద్యోగ మేమూల నుండెనొకొ—
ఇల్లేమియయ్యెనో! యితరమేమయ్యెనో? మిత్రవర్గంబు లేమి యయిరొకొ—
గీ॥ వచ్చెనదె రాఁ యయ్యె నీపాటికేము, నెలవు పైకొనుచున్నాము స్నేహభావ
ముంచి పంపింపుఁడయ్య! యేముండె! 'వడ్ల, గింజలో బియ్యపుంగింజ' గేస్తులార.
సీ॥ శ్రావణమాసానఁ జనుదెంచితిమి భాద్రపదమాశ్వయుజము నిప్పట్టణమునఁ
బూర్తిగాఁ గడచె నిప్పుడు కార్తికమువచ్చె నిప్పటికేని మాకింటికేగు
నిచ్చ పుట్టుట లేద, యిదియెల్ల నీసీమవారియాదృతియు నుదారమైన
మీస్నేహితీయునుమాదు ‡ మీసాల మహిమయుఁ గొప్పింపువారి మిక్కుటపుఁ జేర్మి

---

☞ ఈక్రింద నుదాహరింపఁబడు పద్యములు, ప్రకృతము మద్రాసులో బి. యే (B. A. Honours) చదువుచున్న శ్రీ వారణాసి శ్రీనివాసరావుగారు తత్కాలమం దంపిన 200పద్యములనుండి సంగ్రహించి కైకొనఁబడినవి, గ్రంథవిస్తరభీతిచేఁ గొంచెముమాత్రమే యుదాహరించిన మమ్మువ్వారు మన్నింతురుగాక.

‡మ॥ తొలుదొల్తన్ గలనూఁగులేఁ జెమట నెంతో కాంతులన్ గుప్పఁగై, తలఁ జెప్పించితి ధారుణీపతుల హృత్పద్మంబు లొప్పార ని, శ్చలవాగ్ధోరణి మారుతిక్రమము సాష్టాంగంబుగా వ్రాలఁగా. బళిరా! మీసమ! నీకు నీవసరి దిప్పన్ జెల్లురా ని

గీ॥ కవుల, మిప్పటి 'రూల్సు'కుఁ గట్టఁబడము, ఘనులు * పండితరాయాదికవులు చూపు
త్రోవలం బట్టి పోదుము దేవునైన, లక్ష్య పెట్టము † మాకు వల్లభులు లేరు.
సీ॥ తిరుపతి వేంకటేశ్వరుల పేరులు మీకు జ్ఞప్తిలో నిల్చునా సనవుఁ జర్చ
అల్లకొప్పరపు సోదరుల పేరులుమీకు జ్ఞప్తిలో నిల్చు నా సనవుఁ జర్చ

---

దు మని మంచియుఁ జెడ్డయు నెంచకుండఁ బైఁ, జని మనపైకిఁదెచ్చి కొని సర్వవిధంబులఁ జింత సేయ నె, యక్కసుపునఁ బాఱు నేసితిమి! యుద్ధోకఁ డంతన జాలియుంటిమం, చును దలపోయుచుంటి రిఁకఁ జాడుము కోపము మానిమీసమా. చ॥ కలరు కవిత్వసాహసులును గల్గుదు రీకవితాభిమన్యులుఁ, గలరు కవిత్వ భీములును గల్గుదు రీకవిమాద్రిపుత్రులుఁ గలరు కవిత్వధర్మమిఁకఁ గల్గుసమస్తముగల్గకుండినన్, గలుగ నెనీవు కృష్ణుఁ డనఁగాఁ దగి దుష్టుల నెంచ మీసమా. చ॥ దుడుకుదనంపు పోకలను దోసపు సేఁతల కాలవాలముల్, కడు నెగురంగ నంతకు సుఖంబుగ డిగ్గెను వారిపీఁచ మొ, ప్పడఁపఁగ షాలలో ధనము వచ్చిన వెంటనె నీవువత్తు వి, వ్వడు పయఁబూను మూఁకి యలుకఁ బూనక మూను మనీ నీవుమీసమా, సీ॥ అలబృహద్రథుశక్తి పరిమాన వ్వడ నీళ్లు మిఁగిన వివ్వచ్చుమీసమెంత, దుర్యోధనుని గూల్పఁ దోడుగాఁ గృష్ణుండుమిటిక్రీ సపలలాంకుమీసమెంత, వాలినివధియింపవంచ నావృత్తిమైమెమ్మె యనిన రాముమీసమెంత, ఇంద్రజిత్తునికీలు నెటిఁగిత్రుంచుచు దాడ నేసిన సౌమిత్రిమీసమెంత, గీ॥ నీవ మీసంబ వీమహి నీవ 'తుంతి, తంబు, నాఁగలపలుకు నెత్తిటినెలుంగ, వెస్సు డసయాన విగ్రమం శేపహించి జయము గొంటివి జగతి మీసంపుఁ బ్రోడ. చ॥ అలఘుకవిత్వకీర్తిఁ గొనన్ దలకున్ దరమా నెసి మించునె, త్తులగమకింపసంబలుఁదోఁచు నెనితోఁచిన 'జీలు గెత్తు'గా, వెలయ దెసి మేకుమాటమటిపించదె పెంచదె గీరతంబు; నీ, వలుగకు సంస్కృతాంధ్రకవితైకమహత్త్వమనీ చాలు మీసమా. మ॥ సునునిర్వన్నకరండగంధకవితాశుద్ధాంతభృంగీరవో, పమభక్తప్రతిపత్తితో వెలయుచున్ బాండిత్యగంధానిలం, బమలం బై తెమలంగ లోకజనసమ్మాన్యక్రియం బొల్తు నో, కమనీయప్రతిభావిలాసమని నమస్కారం బిదే మీసమా. (13)...

---

* శ్లో॥ మనస్వీ మ్రియతే వాఽపి స్వోత్కర్షం నైవ ముంచతి।
అపి నిర్వాణ మాయాతి నాఽనలో యాతి శీతతామ్॥

† నిరంకుశాః కవయః

విద్వత్కవీంద్రసంవిద్విలాసము మీకు జ్ఞప్తిలో నిల్పు నానసపుఁ జర్చ
కేవల కవుల యకించనత్వము మీకు జ్ఞప్తిలో నిల్పు నానసపుఁ జర్చ
గీ॥ మేటి యానన చర్చకు,మీకుసత్య,వాదులకు, మాకును, "యథార్థవాదుల"కును
మఱియు మామీసములకుఁగొప్పరపుసోద, రులకు,దీర్ఘాయువిడినల్ల పోషించుఁగాక.

---

(పరిశిష్టపద్యములలోఁగొన్నిమాత్రము.)

సీ॥ కాళిదాసునిమార్గ గరిమంబు నెఱిఁగినవా రంచు మిమ్మెంతు ధీరులార
భవభూతి యనుమహాకవిమార్గ మెఱిఁగినవా రంచు మిమ్మెంతు ధీరులార
పండితరాయలదండితన మెఱుంగువా రంచు మిమ్మెంతు ధీరులార
ఆంధ్రకవీంద్రనిరాఘాటత నెఱుంగువా రంచు మిమ్మెంతు ధీరులార
తే॥ గీ॥పలుకఁ నేపలుకఁ దెప్పట్లఁబండితుండు,పలెకఁ నానిల్పునే గానిభయముగొనఁడు
ఇదియె విద్వత్కవీంద్రుల కింపునింపు, మార్గమనిమీ రెఱుంగరే మహితులార.
సీ॥ మాకపకీర్తి సంపాదింపఁగా నెంచి దేశమాతకు దూఱు దెచ్చినారు
మాకప్రతిష్ఠ సంపాదింపనెంచి కృష్ణను నప్రతిష్ఠచే నడిపినారు
మాకు దుష్కీర్తి సంపాదింప నెంచి కేసరిని దుష్కీర్తిపాల్పఱచినారు
మాకు దుర్యశము సంపాదింప నెంచి యాంధ్రపుఁ బత్రికకు నదితార్చినారు
గీ॥ ఎందఱో "యథార్థవాదు' లిం కెందఱేని, సత్యవాదులిప్పరమున జననమంది
నారు శివరామశాస్త్రి యీనాఁటికిశివ, రాముఁడయ్యె మాకేలకొంపుఁజెలిమి.
సీ॥ సఖ్యపఱచి మమ్ము సాగనంపుటకు మీచేయుయత్నము గదు శ్రేష్ఠ మయ్య
సాగనంపకము న్నె చనువాగమేకాని చుట్టుపట్టుల నుండుసూరివరులు
నభలు చేయుటఁ జేసి చనకిందు నిల్చితి మంతియేకాని సభాంతరమున
కింకను సోదరు లేటెంతు రని కాదు గాయత్రి సాక్షి నిక్క మ్మెఱుఁగుఁడు
తే॥ వారి సేమంబు గోరినవారు గాన, సంశయించుచు నున్నారు సకల మెఱిఁగి
నట్టిమాకడ డాఁచ నేలయ్య! వారి, వదలి చిరకాలమయ్యె సహృదయులార.
సీ॥ వ్రాసి యుండంటిరే? వారితోఁ బోరాట మాని కొంటిమటంచు మాన్యులార
వ్రాఁతవ్రాసిన యంత నే తప్పిపోవునే! కాల్ద్రవ్వువారి బింకంపుఁగంపు
కాల్ద్రవ్వ పెట్టినో గనఁ గొన్నపైఁ గాని నిదురఁబట్టదు మాకు నిక్కమయ్య
యీయూరఁ గాకున్న నేయూరనైన మీసమ్ముఁ బీఁకుట చూచి సఖ్య మంతఁ

గీ॥ జేసి విడఁతుము మామీఁద నీసు గొనకుఁ, డనఘులార! దెబ్బను దిని నట్టిపులికి
నూరు పెటులబ్బు మీ రెన్ని యోర్పుమంత్ర, ములనుబఠియింతు రేని యనఘులార.

సీ॥ పుట్టుపుట్టునఁ జిట్టుబుట్టు లచ్చొత్తించి పట్టణంబునఁ బంచిపెట్టునాఁడు
"కాంపిటీషు" నటం చెకాయెకీ నడు దెంచు ప్రజలకోరిక భంగపఱచునాఁడు
అక్షరతత్త్వ మావంత తెలియంగక మీస లాగిఁ బట్టియుయ్యాల లూఁగునాఁడు
ఎఱుఁగని వ్రాఁతలే వేవియో గిలుక్రుచుఁ "గుచమర్దనములు" పేరొక్రనెడు నాఁడు

గీ॥ మీర లేమైతిరో కొక్ర! యిమ్మొయిని జేయు, కాలుమీఁద నాకులకు యత్నాలి వేల
యద్భవతి తద్భవత్యేవ, యనెడిమాట, లెఱిఁగి వర్తింపుఁడయ్య యింకేటిసంధి.

సీ॥ సత్యవాదియెవరో "జంట్లిమన్" పదవాచ్యుఁడే యంట? యానూరి నెఱుఁగుఁడయ్య
అతని జ్యేష్ఠభ్రాత యగు "యథార్థపువాది" గూడ నట్టిఁడె యంట! చూడరయ్య
ఈ యవతారమ్ము లెత్తువారలరసనాంచలమ్ములకు భర్మాంచితములు
భూషణమ్ములు దెచ్చి పొల్పుగా నర్పించి వాసిమై నూరేగఁ జేసి పిదప

గీ॥ సోదరులకును మాకును వాదుతీర్పఁ, బూనుఁడయ్య తరతమత్వములను బట్టి
మార్కులనొసంగుఁడయ్య మీమతిశేష, మెల్లవిద్వాంసులును మెచ్చ నెనఁగుఁడయ్య

సీ॥ "కుక్కతోఁకను బట్టి గోదావరీఁదువా" ర్తిరుపతి వెంకటేశ్వరులు కారు
"వేఁడినీళ్లనె యిండ్లు వెలిఁగింపఁ బూనువా" ర్తిరుపతి వెంకటేశ్వరులు కారు
"గానమ్ము చేఁ జింతకాయలు రాల్చువా" ర్తిరుపతి వెంకటేశ్వరులు కారు
"కంజాప్పు ధూళిచేఁ గప్పనెంచెడివారు" తిరుపతివెంకటేశ్వరులు కారు

గీ॥ పైకి రాకున్న నెవ్వరి పైకిఁగూడఁ। జనరు తిరుపతివెంకటేశ్వరులు వారి
భారతీతత్త్వమును జూచి వారివీరి। తారతమ్య మెఱుంగుట తగదె మీకు.

సీ॥ పిలువని పేరంటముల నొనర్పరు గౌరవార్హుల నవమానమంద నీరు
ధూర్తుల సైఁపరు ధూర్జటియైనను దగవుమాలిన చోటఁ దగవుపెట్టి
తీరుదు రూరక యేరిని గదలింప రెవరేనిఁ గదపిన "నితఁడు తగఁడు
మనతోడఁ బోర" నంచనుకోక యవ్వాని నెదిరించి తమకున్న కదనశక్తి

గీ॥ అంతరానో యింతరో యగ్గలైన పండితులు పొనర్చెడి సభలోన నిలిపికొనఁగ
బూనుదురు పక్షపాతుల పూనికలను। వినరు తామెఱింగిన యట్టివిషయమేయిది

సీ॥ 'సత్యవాది' పదంబు చందాలమయ్యె నద్దాని యాపదదీర్పఁ దలఁపుఁడయ్య
ఆదురాపదమె 'యథార్థవాది' పదంబు గనియెఁ దద్దుఃఖంబు కడపరయ్య

శాస్త్రీయమైనట్టి సరసాశు కవిత ధిక్కృతయయ్యె గెలుపోదు తెలుఁగుఁడయ
పదియాఱుకళల యవధానితో రిక్కల నెనఁజేయుపూనికల్ గొనకుఁడయ
గీ॥ కీర్తికాములరై కవిత్వార్తిఁ బాపి, పక్షపాతుల వ్రాఁతల వలనఁ గలుగు
దేశఘోషంబు సడిపి యుదీర్ణగరిమ। వఱలఁజెలువారుఁడయ్య ధీవరులు మెచ్చ
సీ॥ లేదు శాస్త్రజ్ఞత లేదు కావ్యజ్ఞత సంస్కృతజ్ఞానలేశమును లేద
శబ్దమంజరిఁ గూడఁ జదువంగ లేదయ్యె నదియట్లులుంచుఁ డింకాంధ్రమందు
లేదు వ్యాకరణంబు లేదు పాండిత్యంబు లేదు సారజ్ఞత లేదు శిష్యు
లకు భారతాదుల నొకపద్యమేని పాఠముఁ జెప్ప శక్తి నిక్కముగ నేరి
గీ॥ కట్టియయ్యలు మనయాంధ్రమందు నెట్టి। మీసములు పీఁకుటకు నెట్లు మీసములు వ
హిత్తు లొప్పుదురో? తెలియంగవలయు, సభను సమహార్పఁడయ్య యశస్వులార
సీ॥ తాఁ జెప్పినట్టి పద్యమున కే నర్థమ్ము చక్కఁగాఁ జెప్పినఁ జాలుఁజుండు
తా నుచ్చరించు పదములకే నర్థంబు చక్కఁగాఁ జెప్పినఁ జాలుఁ జుండు
కవనం బనఁగ నేమొ కవు లున్న సభలోనఁ జక్కఁగా జెప్పినఁ జాలుఁజుండు
పద్యమ్ములటులుంచి గద్యమేయనుకొండు చక్కఁగాఁ జెప్పినఁ జాలుఁజుండు
గీ॥ ఆంధ్రమంతయు వల్వదచ్చాంధ్రమైనఁ, జక్కఁగ నుపన్యసించినఁ జాలుఁజుండు
మేము వదలెద మూరకే మీసముల మా। టంచు మీసముఁ దలపెట్టు టర్హమగునె.
సీ॥ మచ్ఛిష్యుల నటుంచి తచ్ఛిష్యులకుఁ గూడ శుశ్రూష జేసి నేర్చుకొనఁదగిన
పాటిపాండితి లేనివారు మామీఁదికి వచ్చి కాఱులు వ్రాసి హెచ్చుతగ్గు
లెఱుఁగక మీసాల నెత్తి పీఁకెద మన్న మాట కేమర్థంబు మాన్యులార
శాఖాభిమాన పిశాచంబు వైదుష్య మీ నేర్చనయ్య యహీనులార
గీ॥ తగినమందులు పక్షపాతమ్మునకు ల। భించుఁ బక్షపాతమునకు లభింపఁ బోవు
"కొఱవిఁబెట్టి నెత్తిని గోఁకికొనియు, నిప్పు। డేటి రాజీలు మా వారి కెఱుఁగఁ జెప్పుఁడె
సీ॥ ఆంధ్రమ్మునందేసి యష్టావధానంపు నామ మెత్తఁగ వీరి కేమిహక్కు?
శతవధాన మ్మనుశబ్దంబు నెత్తంగ వీరిదే యూరయ్య వేత్తలార?
నేత్రావధానమ్ము నిగమజ్ఞులదికదా! దానిపే ర్వీరలెత్తఁ దగునయ్య?
నిజమైన శక్తియుండినఁ "బండితులుగల్గు సభ"యన్న యంత నే జాఱుటేటి
గీ॥ కయ్య! వారు మమ్మెదిరించు టాశుకవిత। యంచ యుక్త మామాత్రమేమైన మేము
విశ్వసింపక యున్నను విశ్వమెల్ల। నమ్మతించుట కొంతేని సంభవించు.

గీ॥ మీకు యశమబ్బు వారికి మేలుగల్గు, మమ్మెదిర్చినపనికి లాభమ్ము వెంట
నే కనంబడు మాకెంతయేలిమోద, మబ్బు సంధియు నామీఁద ననుసరించు.

సీ॥ వైదికలౌకిక వైషమ్య మెవ్వారు తెచ్చిపెట్టిరో? సుంత తెలియుఁడయ్య
ఆత్మగౌరవమునకై పాటుపడువారె దీనిఁ బెట్టుదురు సందేహ మేల
తగుగౌరవంబు విద్వత్తకుండును గాని యున్నమ్మునకు నుండ దనుట ధ్రువము
గానఁ "దదన్యలీకక్షకుఁ గారకు" లని యెవ్వరేనియు ననకమాన

గీ॥ రకట! విప్రులు, దేవాంగులట్లు పశ్వ, తో హరులయట్లు వెలిపెట్టి పోవఁబోవఁ
గావలెనె? దీని మానుపఁగదఁగుఁడయ్య; సంధి గోరుమీకియ్యది చనుఁగదయ్య.

సీ॥ ఆంధ్రభారతకర్త యైనతిక్కనసోమయాజిజన్మస్థాన మైనకతన
శ్రీనాథకవిరాజశేఖరు నేలినకొండవీటికిఁ బ్రక్క నుండుకతన
ప్రకృతంపుఁగవుల సంభావించుగద్వాలరాజ్యంపుఁ దోవలోఁ గ్రాలుకతన
వెనుకకాలమునందు వినుతింపఁదగు పెద్దవిద్వత్తములు దీన వెలయుకతన

గీ॥ నింతకవితాదరంబు మీకిచ్చె మెచ్చ, వలదె గుంటూరిపురిసి విద్వత్తవీంద్ర
జనని, కేవలకవితిరసత్తిరిశ్రి, దీని, మహిమ మెంతేని శ్లాఘ్యంబు మాన్యులార.

సీ॥ నిందింపనేమయ్యె? నిజమైనసత్కీర్తి గడిగించు "సత్యవాదులు" గలారు
గర్హింపనేమయ్యె? గణుతి నర్పించుయోగ్య యథార్థవాదులు గలారు
కయ్యాలకేమి? సత్కవికదంబముల పేర్వెలయింపఁగలనియోగులు గలారు
అభిమానమున కేమి? యాత్మీయుకతన శత్రులఁగూడమన్నుచూన్యులు గలారు

గీ॥ వీరిచే మెచ్చుగొనదు గుంటూరిపురము, సగసతకుఁదావు బలువన్నెసిరుల ప్రోవు
మీకుమీప్రోలికిని మేరమీఱునిరుల, నిచ్చు భగవంతుఁ డంకమస్త్రగ నింపు.

సీ॥ ప్రేమించితిమి మున్నె పెద్దరికము నిల్పుకొన్నచో వారి కేకొఱఁత రాదు
వారినేమముఁ గోరువారె "యాదవకుల మునకు ముసలము" నాసనపుఁ జర్చ
కల్పించి రదిపూర్వకవిసమ్మతము గామి మాకు సంగీకృతి లేక పోయె
దీని నామీఁద వైదికనియోగపుఁగక్షగాఁ బొల్పి రెవ్వరో ఘనులు వారి

గీ॥ నెఱుఁగుఁడయ్య! 'యనవసరమిట్టి కక్ష, లింపుగాఁబో'వనుచు మంపలింపుఁడయ్య
యేరు వైదికులు? నియోగులెవ్వ? రొకటె, విప్రులే గారటయ్య! యోవేత్తలార.

సీ॥ ఘనుఁడు పరమోద్ఘఖండపాండిత్యభూషణుఁడు సీతారామశాస్త్రికన్న
నుభయభాషాకవితోద్వపాయశాలి శిష్టాహనూమత్ప్రవిశాస్త్రికన్న
కృతి యభినవసరస్వతినేత వట్రాభిశబ్దపూర్వక రామశాస్త్రికన్న
ములుకుట్లకులుఁడు నిస్తులుఁ డాశుకవి గుణశాలి వెంకటకృష్ణశాస్త్రికన్న
గీ॥ మఱియునుంగలశాస్త్రవిపన్నులకన్న, మొలచిన వేకొమ్ము లితరులమోములందు?
నవసరము లేనియాసనం బడుగనేల?, చర్చ పెంచఁగనేల? యశస్వులార.
సీ॥ వేదవేదాంగాదివేత్త చేబ్రోలివెంకటశాస్త్రులకేన యన్నుఁడగునె?
రామదుర్గకులుండు ధీమన్మణియు రామకృష్ణశాస్త్రులఁ బోలనెవని వశము?
కంఠపాఠము నాటకములెల్ల శ్రీనూరి హనుమద్బుధుని కెవ్వఁడగును దీటు?
అతిశాంతమూర్తి సాహిత్యపట్టు శ్రీపార్వతీశశాస్త్రికి సాటి యొకఁడు గలఁడె?
గీ॥ మఱియు నెందఱులేరు ధీమంతులందు, వీరిలో నేరు కొప్పింపుకారు చెప్పుఁడ?
నారికేయాసనంబుల గోరనేల, చర్చ పెంచఁగనేల యశస్వులార!.

సీ॥ కవి పురాణభాషావగాహి వంకిపురవంశజుఁడు శ్రీకృష్ణమాచార్యకన్న
బలిజేపల్లి కులసంభవుఁడు కవిత్వవిస్ఫూర్తి లక్ష్మీకాంత సుకవికన్న
సకలకళానైపుణికిఁ దావు నేటి సుల్లాది వెంకటసోమయాజికన్న
నాలువేలనియోగి ఘనఘనపూడివంశజ హనూమచ్ఛర్మశాస్త్రికన్న
తే॥ గీ॥ మఱియునుంగల సత్కవిమణులకన్న, లౌకికాగ్ర్యులకన్నను లెంతివారి
కాసనము గోరనేలయ్య! యనుచితముగఁ, జర్చ పెంచఁగనేలయ్య సరసులార?
సీ॥ శ్రీంగి భరద్వాజదీక్షితులవారిపుత్త్రుండు తచ్ఛక్తి గలకైత దనరుసుకృతి
“అవధాన మేఁ గూడ నాచరించితి నని స్వయముగాఁ జెప్పికోఁజాలుధట్టుఁ
డొకశైలినేకాక ప్రకటితంబుగఁ బలుశైలులఁ గవనమ్ము నలుపుజాణ
ఎపుడు రచించినన్ త్వెకనుపట్టుతే పలుకృతుల్ ప్రకటింపఁ గలయుపాయ
గీ॥ శాలి శ్రీబాపట్లప్రభుపునాచాగవరంబ్రహ్మసచివమంత్రిప్రవరవంశభవుఁడు శ్రీభు
జంగరావులకేల యాసనము నడుగ?. రౌరులు వీరికి మిన్నలే మహాగుణులార?

మ॥ పటుజంఝానిలఘోరగీరగరలత్పారిగా౯భరనుసాక్రాంటవీ
తటశాఖాపటలాంతరస్థగనితాంతస్వారఘోరాగ్నిరు
గ్ధటనాసూపితభస్మసాత్కృతకురుటారండజంబుతో వహ్నికిన్,
ఘటియించం దలపెట్టినారుకద! సత్ఖ్యాతిం బాగ్యచూపామాత్యుల్.

మ॥ స్వకృతాగ్నిప్రకర ప్రచారనిహతాపారస్వయోధ ప్రజా
నికరాత్మైకశరణ్యసర్వధరణీ, సన్నేతృతాభాగ్యభా
రకృతాహంకృతితో సుయోధనునితో భ్రాజిష్ణునిన్ ధర్మపు
త్రికునిన్ గల్పఁదలంచినారె? యిది ధర్మ్యంబెట్లు లోహో! హితుల్.

సీ॥ "గర్వం"బనెడి మిష గల్పించి దుఃఖంబు దీర్చుకో నుంకించు ధీరుఁ డొకఁడు
"పండిత లక్షణ" ప్రస్తావమిష చేతఁ బడదిట్టినట్టి సర్వజ్ఞుఁ డొకఁడు
"వఁటబావనికుత్సవం"బంచుఁ గల్పించి రసఁ జేరుగనుయశో రాముఁ డొకఁడు
"రామేశ్వరీయ"మన్నామంపు పొత్తాన బూతు లేకరు వెట్టుపుణ్యుఁ డొకఁడు
తే॥ గీ॥ మఱియు నెందఱో శాఖాభిమాను లిట్లు, బయలు దేఱిరి యింక నుబయలు దేఱఁ
గలరు కీరితి చేకూర్పఁ గలరు సంధి, కొప్పరపు వారికేటికిఁ జెప్పుఁడయ్య.

సీ॥ "ఈఁలకూరకుఁ బోయి యిల్లటం బున్నట్టు"లయ్యె మావర్తనం బార్యులార!
అలపాశుపతమహాస్త్రాగ్ని హోత్రజ్వాల లాఁగిపోయెను దీన ననఘులార!
కాఁకరపర్తి "శృగంపుభంగపు" వ్రాఁత లడఁచుపూనిక దీన నడుగుఁబట్టె
చర్ల నారాయణశాస్త్రి "బార్హస్పత్య" మరియు వేడుక దీన నంతరించె
గీ॥ గీరతము సారెకుం గోరు గీరతులకు, తూహాలమ్మునకింపుచుక దొడరె విఘ్న
మికఁ గ్రతమ్మున, నిఁకనింటి కేగ నాజ్ఞ, యొసఁగుఁడయ్య గుంటూర్పురీయోగ్యులార.

సీ॥ కొపరింపువారు మాకుఁ గనిష్ఠు లవ్వారి కరయఁగా జ్యేష్ఠుల మగుదు మేము
కొప్రింపువారు మాకు సుశిష్యు లవ్వారి కరయఁగా నొజ్జల మగుదు మేము
తత్క్రవిత్వంబు "సదరు మరాటా రైలు" "మదరాసు రై"లయ్య మాదు కైత
మిత్రుల నవ్వారు మెప్పింతు రేము శత్రులఁ గూడ మెప్పింపఁ గల మొకింత
గీ॥ వయసు కా! పెద్దలము మేము, వారు పిన్న, లంతియే భేద మింతకు నింత కలహ,
మెందులకు? స్నేహితుల మైతి, మింక మీరు, శంక దక్కుఁడు సెలవు నొసఁగుఁడు మాకు



క॥ ఉరుకీర్తి నరసరాట్పుర, 'వరవాసుఁడు పంగనామవంశ్యుఁడు సుగుణో
ద్ధురుఁడు నరసింగరావ, ప్పరమునకున్ మమ్మును స్వయముగఁ జాఁబిలిచెన్
తే॥ గీ॥ అతఁడు శాఖాభిమానుల, కహితమైన, పనికిఁ బూనిన కతన నప్పట్టణంపు
శాఖలోని గుణాఢ్యులు సాగకుండఁ, జేయవలె నని యత్నంబు చేసి రంబ,

ఉ॥ *ఆపురికేను రేపు చనునట్టికుతూహల మూనియుండ నే
సాపిరుకొని యయ్యనఘుపజ్జకుఁబోయి "వృథావ యత్న మే
లా పొనరింతు? విప్పరికి నల్లకవుల్ చనుదేరు భీతి లో
దాపర మయ్యె వారి" కని తా నొగి బొంకె కలంచె నాతనిన్. ౨౦౦

చ॥ కలఁచు ప్రసిద్ధ వంశ్యుఁ డరికాండము నైతము మెచ్చఁ బద్ధతీ
బలమున కిక్క యా "వయిపిపాటి" నివాసి, యశస్వి తాఁగి యా
ద్యలకు నిధాన మంట? కవితా వనితా హృదయంగముండు పే
ర్వెలసిన "రామరా" వనెడి పెల్లముకొండకులీనుఁ డున్నతిన్. ౨౦౧

---

*(నర్సరావుపేట శతావధానపీఠికనుండి.)

...నర్సరావుపేట.

ది 30-9-11!

నా ప్రియమైన ఆర్. హనుమయ్య గారికి— శ్రీ "తిరుపతి వెంకటేశ్వరకవీంద్రుల"నిక్కడకు దయచేసి వారి కవితానైపుణ్యమును జూప నిక్కడకు రమ్మని యాహ్వానఁ జేసియుండుట మీకు తెలిసిన విషయమే కదా; వారిని ఆహ్వానచేయుటకు తగుప్రయత్నములన్నియు సిద్ధపర్చుకొని యున్నాము. నోటీసులు పంచిపెట్టి సొమ్ము వసూలుచేసి పెండాలు వగైరా సిద్ధముచేసి యున్నాము. వారు రేపిక్కడకు వత్తురని నిరీక్షిస్తూయున్నాము. అవధానము రేపు 1 గంటలగాయితు ఆరంభమగునని నోటీసులలో ప్రచురించినాము. ఇక్కడ శతావధానమే లేదనియు, యిది యంతయు నబద్ధమనియు. పి. నరసింగరావు సదరు కవులను మోసగింపదలచినట్లున్ను, ఎవరో వారితో చెప్పియున్నట్లు, వినుట మిక్కిలి విచారకరముగా నున్నది. అట్టి మాటలేమియు నేను తలంచ లేదనియు, యీశతావధానముకై పూనినవారందఱు మరియాదగల పెద్దమనుష్యులనియు, మేము రూఢిగా చెప్పుచున్నాము. అవధానమిచ్చట జరుగుట యిష్టములేనివారలు పన్నినకుట్రమాటలై యుండునని మేము తలంచెదము. ఈవిషయమై మేమింక వ్రాయవలసిన యవసరముండదు. సదరు విద్వత్కవుల మనస్సునగల సంకోచము మీరు నివర్తింపచేకోరుతాము, రేపు పుదయం 9 గంటల రైలుమీద వారు యిక్కడికి దయచేయవలయును. ఈ పుత్తరం తెచ్చినవారు ప్రత్యేకించి వారినిక్కడకు తీసికొనివచ్చే నిమిత్తం

చ. అతనికి మాయెడన్ మఱియు నాయనయందున మాకు నినిర్హ్వై
నరితరమైన కీర్తి యలరారెడి నవ్వరిలో వధానమున్
గుణకముపై నొనర్చి కనుఁగొంద మటంచుఁ దలంచుచుంటి మ
త్రితజని పెన్పై నొకర్హుఁడు కడిందిగఁగయ్యము దయ్యముంబలెన్. ౨౦౨

---

పంచుటకిని, శేషువారు ఇప్పటికి రానియెడల మాకవమానకరముగా నుండును, ద
యయుంచి వారు శేషు బయలుదేరులాగు చేయకోర్తాము. ప్రస్తుతము గుంటూరు
లో యితరులు "శతావధానము" చేయుచున్నను, వీరిప్రఖ్యాతి యిదివరకే లో
కములో పాదుకొనియున్నది. కాబట్టి దానిని లక్ష్యముచేయక తప్పక రాగోర
దము.

ఇట్లువిధేయులు
ఆర్, కృష్ణమూర్తి.
పి. నరసింగరావు.

షరా—(ఇంగ్లీషు వుత్తరమునకు సరియైన తెనుఁగు.)

---

చంపకమాలిక॥ "భయపడినారు రా" రనుచుఁబల్కిన వాఁడెట్టి యెవ్వఁడో
మహాశయుఁడు భవత్సమీపమున; జం కనునట్టిది మాకుఁ జెప్పదు, ర్జయుని ప్రమిం
చుతావకఘనత్వము శ్లాఘ్యము "సత్యవాది" దుర్జయము, "యథార్థవాది" యపరాధ
ము, నింతకుమున్న పత్రికల్, స్వయముగ వెల్లడింపఁగని వారలవారణ పెట్టుటంచు
నా, మామెదియుఁదోఁప కేవగచునస్త్రదఖండరుపాగ్నికీలకీ, వ్యయితదురూహ దుర్జయ
ముకాజ్యము గావుటకించుకేని సత్యదియమును గల్గునే! యకట! తిర్పతివెంకట శాస్త్రు
లెందుకో! భయపడెటల్; రిపుల్ మునుపె పాఱిరి దూఱిరితోఁచినంతయున్, నయ
మొకయింత నేరనియనాథలు వాఁగుట తప్పనన్యమే, యియుభయకారణం బరుగుపేర
దు వారలనోరుమూయ మీ, కెయనఁగనేల! దుర్నిరనుకునేని యశక్యమె? దేవుఁడెందు
ని, శ్చయముగ లేఁడ"టంచనెడి సాహసులన్ భజింతుఁడేని యే, మియు నొనరింప
నేర్చునె! యమేయునకేని యసత్యవాది దు, ర్జయుఁడె స్వయంకృతమ్ములపరాధము లే
తుదిరూపుమాపు చో, గయకరుగన్ వలెన్ దురితకారకులౌ మొఱకుల్; తదీయని, ర్జయత
రవర్తనంబడఁకరా దదివృద్ధికి వచ్చుటేసుఁడీ; యయమొనఁగూర్చుసజ్జనుల; కత్రి

క॥ అతఁ డింట నుండియే తం, డితులం బిలిపించి విద్య నేర్చెన్ శాస్త్ర
స్మృతిముఖ్యసంస్కృతకళా, గతి నసదృశుఁ డంతె కాదు కవితాన్వితుఁడున్
తే॥గీ॥ నరసరావుపేట శతధానంబుఁ మొదట జరిగె నందు నొకానొక జనుఁ డు రామ-
రావు వడిగి సమస్య వైరంబు కతనఁ, దెచ్చి మాకిచ్చె నది మాకు నచ్చదయ్యె ౨౦ గో

---

# నరసరావుపేట శతావధానము.

ఉ॥ మా కొఱ కొక్కఁ బ్రహ్మను సమస్తకళాకరు సృష్టి చేసి యా
వ్యాకరణామృతాంబుధికి పారిషయుల్ బొనరించి మమ్ము; మా
స్వీకృతశిష్యులన్ నదులఁ జేసి యశం బనిశంబు నించి లీ
లాకలనంబునన్ నరసులన్ దనియించుపరాంబ నెంచెదన్.

ఉ॥ రెండవసారి యర్జునుఁ డరిందమయాత్రకు నేగుపట్టునన్
ఖండనమందు గాండివము పార్థునిహస్తము నుండి జాఱిన
ట్లొండొకచో స్ఖలద్గతియు నుండిన గేలి యొనర్పకుండ మా
చండిక వచ్చి వెంబడినె సర్వము నిర్వహణం బొనర్చెడున్. వెం॥ శా॥

ఉ॥ "ఎందులకై జనించితిరొ యేపనికై మహీ పూనియుంటిరో
అందులకై శ్రమఁబడక యందును నిందుఁ జరించు టేల" యం
చుం దరిలేని నీదయను జూపఁగ నెంచితి వోమదంబ! యీ
చందము గాఁ వధానములు సాఁగఁగ నిమ్మటు లేని యీశ్వరీ. తి॥ శా॥

సభ్యులిచ్చినకల్పన.

సీ॥ చుట్టుపట్టుల నెందుఁ జూపట్టదే సింగ మని మనంబున ధైర్యమును వహించి
జంబుక మ్మొకండు జంకింతయును లేక గర్జించె నఁట! "సింహగర్జిత" మని
ఆసమీపస్థకుంజాంతరమ్మున నిద్రఁ గనుచున్న యొక్క సింగమ్ము కన్ను
లర విచ్చిచూచినయంత నే యానక్క వీఁక యంతయుఁ జెడి తోఁక ముడిచి.

---

మ్మౌన మొనరించు సజ్జనావళిఁ కంటెఁ బడఁదిట్టువారె యాప్తవ్రజంబు తే॥ గీ॥ మాకు
నుచు నెంచు లోకసమ్మతులె కాని, "శత్రుసభ" యంచు మదిలోన జంకిపోము,
వంచకశతావధానులపంచలోని, వారు తిరుపతివెంకటేశ్వరులు కారు. (తి॥ వెం॥)

వరధవళేశ్వరంబున నివాసముఁ జేసినబ్రహ్మశాస్త్రి భూ
సురవరసిద్ధ శాస్త్రములు సుస్థిర తన్మతిఁ బెంచి వారిస
త్త్రరమున నన్నముం దినుచుఁ దత్సరణద్గమఁ బోలెఁ గవిప్పలుక్
వరనకవిత్వమార్గములు సభ్యులు మేలనఁ జెప్పి వారి యు
త్తరపుఁబొందు సద్గురుని దత్తయ భక్తి నుతించి వేగవే
తిరుపతివెంకటేశ్వరను ధీమణు లిర్వురు ప్రాజ్ఞులై భువిన్
దిరిగిరిసర్వదేశములు తేజము లర్పఁగ విత్వకన్యకా
వరులయి రాజ్యపూజ్యులయి వందలువేలు వనంగరాని సుం
దరపతకాదిభూషల సుదారధనంబులఁ గొంచు నర్సరా
ట్పురమున కేగుదెంచిరి సుపూజ్యత నీయఁ దలంచు మంజనా
వరతనయా! యటంచు నభివాదన మొనరింతు మానసిక్

బూరుగుపల్లి లక్ష్మీనరసింహాచార్యులు,

మ॥ నితతాత్మీయశతావధానకవితా విద్యావిహారా సం
భృతశిష్యాంబుదవాఙ్మయామృతరస ప్రీతాఖిలాంధ్రప్రజా
ధృతరజ్యత్ప్రదసీకావతంసకృతవందిస్తోత్రమాలావిభూ
షిత మా వెంకటశాస్త్రి నేఁ బొగడెదన్ శిష్యస్వరూపమ్మునన్.

దివాకర్ల తిరుపతిశాస్త్రి, శతావధాని.

☞ అవధానపద్యములేమి, అయ్యవధానాంతమున నితరులు చెప్పిన పద్యములేమి కడుస్వల్పముగా మాత్రమే యుదాహరించితిమి, ఇందు దివాకర్ల తిరుపతిశాస్త్రి, అనుచేవ్రాలుగల పద్యము, అష్టావధానాంతమున, వెం॥ శాస్త్రినిగూర్చి చెప్పినది. అయష్టావధానపద్యములను, అచ్చయియున్న నరసారావుపేట శతావధానమందే చూడఁగోరెదము. దానివెల రు 0-3-0 లు మాత్రమే.



క॥ అందుఁగల "పశ్య" శబ్దము, సందేహాస్పదమెకాకె సరసతరఘుగా
డెందమునకుఁ దగులదు త, త్సందర్భముకి తనదుష్టతకుఁ దావనుచున్. ౨౦౯
గీ॥ పృచ్ఛకుఁడు మూర్ఖుగాన నష్టేమియనక, పైడిపా డేగి మఱునాఁడువచ్చివచ్చు
నప్పడారామ రాట్కౌ నటకుఁదెచ్చెఁ, "దప్పెటులొ తెల్పుఁ" డనెడివాదమ్ముకొఱకు
క॥ గతదినమే కౌముదిఁ జూ, చితి మే మద్దానికొఱకు, శ్రీకరుఁ డలదీ
క్షితుఁ డటఁ "బశ్య" యనియుదా, హృతిఁ జూపెగ సూత్రమందిఁ కేమనవచ్చున్,
తే॥ గీ॥ సావరీసులరాను రానల్లబలమయూరి, వాదమునకేగుదెంచి యవ్వాసరమున
నలువు నష్టావధానంపు సమయమందు, మరల నడుగంగఁ జేసె నమ్మొఱకుచేత
ఉ॥ అంత కొకింత పూర్వమె* సమస్యను బూర్తియొనర్చి మేము ని
శ్చింతగ నుండియున్ "మును పు చెప్పితి కూఁగద? తప్పటంచు ని
ర్ధాంతము సేయఁగా వలయు నానుడి యట్లొనరింపమేని దు
ర్ద్వాంతులు వైరులిక్రితనఁ దాండవమాడుదు" రంచు నెంచుచున్. ౨౧౦
క॥ అది యెట్లు తప్పగునొ? త, త్పరిపాయము చూడకయె వెసన్ సాహసమున్
మది నూని మున్ను బలెఁ "ద, ప్పది" యని పల్కితిమి మే మనాతంకముగన్.
ఆ॥ వె॥ "ఎట్లు తప్పనెప్పుఁడీ?, యని యతిపిన, యంబుమెఱయమమ్ము నడిగె మొఱకు
'ఇపుడు గాదు పిదప నీవని తీరిచి, చెప్పవార' మనుచుఁ జెయ్యిలుడిగె. ౨౧౨
ఉ॥ కౌముదిఁ జూచియుండియు నఖండుఁడు రామకవీంద్రుఁ డన్నదు
స్సామత కోహటించి మది ధైర్యము చాలక మిన్నకుండె నం
బారి ముగిసె నవధానము క్రమమ్ముగ నంతట రాత్రి యయ్యె నా
యామహితుల్ గృహమ్ములకు నమ్మెయి నేగిరి సంతసమ్మునన్ ౨౧౩
ఉ॥ ఏమును సంటికేగితిమి, యేగెడునంత శ్రీయుత్తరం బొకం
డేమను జూండొ తెచ్చె నట నెందును రామకవీంద్రువ్రాలు లే ౨౧౪

* శ్లో॥ యః పశ్యతి జగత్సర్వం యోన పశ్యతి సర్వతః, తాపుభౌ పరమాత్మానం పశ్యాపశ్యౌ చ పశ్యతః॥ (విస్తరమునకు 'పశ్యాంపుశ్యాం' చూ)

## శ్రీ బ్రహ్మశ్రీ తిరుపతి వేంకట శాస్త్రుల వారికి.

బ్రి॥ ......... రావు వ్రాయున దేమనగా? నిన్నటి దినము శతావధానములో బ్రహ్మశ్రీ ......య్య, అనునొక పృచ్ఛకుడుఅడిగిన "పశ్యాపశ్యౌ నపశ్య

ఛామెయి: జూచి "రామకవి కంతగ ధైర్యము లేదులే" దటం
చేము మదిన్ దలంచి *ప్రతి యించుక వంపితి మల్లజాబుకున్.

---

తః" అను సమస్యతప్పని మీరు అనేక పర్యాయములు వక్కాణించి యున్నారు. ఈరోజున ఉదయము కూడా "తప్పులేదని చెప్పినపండితు డెవ"డని పండితదూషణతో నుల్లంఘన జేసియున్నారు. ఈరోజున అష్టావధాన సమయమున తిరిగి ఆప్పృచ్ఛకుడే ఆవిషయమును అడుగగా సభానంతరమున మీరు చెప్పిన విషయమును సమర్థించుకొందుమని చెప్పియున్నారు. గనుక మీరు చెప్పినప్రకారం తప్పును చూపించుటకు సామర్థ్యము కలిగిన యడల పండిత సభ చేయించుటకు సిద్ధముగా నున్నాము. అందుల కియకొననిచో వ్రాతపూర్వకముగా సమస్యలో తప్పు లేదని యొప్పుకొనుచు "సమస్యతప్పు అని చెప్పుటయేతప్పు" అనిమీరు తెలియపరచవలయునని కోరుచున్నాము. పండితదూషణనివృత్తికొరకై యేది విధియో ఆప్రకారము చేయవలయునని కోరెదము. సాహసముగా సభలో పండితదూషణ చేసినందుకై యిట్లు వ్రాయవలసివచ్చినది. వెంటనే జవాబీయగోరెదము. కాలయాపన ఉభయత్ర కష్టము.

Yours Sincerely,

(ఇంగ్లీషుచేవ్రాలు.)

2-10-11

Narasaraopeta.

---

*శ్రీమత్పరదేవతాయై నమః.

మహారాజశ్రీ ......... రావుగారికి

అయ్యా

తమయుత్తరమందినది. అందుప్రస్తుతవిషయములు కొన్ని వ్రాసినారు. నేను పండితదూషణము చేయలేదు. ఆసమయమున నాయుచ్చరించిన మాటలు విద్యావిషయములు గాని పండితదూషకములు కావు. అదియటులుండనిండు. ఇది పండితవిషయముగాని తమ విషయము కారు కావున నావిషయమై తమకు జ

తే॥ గీ॥ శ్రీరామరాజ్యపత్రికలో న వ్రాలు చేసి, పంపుచో నుత్తరంబీయవలయు ననియు
పట్టి "శశ్వత్ప్రతి, గాంగ్రిడతో వాద మేల, యనియు భావించి ప్రతి పంప మంబరియేము

సౌౌన్నత్యమును కలుగ నేరదు. ఇంతటనైనను విజయదశమినాడు మాచే వ్రాయబడి న ప్రకారము స్వవచన పోషణసమర్థత్వము గలిగిన పండితస కు వచ్చెదరని తల చెదము.

(తెలుగుతో చేవ్రాలు)

---

నరసారాయునిపేట
3-10-11

శ్రీమహారాజశ్రీ తిరుపతి వెంకటేశ్వర్లుగార్లకు

అయ్యలారా!

"పశ్యాపశ్యాన పశ్యతః" యనుసమస్య విషయములో రెండుదినములయందును "సమస్యలో తప్పు గలదుగాన పూర్తి జేయవీలులే,, దనిమీరు దృఢముగా జెప్పియున్నారు పండితులు సాధువని చెప్పినారని తెలియపరచుకున్నను పండితుల నగౌరవసూచకముగా నింద నల్పినారు సామర్థ్యముగలయెడల స్వవచనపోషకము చేయుడీయని బ్రహ్మశ్రీ.........రాయులవారు మీకు వ్రాసిన సదుత్తరము లివ్వబూనరైతిరని తెలియవచ్చినది పైనసమస్యతప్పుగా నున్నదని మీరు పండితలక్షణముగ సిద్ధాంతపఱచినయెడల నూటపదియార్లు రూపాయలు మీకుతప్పకుండ నిచ్చుటకును సాధు వని సిద్ధాంత పఱచిన నట్టిమొత్తమే మీరుమాకునిచ్చు నట్లుగను మీరు వడంబడిక చేయునెడల నందులకు మేమంగీకరింతుము పైప్రకారముబూనెదరా, మీతరఫున జానపాటిపట్టాభిరామశాస్త్రిగారు వచ్చి మాట్లాడగా నీసంగతులచే మీతో కలసి మాటాడి జబాబునిత్తు మని చెప్పి కాలవిడంబము చేసినందున నీకాకితము వ్రాయవలసివచ్చినది వెంటనేజబాబువ్రాయకోరినాము.

ఇట్లు

......శర్మ శాస్త్రి.

......శర్మ శాస్త్రి.

చ॥ ఉదయము మాప్రయాణ మపు"డూకున నేగఁగఁ జేతు"నంచు స్నాం
పొదవఁగ యత్నమున్ సలుపుచుండు నెడన్ 'రయి"లేగు వేళ కి
య్యది తుదముట్ట దేగవలె నక్కడ నింకొకచో సవన్ను మా
కొదవు కతాన"నంచు నలయుత్సవ మాఁగితి మంబ! యే మొగిన్- ౨౦౭

శా॥ "ఊరేగిం పొనరించి తెచ్చితిమి మి"మ్మో హొయా" యన న్నేఁడు నిం
పారన్ బంపెద మల్లె" యంచు నరసింహా రావు లోనైన యా
ధీరుల్ పల్కఁ దొడంగి రెట్లొ యలసద్ధీమంతులన్ మాన్చి కా
ర్యారంభంబునఁ జేసి యేగితిమి మే మానాఁడు గుంటూరికిన్ ౨౦౮

చ॥ పతితుఁడు *"సత్యవాది" తరువాత నెటో లిఖియించె వాని కే
గతి పరమందుఁ గల్గెడినొ! కట్టిఁడి సర్వ మెఱింగి, యున్న సూ
నృతము నడంచి యాత్మను జయించి వృథా వదరు ల్లిఖించు నా
చతురుని సాహసమ్మునకు సల్పవలె న్నతు లెన్నియేనియున్. ౨౦౯

శా॥ అంబా! యిట్టి యసత్యవాదులకు నీ వావంతయే నల్గ"కా
లంబింపం జన దీరసత్య మని వాలాయం బెదేరీతి జ్ఞ
ప్తిం బుట్టింపుము, నీదు కోపమున కీ"దేవయ్య" లే పాటి? కో
పం బూనన్ బని లేద, పిచ్చుకల పై బ్రహ్మాస్త్రముల్ నింతురే. ౨౧౦

ఆ॥ రైలు కదలు వేళ రయమున నొకఁడొక్క, §యుత్తరమ్ము తెచ్చి యొసఁగె

---

*పరా:—ఈ 'సత్యవాది' తప్పుడు వ్రాఁతను గుంటూరిసీమ, పూర్వరంగము 58 వ పుటలోఁ దుట్టతుదఁ జూడుఁడి, దాని సత్యాసత్యములను గూర్చి మ॥ రా॥ రా॥ వంగనామాల నరసింహారావు పంతులు గారికిఁ గాని వేరొక సంఘసన్నిగృహస్థునకుఁ గాని యోగ్యుఁడని మీకుఁ దోచిన యెవరికిఁ గాని వ్రాసి తెలిసికొనఁ గోరెదను,

---

§ఓం పరదేవతాపతయే నమః

బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరుల గార్లకు.

బ్రహ్మశ్రీ ..........రాయశర్మ వ్రాయునది.

అయ్యలారా! హైమండు జూబిలీ రీడింగురూం వారు నిర్మాణము చేసిన టుల శ్రీవంగనామల నరసింగ రావు పంతులు గారు తమనాహ్వానము చేయుటచే తామి

రులచేఁ దోడ్కొనిపోఁబడి ఘనసుకంపెని సెండాలులో నవధానంబొనర్చి పండి తజనహృదయాహ్లాదంబుఁ గావించిరి. ......మూఁడవపాదమునులవముగా నాల్గవ పాదము సంఖ్యనుడివి ఎవ్వరేపాదము చెప్పుమన్న నాపాదము చెప్పుచుఁబూర్తిచే యుటచే వీరియద్భుతధారణాశక్తి సభ్యులకుఁ దెల్లమయినది. ... సభ్యులలో నెవ్వరోయొకరు పద్యములన్నియుం జదివినంగాని యవధానపూర్తి కాదని తమ యసూయను ప్రకటించినను సభ్యులు కాలహరణమున కోర్వలేరైరి. కాని శ్రీ

---

ఇతనిపిమ్మట, నిరుపుర'శర్మశాస్త్రు'ల వ్రాలు గలయుత్తరములలోని, రెండవ సమాని సీధరించిన,శర్మశాస్త్రి' బిరుదము, 'పండితునకుఁగాని మేముత్తరమీయము' మనుమాట చేఁ గల్పించినది. అతనిని మొదటియుత్తరమున 'బ్రహ్మశ్రీ అని వ్రాసితిమి...అ య్యా,అను నొకపృచ్ఛకుఁడు' అనియే యీకలహప్రవర్తనుఁ డగు "రావు" గారింటను, గానిసమయానుకూలముగానీ'శర్మశాస్త్రి'భూమికనతఁడు వహింపవలసిన వాఁడయ్యె ను. ఎట్టిమూర్ఖునకేని యీగుట్టుసుగమమే యగుటచే గుట్టుమట్టు లెఱుఁగని వారైన య్యేమిది గుఱితింపఁగల్గితిమి, కావుననే యీ'శశ్శోటులకు' మేము జవాబీయ సంగమైతిమి, ఆపిమ్మట నిదితోవ్రవ గాదని 'అవధానార్థమాహ్వానించుచున్నవారె ని క నొకయుత్తరమంపిరి, అందలి' పరదేవతావళి'' శబ్దమును, దాని 'పరదేవతా' శ బ్దమును, విచారించినచో మఱికొంత వారితెల్వి బయలువెడలఁగలదు. ఆటులుండు లుండె, పాపము! ఏగ్రంథమునందుఁగాని' పశ్య, శబ్దము సాధువు కాదని ! సాంద బడియుండ దనుదృఢనిశ్చయము రామారావుగారి కుండుటచే వారీ'శశ్శోటు లను బేరేపియుందురనునది మేము వ్రాయకుండఁగనే ప్రపంచము తెలిసికొనఁగలదు గాన విస్తరింపఁబనిలేదు సమస్య పంపినవారుగాన రామరావుగారు స్వయముగా మష్టుడుగ వచ్చును,చెప్పఁగలిగినచోఁదగు సమాధానమును, లేనిచో ప్రమాదము ను మేము చెప్పనువచ్చునుగాని 'చల్లకువచ్చి ముంతదాఁచిన'సామెతగా శ్రీరామరా పుగారు, ఎందులకును గొఱగానిమానిసులకు 'శర్మశాస్త్రి' బిరుదములను దగిలి యుఁ దగుల్పకయు, అవమానకరములగు నుత్తరములను వ్రాయించుటను గూర్చి శి ష్టులే విచారించుకొందురుగాక. మాయుద్దేశమును బట్టి వారిట్లు ప్రవర్తింపఁదగువారు కాకున్నను నట్లు ప్రవర్తించుట భావ్యపజయసూచకమనియు నందులకే పైనపట్టు వ్రేరేపియుండుననియుఁ బొడకట్టెడిని, ఇందునుగూర్చి, కొన్నిపుటలలో ముందు" బందరు'' అనుశీర్షికగలచోఁ జదువఁదగు.

ప్రాక్కంఠంతాఽతిఘోరం సమర మమరదృక్షోషదాయి ప్రవీణాః
క్షోణీయం శూన్యరూపా జని తదను మహాభారతానాం క్షయోఽభూత్.

చంద్రకళంకము.

శ్లో॥ నాఽకాశోఽయ మపారవారిధి రిమా నో తారకా బుద్బుదా
శ్చంద్రో నాఽయ మనంతశేషఫణిరాడ్దేహ స్తదంతర్గతః
య శ్చైతే కిల తత్ర నీలజలదాకార స్తదంకో హరి
స్సోఽయం సాంద్రితరేణుకాంతివిసరః పాథోధివీచీచయః

(రైలుస్టేషనువద్దఁ బ్రయాణసమయమునఁ జెప్పినవి.)

మ॥ నరసీజాలయ నీయెడ న్నిలువ నిచ్చల్ భావనారాయణ
స్థిరకారుణ్యరసాతిరేకమున వృద్ధిం జెందుచున్ మమ్ములన్
స్మరియింపంగదవమ్మ చూపఁగదవమ్మా? నీదయాపూరసం
భరితాంతఃకరణప్రచార మెపుడున్ మాపట్ల బాపట్లరో.

మ॥ చిరసౌభాగ్యము కల్గిప్రాగుదధివీచీమాలికాడోలికా
చరవాతార్భకసేవ్యమాననిజవత్సం బైన బాపట్లపూ
రరుణాంభోజదళాక్షి! మాకు నెలవిమ్మా? ప్రోవుమా? నెల్లవ
త్సరముల్ తిర్పతివేంకటేశ్వరనిభాతంబున్ జయస్తంభమున్. తి॥ వే॥

ఇతరస్థలవధానాంతమునఁ జెప్పినపద్యములలోఁ గొన్ని

ఉ॥ నిన్నటికంటె నేఁడు మఱి నేఁటికి మించియు రేపు సత్కవి
త్వోన్నతి మీఱుమీకవనముల్ బుధకోటికి నింపునింపు నో
సన్నుతకీర్తులార? విలసద్భవదద్భుత సత్కవిత్వ మున్
గ్రొన్ననబోణి నిర్జరతఁ గోమలతన్ దనరారు నిచ్చలున్.

ఉ॥ క్రొత్తమెఱుంగులన్ విబుధకోటి నుతింపఁగ నాఁడునాఁటికి న్
త్యుత్తమ మౌచు మీకవన మొప్పెనలా రెడు కారణంబునన్
"క్రొత్తొకవింత ప్రాఁతయొకరోఁత,, యనులోకులపల్కు బాసియున్
రిత్తలటంచుఁ బల్కె విపరీత మదేటి కగున్ వచింపరే॥

ఇట్లు,
కురుగంటి శ్రీరామశాస్త్రి.
9-10-11.

శ్లో॥ శ్రీమత్పరమేశ్వరవచోద్భిక్కృతావతారా, విద్వత్కవిస్తుతసమస్తగుణప్రపూరా
భా త్యప్రయుక్తముఖదోషగణాతిదూరా, శ్రీ శ్రీశ వేంకటవీట్కవితాసుధారా

సీ॥ అన్నా! తెల్గులసొంపు తెన్నఁ దిక్కన్న తిక్కన్న యంచపకీర్తి నందకున్నె
అన్నా! యల్లికసొంపు గన్నఁ బెద్దన్న పెద్దన్న యంచొక దూఱు నందకున్నె
అన్నా! ఘంఘనము గస్గున్న లింగన్న లింగన్న యంచెగతాళి నందకున్నె
అన్నా! ముద్దులపలుకు తెన్నఁ దిమ్మన్న తిమ్మన్న యంచొక నింద నందకున్నె
తే॥ గీ॥ వీరికవితామహాసుధావారిరాశి, ననుచు జనులెల్ల వేనోళ్ల వినుతి సేయ
జగతి యశమును నింపిన సరసకవులు, ధరణిఁ దిరుపతి వేంకటేశ్వరులు గారె.



గీ॥ ఆ పట మతికొన్ని నాళ్లుండియనఘులైన, వారలొనరించు విందులవలనఁ దనిసి
నెలవు పూర్తి చెందుటయు నాసీమ విడిచి, యెవరి యిండ్లకు వారేగి యొసక మెసఁగ.
గీ॥ ఉండుతఱిఁ గొప్పరపువారి నొమదలఁచి, భంగపడిన బంధుగులు *దర్బారటంచు
పత్రికను కందుకొనదలిచి పాడు నుడులు, గిలుకఁ దొడఁగిరి తమ తెల్వి చులుకవడఁగ

మత్తకోకిల॥ మంగళం జయమంగళం శుభమంగళం జగదీశ్వరీ?
మంగళం నినుఁ గొల్చు మాకును మమ్ముఁ దిట్టెడి వాండ్రకున్
దొంగవ్రాఁతలు వ్రాయువాండ్రకు తూహలమ్మునకున్ సదా
మంగళం జయమంగళం శుభమంగళం జగదంబికా. ౨౧౫

మత్త॥ "పోచిరా,, జోకరుండు బూతులబుంగ సారెకు విప్పెడున్
"పేచిరా,, జోకరుండు ప్రేలుడుఁ బెట్టె బైటికిఁ బెట్టెడున్
"ఓచిరా,, జోకరుండు చెన్నఁటిచీకుఁ గైతము గోఁకెడున్
కాని కొప్రపువారి నెట్టులొ గట్టు నెక్కఁగఁ జేయఁగన్. ౨౧౬
మత్త॥ "త్రోసిరాజులు,, కొండ యొక్కఁడ మూలనాడుచు నుండఁగా
"వేసి రాజులు,, కొండ యొక్కఁడఁ వెక్కిరింప వలరింపఁగా
"ట్రసి రాజులు,, కొండ యొక్కఁడఁ దిట్లు బిట్టుగఁ దిట్టఁగా
వాసి కెక్కె వదరంగ మూపయి వైరు లాడి రథీరులై ౨౧౭

* ఈ దర్బారును గూర్చి పూర్వరంగమునఁ గొండొక చూపఁబడియె, ఇది యింతుక పాఁతయవంటిది దీని ప్రలాపనము చూచి తీరవలయును.

మత్త॥ "పోతురాజులు" విఱ్ఱవీఁగుచుఁ, "బోకిరీ"లనుడు లాడఁగన్
"బూతురాజులు" మేరదప్పుచు బూతు లేకరు వెట్టఁగన్
"ఓతురాజులు" "మేపుమే" యని హుంకరింపులు నింపఁగన్
గోతు *రక్కటని కోఁత లెన్నియొ కొవ్విపుంగవు లాపయిన్. ౨౧౮

మత్త॥ బండలాక్కొడఁ బందలాక్కొడ బారు బారులు నూఱఁగన్
మొండివ్రాఁతలవారు సారెకు మ్రోఁత లేమియొ మ్రోఁగఁగన్
పిండి లేకయె రొట్టెఁ గాల్చుచు బింకముల్ తెగ బొంకుచున్
దండుబల్మిని గొప్పరంబు వృథా ప్రగల్భము లాడెడిన్. ౨౧౯

తరల॥ తెలివి తక్కువ యీసు రోసము తెల్లమోమును వ్రాఁతయే
తెలుపనంచు నెఱుంగ కూరక తెల్లవాఱిన దాదిగాఁ
బలుగువ్రాఁతలు మమ్ముఁ గూరిచి బండ్లఁ దోలుచు దాసిచే
గెలుపు కొప్రపువారికీ గమకించి రాప్తులు కొల్లగన్. ౨౨౦

(*ఫిబ్రేవరి 10వ తేది1912 సం॥ దర్బారునుండి.)

4-9-1911 తేదీన, మాకును దిరుపతి వేంకటేశ్వరులకును వైషమ్యములు వలదని యుద్దేశించి తదనుగుణమయిన పత్రికనంపి అందు సంతకములుచేసిన ప్రతినిధులకు వినయపూర్వకముగా నమస్కారములొనర్చి చేసిన విన్నపము....
సీ॥ ...గీ॥ చేసిన ప్రతిజ్ఞఁదప్పుచు చెప్పమితర, మార్పుఁడీ సంశయం బొనఁగూర్చుఁ డిట్టి సభఁ,బంపుఁడీవార్త దిశలకునింపునింపుఁ, డో సరసులార గుంటూర్నివాసులార!
గీ॥ పత్రికలఁ దెల్పికొనినకై ప్రతినలెల్ల, వీఁక నిగ్గించుకొందు మేలోకమందె, యింత కేమాఁడులో కాలకేగనేల? వేగ సభఁ గూర్చుఁ డోజగద్విదితులార!,

ఇట్లు

కొప్పరపు సోదరకవులు, శతావధానులు

☞ ఈసాటి కోఁతలు వీరు సంధిపత్రమందుకొనిన 5మాసములకుఁ బిమ్మటివని యెఱుఁగుఁడు. సారమరయుఁడు, తి॥ వెం॥

మత్త॥ మంగళం బగు నాశుఘోష సమాఖ్యకుఁ గరపుచ్ఛమున్
గంగ నీఁదఁగ నూఁతగాఁ గొను కాకవిద్విజపాళికిన్
మంగళంబు నిజం బెఱింగియు మాయశమ్మును మార్పఁగా
వెంగలుల్ పొనరించునాయవివేకపుం జెడుగోలకున్. ౨౨౧

సీ॥ ఎండగండినిఁ బట్టి యెండుగండి, యటంచు వ్రాయఁ జొచ్చిరి వృథా వాగ్వ్యయముగ
తమపాటిపోక లోకమెఱుంగుటయెఱింగియు నుమ్ముఁ బొఱిరంచనఁ దొడఁగిరి
స్పృహపుగా నేదేని మేము వ్రాయఁగ దుందుడుకు మీఱి తందనాలకుఁ గడంగి
“రవధానమును జేయక వధాను లెటులైరి,, రన నెక్కసక్కెమ్ము లాడఁదొడఁగి
గీ॥ రకటపిలోకమ్ము గుడ్డిదియంచు నెంచి, కించిచెలరేఁగి మమ్ము దూషించఁ దొడఁగి
రేమి చెప్పఁగ వచ్చు నిక్కామరోష, రూషితములు కౌప్రపువారిభాషితములు.

క॥ ఇది యిదిలుండెను వాదా, స్పదమగు నల“ పశ్య ” యనెడిశబ్దమ్మునకై
వదరులు వదరుచుఁ బ్రకటిం, పఁ దొడఁగి రొక కొంతమంది పత్రికలంతన్
క॥ ‘కాశిక’ యనుపే రెఱుఁగని, ధీశూన్యులు గూడ దాని దెగఁదిట్టుచు శా
ఖ్యాశౌర్యప్రాగ్భరా, వేశమ్మునఁ దఱుచుఁ దాండవించిరి జననీ ౨౨౪

గీ॥ రామరావు వ్రాసెడిదనఁ గ వ్రాయరాద, యుత్తరంబని మిన్నక యుంటి మేము
పట్టు వ్రాయ నేమగునొకో యీవివాద, మను చునాతఁడు పత్రికఁ జంపఁడయ్యె.
గీ॥ అపుడు హాయమ్ము దోఁచక యతని పేరు, గూడఁ జేర్చి శిష్యుఁడు వ్రాయు కొంటె* వ్రాఁత
చూచి యాయన స్వైరణఁ దోఁచిపుచ్చ, రాక యాతని బుద్ధిదీర్పఁగఁ దలంచి.

---

శ్రీ

శ్రీహయగ్రీవాయ నమః.

*బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులకు.

అయ్యా,

మీరు నరసారావుపేటలో యీ సంవత్సరము అక్టోబరు 1, 2 తారీఖుల శతావధానమను పేరుచే 40 మందికి సభఁ జేయునపుడొక పృచ్ఛకుఁడు “పశ్య పశ్యాన వశ్యతః” అను సమస్యనిచ్చి పూరింపుఁడనఁగా నా సమస్య తప్పని చెప్పి, పృచ్ఛకుఁ “డిది పండితులొప్పికొనినదియే తప్పుగా” దనిపలుకఁగా ‘ఎవడా పండితుఁడు

తే॥గీ॥ కాశికా వృత్తిలోనున్న గ్రంథమల్ల, రామరావున కెఱుగంగ రానిదనుచు
నతఁడువ్రాయించు వ్రాఁతలకతన నెఱిఁగి, దానిచే మానుడినినిల్పఁదలఁచి మఱియు

క॥ *కలహమునకుఁ బూర్వమ్మోక, యలఘుఁడుతచ్ఛిష్యుఁ డెలమినంపెను దోష
మ్ములగని యగు రామకవీ, ట్తిలకుని కావ్యమ్ము దాని దెలిచితి మంతట.

ఉత్త॥ ప్రాజ్ఞుఁడయ్యును రామరాట్కవి భావియోగవశమ్మునన్
విజ్ఞులెల్లరు నవ్వఁ గైతను వ్రేళ్లఁ బెట్టెను దానిలో
నజ్ఞులత్తఱిఁ జేయునల్లరి కాతఁ డూఁతముగా వుటన్
దజ్ఞుఁడంచు నెఱిఁగి యుండియుఁ దప్పు లేరితి మంచికా. ౨౨

---

పండితుఁడైన నిట్టితప్పుసమస్య నేల నొప్పుకొను'నని పండితదూషణ చేసిరి రా. అందుపైఁ గొందఱు పండితులీ సమస్య తప్పుగాదని, మేము సమర్థింపఁగలమనియు మీరు తప్పని సమర్థింపఁగలరేని సభకు రావలసినదనియు మీరుతప్పని ధ్రువపఱిచి న యెడల మేమునూటపదారు లిచ్చెదమనియు ధ్రువపఱచలేనియెడల మీరు నూటపదాఱు లిచ్చిపోవలయు''నని యుత్తరము వ్రాసిపంపఁగా బ్రహ్మశ్రీ ప్రత్యుత్తరమీయక నరసారావుపేటనుండి గుంటూరునకు వెళ్లిరి ఇంతవఱకుఁ దగిన ప్రత్యుత్తరమిచ్చినవారుకారు. కావున నిప్పటికైనన్నవచనపోషణ సామర్థ్యమున్న యెడల పట్టియుక్తులుపన్ని కాలము వ్యర్థపుచ్చక తప్పని నిశ్చయపరచుట కొప్పుకొని తెలియపరచిన తత్క్షణమే పండితసభఁజేయించుటకును, ఆసమస్య తప్పు కాదని సమర్థించుటకునుఁ గృతనిశ్చయుఁడనై యున్నాఁడను. (యిందులకతి శీఘ్రముగనుఁ బ్రత్యుత్తరం బొసంగనిచో మీరోడినట్లే తలంపబడుదురు.)

బ్రహ్మశ్రీ బెల్లంకొండ రామారాయ కవీంద్రుల శిష్యుఁడగు
1-11-11: ములుకట్ల లక్ష్మీనారాయణశాస్త్రి.

☞ కుండలితమగు వాక్యము ప్రేషకునిస్వహస్తలిఖితము తక్కినదిఅచ్చు

---

*మహారాజశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి శతావధానిగారికి యిచ్చేది
రవాణా, బందరు, భైరవపత్నిస్సు. 27-6-11 బండారుపల్లి.
నమస్కారములు.

తమక్షేమం యీమధ్య తెలియలేదు, గీరతముయెప్పుడుబయలువెడలునది తెలియలేదు, ప్రస్తుతం మా గురువుగారు బెల్లంకొండ రామారావుచేసిన కృష్ణలీలాంత

మత్త॥ *తప్పు లయ్యెవి బ్రహ్మకేనియు దాఁట రానివి యాటచేఁ
"బప్పులోసడు" గన్న సామెతఁ బట్టిపోఁదలంపు లౌ
చొప్పు చొప్పడెఁ దక్క-వారలు శుద్ధశుంఠలు సారెకున్
ఛిప్పితమ్ము పేరిబెడ్డలు వేయఁ జొచ్చిరి మాపయిన్. ౨౩౦

మత్త॥ "రామరా వెటులేని బైకిఁక రాఁగలేఁ"డని కొవ్విపుం
గొము కైసరులంతటన్ దమ గుంపు గూడిరి మెల్లఁగన్
సాము సేయఁ దొడంగి రెందు న సత్యమే యొకవిద్దెగన్
వాము మార్గముఁ బట్టి సారెకు వాగ్వ్యయ మ్మొనరించుచున్. ౨౩౧

---

రంగిణిని మీవద్దకంపినాను. దానిని తాము చిత్తగించి గుణదోషములను వెల్లడింతురుగాక; నాశరీరము కొంచము నెమ్మదిగా నున్నది. ఇంకా పదిరోజులకు వారు చేసిన రుక్మిణీపరిణయ చంపూప్రబంధమును పంపఁగలను. శీఘ్రగా పరిశీలింతురుగాక.

(మక్కికిమక్కినకలు)

జూపూడి.హనుమచ్ఛాస్త్రి.

---

(*శ్రీరామారావుగారి కృష్ణలీలాతరంగిణి నుండి)

(1) శ్లో॥ ...స నందతనయః కరపంకజేన పస్పర్శ శి+ మ్...,,
(2) శ్లో॥ మయి మాతృణాయ సదనా ద్బహి ర్గతే,,
(3) శ్లో॥ నవనీతచోర తవ శి+మాహరామి ... మమ శి+చుంబనమిదం...,,
(4) శ్లో॥ సుభగే త్వదీయ మయి శోభనంభ+ం మమ దర్శయ ...,,
(5) శ్లో॥ అధిరుహ్య సైష శయనం శయానమ,త్తనయాశుచ్తౌ నిహితవాన్నిజంపదం
(6) శ్లో॥ మమ బాలికాభ+ బిలేతవాత్మజో నిధధే కరాంబురుహ మధ్యమాంగుళిం
(7) శ్లో॥ ...అత్మమాతృవివృతా ననాన్తరే సమమూత్రయత్,,
(8) శ్లో॥ ...ఇతి బాలికాంగ మఖిలం విశాఽఽత్మనః పరిలిప్తవాన్...

దిఙ్మాత్ర ముదాహరించితిమి ఇట్టివెన్నో కలవని యెఱుఁగునది ఇందునుగూర్చిన విచారణమునకు 'శలభాలభనము' చూడఁదగు 'పరిమాదోధీనుతాముపీత్యత్ర అపిశబ్ద ఏవకారార్థకః, అతోనరామరాయ స్యైతావతా కించిదపి న్యూనతా సతు సర్వథా సమర్థ ఇతి శివమ్,

మత్త॥ రామరాయని కైతలోని దురర్థమున్ విరసప్రయో
గామయమ్మది త్రిప్పరానిది యౌట మిన్నకయుండి వి
ద్యామహేంద్రులు "పశ్య" శబ్దముపైని సారెకుఁ గొండ్రె తే
మేమె వ్రాసిరిగాని నీదయ నేమె కొంటిమి గెల్పులన్.

## గెల్పులు.

☞ వ్యా:— 'పశ్య' అనుశబ్దము తప్పనియు, ఉపసర్గపూర్వక 'పశ్య' శబ్దము సాధు వనియు, కాశికావృత్తిమతము, రెండును సాధువు లని కౌముదీమతము, మొదటిది ప్రాచీనమతము, రెండవది నవీనమతము, మొదటిదే మంచి దని మేము, రెండవదియే మంచి దని మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రులవారు లోనగు కొందఱుపండితులు, ఇందును గూర్చి పత్రికావాద మొక సంవత్సరన్నరవఱకు జరిగినది, కాని యీక్షణమువఱకు మావాదమే నిల్చియున్నది. ఇందుఁ గౌముదీమతానుసారముగా వాదించినవారు (1) మంత్రవాది సూర్యనారాయణశాస్త్రులవారు, (2) తాతా సుబ్బరాయశాస్త్రులవారు, (3) [illegible] రామశాస్త్రులవారు, ఇందు, తుట్టతుదివారు బెల్లంకొండ రామారావుగారి గురుపుత్రులు, వీరు కడు శీఘ్రముగా నోడిపోయి రని చెప్ప వలసివచ్చినందులకుఁ జింతిల్లుచున్నారము, మొదటివారు తమశిష్యుపేరితోఁ బత్రికలు ప్రకటించినవారు వీరు శ్రీరాయఁడుశాస్త్రులవారిశిష్యులగు జయంతి భగీరథశాస్త్రులవారిచే నోడఁగొట్టఁబడిరి, ఆయీవిద్వాంసులు వివాదమునకు దిగుటకుఁ గారణము మొట్టమొదట నేను ప్రకటించిన 'పశ్యాం పశ్యాం' అనుచిన్నిపొత్తము, వీరిలో వీ రిట్లు ఖండనమండనము లొనర్చుకొనుచుండఁగా మున్నుదాహరించిన మహామహోపాధ్యాయులవారు తటస్థులుగా నొకతీర్పును దీర్చి ప్రకటించిరి, దానిపై జయంతి భగీరథశాస్త్రులవారు వ్రాయవలసినవిధియున్నను సర్వాపవాదక మగు గురుశిష్యన్యాయమును దానికి బాధక మయినది, అంతలో శ్రీరామారావుగారు తమవాదము గెలిచిన దను సంతోషముతో నిట్లొకరిపేరఁ బ్రకటింపించిరి.

(నవంబరు 1వ తేదీ 1912 సం॥ దర్బారునుండి.)

## పశ్యాపశ్యానపశ్యతః.

1 పాఘ్రేతి సూత్రములో పైసూత్రమునుంచి ఉపసర్గపదమును కాశికాకారుడు అను వృత్తి చేసినాడు గాన పశ్యశబ్దము సాధువు, కౌముదీకారుఁడు అను వృ

త్తి చేయక పోయినందున పశ్యశబ్దము సాధువు అని కొందరందురు గాని ఆదిసరి కాదు- కౌముదీకారునికంటె కాశికాకారుడు ప్రాచీనుడు గాన ప్రాచీనమతమే సాధువు అని "పశ్యాం పుశ్యాం" గ్రంథకారుడు వ్రాసినారు. 2 దీనిని ఖండించి మంత్రివాది సూర్యనారాయణశాస్త్రిగారి శిష్యులు నల్లాన్ చక్రవర్తి వెంకటాచార్యులవారు జ్ఞానాదిగుణములచే నధికుడు గాన కౌముదీకారుడు చేసిన అననువృత్తియే బాగున్నది అందువల్ల వైదిక ప్రయోగములు మహాకవిప్రయోగములు కుదురుచున్నవని వ్రాసినారు. 3 ఇందుమీద మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారి శిష్యులయిన జయంతి భగీరథశాస్త్రిగారు జ్ఞానాదిగుణములచే కాశికాకారుడు తక్కువవాడు కాడు. ప్రాచీనుడు గాన నీతని మతమే గ్రాహ్యమని వ్రాసినారు. 4 దీనిని ఖండించి వెంకటాచార్యులుగారు, కాశికాకారుడు ఉపసర్గపదమును కొందరనువృత్తి చేయరని వ్రాసినందున కౌముదీకార మతము కాశికాకార మతముకంటె ప్రాచీనమయినది. కాన అదే గ్రాహ్యమని వ్రాసినారు. 5 విజయనగర మహారాజ సంస్కృత కళాశాలా ప్రధానోపాధ్యాయులును మహామహోపాధ్యాయులునగు తాతా సుబ్బారాయశాస్త్రిగారు ఉపసర్గపదమును అనువృత్తి చేసిన అన్నంభట్టాదులే పశ్యశబ్దసాధుత్వము నంగీకరించిరి. కాతన్త్ర వృత్తికర్తయగు దుర్గసింహుడు కూడ పశ్య శబ్దము సాధువని వ్రాసినాడు. సారస్వత వ్యాకరణమునందు కూడ అనువృత్తి లేదు- గాన పశ్యశబ్దము సాధువే నని వ్రాసినారు. 6 (వాక్యార్థచన్ద్రికా వ్యాకరణగ్రన్థకర్తలగు బ్రహ్మశ్రీ) భాగవతుల హరిశాస్త్రిగారి శిష్యులగు పురిఘళ్ల రామశాస్త్రిగారు సూత్రభాష్యకైయటములయందు పశ్యశబ్దము ప్రయోగింపఁబడి యున్నది గాన కాశికాకారమతము తద్విరుద్ధమైనదని వ్రాసినారు. 7 ఇవి యన్నియు అచ్చుపడియున్నవి. ఇక 'పశ్యాంపుశ్యాం' గ్రంథకారులకు నిత్యపక్షపాతుల స్వపక్షపాతమే గతిగా కనబడుచున్నది.

[illegible]నాడు. హితవాది.

పైప్రకటనము శ్రీరామారావుగారు వ్యాకరణవిషయమునఁ బరప్రత్యయనేయబుద్ధులని చెప్పక చెప్పఁగలదు, అదియటులుండె. ఈహితవాది నామధారి కడువృద్ధు, శాస్త్రాభిమానమును బురస్కరించికొని మమ్ముఁ బరోక్షమున దుర్భాషలాడుటలోఁ దప్ప నన్యత్రి యితఁడు మంచిచెడ్డల నెఱిఁ

దిట్టిన వారినోటికంపుబయలువడునే కాని వాదము నెగ్గదు- సమస్యాపూర్తిం గూర్చి చెప్పదంటుశంకలను బ్రకటించితిరిగదా; అందు సిద్ధబిద్ధాదులచే బ్రాలుచేయించితిరేమి? నానావిధముల మమ్ముఁ దిట్టియు వేఱొకరిని బొగడియు నెవరికి 'బ్రహ్మపట్టము, గట్టి సుంకించుచున్నారో వారివ్రాలే యందుఁ దగిలింపుఁడు- పస తెలియఁగలదు- ఏకకాలమునందు సర్వజగద్దర్శనయోగ్యత లేక పోవచ్చునుగాని పర్యాయముగా నేల యుండఁగూడదు- మఱియు 'యః' అన్నచో 'జడపదార్థః' అనిరాఁగూడదని యేపండితుఁడును బలుకఁడు- 'పండితాయతే,లుపలుకుట వింత కాదు "సర్వనామ్నాం బుద్ధిస్థత్వోపలక్షితధర్మావచ్ఛిన్నే శక్తిః" ఇది నిష్కృష్టసిద్ధాన్తము- గత్యంతరమేదియును లేక వృథాగ బూతులు తిట్టుమీకీమాత్రమేని వ్రాయుట యనవసరమే- అంతేవాసులలోఁగూడ మీకుఁ దుల్యముగాఁ దిట్టువారు మాకుఁ జేకూఱమి నింతటితో నిప్పటికి విరమించితిమి. "మూర్ఖం ఛందానురోధేన"

ఇట్లు,

తిరుపతి వెంకటేశ్వరులు.

మత్త॥ ఆంత దనర్చు సూవ్రితాపమహత్త్వమే యలరారుతన్
జింత నొందుచుఁ దిట్టి పోయుచుఁ జేతిగాజుల మ్రోఁతతో
గొంతు బొంగురు వోవ రోఁజుచు గోఁకి కొంచు శిరమ్ములన్
మంతనమ్మునఁ గుట్రఁ జేయుచు మూర్ఖు రంతుత మంబికా. ౨౮౦

మత్త॥ "చాల దీయవతార మింకను జాలలోపము లుంట చేఁ
జాలువాఁ డుదయింపఁ గావలెఁ జాల నందులకై తపం
బోలిఁ జేయుఁడుఁ మీరలెల్లరు నూఁగకే యిటు మ్రోఁగుటల్
శీలవంతులు మెచ్చ,,రంచును జెప్ప మంబరొ వారికిన్. ౨౮౧

తరల॥ పరశురాముఁడు రాజవంశముపైన వా రొనరించె నీ
పరశురాము లటుల్ పొనర్పమి ప్రాజ్ఞులెల్ల నెఱుంగరే
ఉరక తిట్టుట కట్టువ్రాయుచు నుంట నింతవచింపఁగాఁ
దఱి ఘటిల్లెను యుక్తి చెప్పమి తప్పు సత్కవి కంబికా. ౨౮౨

చ॥ కపితము గట్టు చుట్టములు 'గాడిద' లెద్దులు, మొద్దు, లంచు న
చ్చపుఁదమ తెల్వి యంతయును శాశ్వతమై రవిచంద్రమోనభః

కుపదవు లుండునంతవఱకున్ వెలుఁగన్ గిలుకొంగఁ జొచ్చిరీ.
కుపితులు గోఁకు పద్దెములకున్ దరి యంచును గాన మంబికా ౨౮౩

తే॥ గీ॥ అన్నితిట్లకు నాఁటి సహనమున, కేము మోమోడమనుటయే హేతు వంబ!
వారిమోముఁజూచినయంత వారిలోఁతు, స్వాంతమున కెక్కు కతన నాసనము నీము.

చ॥ ఇతరు లెఱుంగు రెట్టు లెవఁ డేవని సేయును దానిగుట్టు తా
నతఁడె యెఱుంగుఁగాక భుజగాంఘ్రుల పద్ధతి నేఁ డెఱుంగు, నూ
ర్జితుఁడు మఱొక్రచో నయినఁ జేసెడిదేమి మఱొక్రపట్లు? నే
చతురుఁడు వీరి మెచ్చినను సత్సభ* స్వాంతము దాఁచియే సుమీ. ౨౮౪

---

| పోష్టుముద్ర | 4 సెప్టెంబరు 1911<br>ఎగ్మూరు. | లైబ్రరీ<br>సోమవారం |
|---|---|---|

*... ఈవివాదమునుగూర్చికొంతవ్రాఁత చూచిన నాటిరాత్రి 27 తేది... మీకాగితములు వచ్చినవి, ఈస్థితిలోనున్న నాకు ఒడలు పులకలెత్తెను, మహోత్సాహానందములు కల్గెను, నేనుకూడ ఇప్పుడు గుంటూరు రావీలుండిన బాగుండును ...నౌకరీవీలులేదు, .. కొప్పరపుంగవులు ఇక్రడనవధానములు చేయుటలో అష్టావధానము పేరేగాని, లక్షణమింతేనియు లేదు, సమస్యలు ముందు చెప్పించుకొనుట...వ్యస్తాక్షరి లేదు... ఒకవేళ వివాదసభలు జరుగునేని ... అష్టావధానము ప్రధానముగా ముందుపరీక్షింపవలసినది, అందు వ్యస్తాక్షరిముఖ్యతమము, వారిఆశుధార గొప్పదేగాని ... వేలకొలదిపర్యాయములుతిరుగుచున్న మామూలుచక్రమే గాని క్రొత్తరీతిని దిరుగదు. ఈయూరనిచ్చిన కథ వారు చెప్పనేలేదు ఇతరం వారిబాటను కొట్టిపోసిరి. వారి బాట తప్పించి (సంభవించెనేని) ఆశుకవిత చెప్పింపవలెను. మాలో శివరామశాస్త్రి కృతార్థతముఁడు, నాయానందమతనికిఁ దెల్పుఁడు. మీరా వారితోఁ దులగా వాదింప నేనిచ్ఛగింపను. గెల్చినవచ్చెడు ప్రతిష్ఠయెంత? ఇఁక నీవాదము లేల? మీరువదలుటయే నాకోరిక. శివరామశాస్త్రియు వలదు, వారెట్టి పాండితికలవారని;...నాటి వివాద స్వరూపము, బీజమూ, ఎట్టివి? ఆయూరనిరువాగులను బ్రిథాను లెవరు. యావదంశము మీకు వ్యవధిలేకున్నను మనకుఁ బరమమిత్రులగు బ్రిష్టాశ్రీ... గారిచేనయిన వ్రాయింపుడు... ఇంకను అచ్చులోను న్నరి కార్డు(వూ)ఘులయినను వెంటనే పంపుదురుగాక. వే. ప్ర.

ఉ॥ వచ్చెడి పండితుండెవఁడు? వచ్చినవచ్చుత వచ్చి సత్సభన్
మెచ్చెడి పండితుండెవఁడు? మే మఖిలంబు నెఱింగినార మీ
పిచ్చికవిత్వ మూఁతగొని పీఁకెదరంటు? దఢాల్న మీన మీ
సచ్చరితుల్, వృథానుడులు సైఁచెదరంటి? స్వపక్షులంబికా. ౨౮౬

చ॥ ఎఱుఁగని యప్డు "వీరు కవులే" యని యొప్పినతప్పు సైఁపు మి
ట్టెఱిఁగితి మాస్యముం దెఱచుచేతడ వంతయు స్పష్టమయ్యె; నీ
శ్వరుఁ డొకసాక్షి వీ ర్చుదువు పద్దెములం దపు డెన్ని వీరు గూ
ర్తురొ మును పల్లి యెన్నియట దూర్తురొ యంబిక? నీవెఱుంగవే. ౨౮౭

ఉ॥ పత్రికవారి ఘోషయును బామరతన్ మొగమోడి మెచ్చు మా
మిత్రులఘోషయున్, దెలిసి మేలు ఘటింపఁగ నెంచి మెచ్చు మా
ఛాత్రుని ఘోషయున్, గని ప్రశంస యొనర్చుచు నాఁడు యోగ్యతా
పత్రిక సంపుతప్పిదము పండితమండలి సైఁపఁగాఁదగున్. ౨౮౮

ఆ॥ వె॥ శక్తి లేక పూను 'సర్టిఫికట్టు' లా,యువు లవమ్ము లేకయును దమంతఁ
బెండ్లివేళ నిచ్చు పెద్దలదీవనల్, పొందినార మనుచుఁ బొంగిపడుట.

క॥ అవసర మైనకతమ్మున, వివరించితి మంబ? ఘోషవితమెల్లను నీ ౨౮౯
సవిధమున నెఱిఁగి యనృతము, దవిలించితిమేని నీవ దండింపఁదగున్.

శా॥ ఖండింపంగలశక్తి యున్నయెడఁ గాకవ్యగ్రిణీవ్యగ్రితా
ఖండాఖండకృతివారకం బయిన యీకబ్బంబు నేరేనియున్
ఖండింతుర్గద, సోదరుల్ వృథగ వాక్రుండూతి వోఁ గొట్టుకో
"నెండుంగండి, గ నేమి దూఱుదురు మా కే మంతలోఁ బోయెడిన్. ౨౯౧

గీ॥ వారు దూఱినకొలఁది నవారిగాఁగ, మాయశము లోకమునఁ బర్వుపూఁకుఁ గీర్తి
కన్న నన్యలాభమ్ముల నెన్నపూని, లేదు ప్రకృతశేషమ్ము నాలింపు జనని.

ఉ॥ అంతట నయ్యె వేమవరమం దవధానము వైరు లెంతయున్
జింతలచేఁ గృశించి పరిశీలన చాలక సారెఁ దప్పుదుం
బుంతలవెంబడిం బడి ప్రభూతనయుల్ 'కదు' రోయ 'దూయమా
నాంతరులై మ' ఱేదియు నుపాయము గానక కుందు వొందఁగన్. ౨౯౨

సీ॥ తలుపోరగామూసి వెలవెల్లమోముతో నొక్క "శశ్ఫోటి" మాదిక్కు చూచు
తనయింటి యెదుటి కందలము రావేగవే యొక్క "శశ్ఫోటి", తలూపిచి వైచు
"పశ్య" వాదంబు 'స్వప్నఘముల్లై' 'యయ్యో' నంచొక్క "శశ్ఫోటి" సిరోద్బ్వఁగనుల
"కాశిక" నటుపాముగఁ జెంగా 'హు'ష్ణంచునొక్క "శశ్ఫోటి" వండ్లురకకొఱుకు

గీ॥ కాశికనుజూపి "సూఁటార్లు" గతుక్క మనుచుః, గోష్టి కీడ్తురో యేమొ నాకొంపదీసి
యంచునొక్క "శశ్ఫోటి" లో నటమటించు, నరసరాట్పురి త్రోవమేమరుగుతఁజేని

ఉ॥ "పాఁటిరి కృష్ణదాఁటి" యని వాగ్వ్యయము న్మనసారెఁజేయునా
కారణ మంతరంగము నగల్పఁగ వేమవరమ్ము పే మెటుల్
చేర భయమ్ముఁ గొందు మటు చేకుఱఁ జెక్కఁటిసేఁత లెన్నిరో
కూరిచి వ్యర్థులై చెడిరి కొప్పరపుంగవిపక్షు లత్తఱిన్. ౨౪౩

చ॥ సకలము నీమనం బెఱుఁగు సత్యవిదుల్ పలుమం దెఱుంగుదు
ర్విక రము దేల్చి పూర్వమె మనీషిహితమ్ముగ ముద్రితంబునన్
బ్రకటితముం బొనర్చి నప్రబంధ మెఱుంగును గాన దానిఁ బ్ర
వ్వకయటఁ జూచికొం డనుచుఁ బ్రాజ్ఞులకున్ వచియింతు మంబికా ౨౪౪

గీ॥ అంబ ని యంతకు మునుచేసినట్టి చెట్ట, సేఁత లొకతల వేమవరాతతాగ్రి
హారసత్సభాప్రత్యూహ మలవరింపఁ, బడ్డపాటు ల్లింకొకతల పవశమని. ౨౪౫

ఉ॥ తప్పుదు త్రోవలన్నియును దజ్జులు దగ్ధము సేయ నంతతోఁ
గొప్పర మూరకుండక ప్రకోపము చెంది* "రిజస్టరుత్తరం

---

* ఆశుకవి చక్రవర్తి, శతావధాని, కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ. కొప్పరము- సంతమాగులూరుపోస్టు, గుంటూరుజిల్లా నొద్దినుండి. } (రిజస్టరుత్తరపు నకలు) బ్రహ్మశ్రీ తిరుపతివేంకటకవులకు కాకినాడ, & బందరు.

అయ్యా, మీరుప్రకటించిన 'గుంటూరుసీమ, పూర్వరంగము', అను పొత్తను జూచితిని, అయ్యది 'సీ॥మాయమాటలకు నమ్మకమైన వ్యాఖ్యాత తులలేని పచ్చి బూతులకు బుంగ. అను మీశ్రవణానందమునందలి మొదసలిభోగముదాని పద్దెమునకుదాహారణముగ నున్న దని చెప్పవలసివచ్చినందులకు జాలిపడుచున్నాఁడను. 'సత్యంవద' ధర్మంచర; అనువేదవాక్యములకు విరుద్ధముగా నసంబద్ధములై

ఇప్పుడు వందె: "గే"సాకటి యావలఁ దెత్తు నటంచు సత్యమున్
దప్పి చరించువారలకు ధర్మముతోఁ బని యేమి శాంకరీ. ౨౫౭

---

న సంస్కృతవాక్యములతో మమ్మును, మమ్ములనుబట్టి మానియోగిశాఖను, ఈవిధము గనిన్పవచ్చినవారెల్ల నిందించుటకై మీ కాలమును, మీపాండిత్యమును, వినియోగించి, ఇట్టి నికృష్టోద్యోగమునకు, మీమిత్రులంగూడ నియోగించి వారి చేఁగూడ, ఆ పత్రప్రకటనములం జేయించి, యకారణముగ మాహృదమున కాయాసమును గలిగించితిరి.

2. ఏడనో యున్నవా రున్నట్లుండక మదీయాశుకవిత్వావధానములను బద్యములతోఁ బ్రశంసించుచు ముందుగ మాకు లేఖ వ్రాసి మాస్నేహమును సంపాదించుకొని పిదప మాప్రతిభయు, మాకీర్తియు, మారాబడియుఁ జూచిసహింపలేక వృధాభిమానులగు మీశాఖవారిదుర్బోధములకుఁగూడ లోనై యనవసరముగ నానన చర్చ యొకటి గల్పించి యస్మత్కృతోపకృతి నేని స్మరింపక, కయ్యమునకుఁ గాలు దువ్వి మేము ప్రతిజ్ఞాపద్యములను వ్రాయవలసిన యవసరమును గల్పించి చివరకు సభకు రాక సాకులు పన్ని తప్పించుకొని బందరు కాకినాడలకు, వేంచేసితిరి.

3. అప్పటినుండియు విరామము లేనిమాయ వ్రాఁతలకుఁ బూనుకొని మారు పేరులతో మాయలేఖలం గొన్నిటిని బ్రకటించి స్వజనము చేఁగూడ నట్టివే కొన్నిటిని బ్రకటింపించి యంతతోఁగూడఁ దృప్తిలేక "హితోపదేశము" అను పేరునఁ గొన్ని యనుచితములు వ్రాసి ప్రచురించితిరి, అప్పడే మేము మీమీఁద గొంత చర్య జరిగింపవలసియున్నను, ఎన్నటికేని మీతప్పలను మీరు తెలిసికొని పశ్చాత్తాపమును బొంది క్షమార్పణమును బ్రకటింతు రను సదుద్దేశముతో గొంతహితమును గఱపనెంచి 'జ్ఞానోపదేశము' అను పేరునఁ గొన్నిపద్యములు వ్రాసితిమి. కాని మా'జ్ఞానోపదేశము' మీకడఁ జెవిటివానిముందు శంఖ మూదినట్లయిపోయినది.

4. తరువాత మీరు వికృతవ్యవహారమునకుఁ గారణభూతమైనట్టియు, నసత్యముల ప్రోవైనట్టియు, "గుంటూరుసీమ, పూర్వరంగము"ను, వ్రాసిప్రకటించితిరి, అందు మొదటినుండి చివరవఱకును మీరువ్రాసిన యసత్యాంశములను వ్రాయించుకొన్న యసత్యపు లేఖలను, నారాయణశాస్త్రిమూలకముగా ఖండించి లోకమున సత్యమును స్థాపించుటకై మేము ధర్మదేవతచేఁ బ్రోత్సాహపఱుపఁ బడుటచే

ఉ॥ ఇట్టి వృథాప్రజల్పకులు నిట్టివిచారవదసార్వభౌములై
నట్టి రపత్రపాధికరణాన్యహృదంతరులైన కొప్పరపుం

---

మిక్కిలి దారుణమైన యీక్రిందివిషయమును గూర్చి మాత్ర మిప్పుడు తెలియఁజే యుచుంటిమి.

5. మాకప్రతిష్ఠను గలిగింపవలెనను దురుద్దేశముతో "గుంటూరుసీమ, పూర్వరంగము 87వ పుటలో" "కొప్పరపువారితప్పువ్రాఁతలు" అనుశీర్షికక్రింద నొకకల్పిత (ఫోర్జరీ) లేఖను ప్రకటించి, అట్టిదానిని మేమెవ్వరికో వ్రాసినట్లును, దానిప్రతిమీకు లభింపఁగా, దానింబట్టి దీనిఁబ్రకటించినట్లును, నొకయసందర్భపుఁగథఁ గల్పించి యుదాహరించితిరి, ఈమిథ్యాయత్నాంత మాకప్రతిష్ఠను గలిగించునది మాత్రమే కాక, మాగౌరవమునకుఁగూడ భంగము గలిగించునదిగానున్నది. అందులకై తగు చర్యజరిగించుట మాకుఁగర్తవ్యము కావున మీకీలేఖయందినది మొదలు 24 గంటలలోపల నాలేఖను మేమెవరికి వ్రాసినట్లు తెలుపనెంచితిరో, ప్రతిమెవ్వరివలనల భించినట్లు తెలుపనూహించితిరో వారిపేరుల నెఱింగించుచు, అట్టిమాయలేఖను మీరే యేయాధారముమీఁదఁ బ్రకటించితిరో లిఖితపూర్వకముగా మాకుఁ దెలియఁజేయఁగో రుచున్నాఁడను, "అంతకింతైనది, ఇంతకెంతగునో" అనుసామెతకుఁ దారుణముగా మీవ్యవహారము పరిణమించుటంజేసి ముందుముందేమిసృష్టింతురో యనుభయముకూడ మమ్ముఁ జాలఁగా బాధించుచున్నందున నిట్టిచర్యలోనికి దిగ వలసివచ్చినందులకై విచారించుచున్నాఁడను.

ప్ర. రా :— ఈవిషయము మీరిదివఱకుఁ దేల్చికొనినదియే యగుటచే, మరల నాలోచింపవలసిన యవసరముండదు. లేనిపోని యుక్తుల తోఁ గాలముగడపక సదుత్తరము త్వరగ నొసంగుఁడు.

వ్రాసినది, ఆశుకవి చక్రవర్తి, శతావధాని కొప్పరపు వెంకటరమణకవి, [illegible] 4, నాలుగు, పంక్తులు 55 ఏబదియైదు ([illegible]).

ఇట్లు,
కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ,
శతావధాని.

[illegible] చదువరులారా:—

పై రిజిస్టరుత్తర మెందుకుఁ బుట్టినది, ఎందుకేమిటి సోదరులు

ఉట్టల మాకు వాదులుగఁ దెచ్చిన తావక తారతమ్య సం
ఘట్టిన మేరు మెత్తురు జగాన వచింపఁ గదమ్మ శాంకరీ. ౨౫౮

---

చేయనిపని చేసినట్లు మీరు ప్రకటించినందుకుఁ బుట్టిన దండు రా? అట్లు లేని వారిస్వహస్తలిఖితములగు నీక్రింది యక్షరములను దిలకింపుఁడు.

శ్రీరాములు.

4-4-13. కొవ్వరము. సంతమాగులూరు పోస్టు.

అస్మద్గురుమూర్తులైన బ్రహ్మశ్రీ రామకుగు రామకృష్ణశాస్త్రులవారి పాదపద్మముల సన్నిధికి.

భవత్ప్రియశిష్యుఁడు. నమస్కారపూర్వకముగా వ్రాయు విజ్ఞప్తి.

"...వృథాహంకార లాంఛనంబగు వేంకటశాస్త్రిగారి మీసమును దీయించెదమని ప్రతిజ్ఞ సేయునప్పుడును. "సింహమున్నదని తెలిసియుఁ గొవ్వరపుఁగవులు కాకినాడకు వచ్చెదరా!" అనిన తిరుపతిశాస్త్రిగారు నివసించిన కాకినాడకుఁ జను నప్పుడును, కాకినాడలోఁ బలుసభ లొనర్చి, సామర్థ్యమున్న యెడల మాకు శత్రువుఁడగువాఁడువచ్చి మమ్మెదిరించి జయింపవలసినదని ప్రతిజ్ఞాపద్యములం జెప్పునప్పుడును, ఎంతకతినముగాఁ గాలుద్రవ్వినను నెదుటికివచ్చి శత్రువులు మారొక్కనమిచేఁ గాకినాడలో సుకవిపండిత శిఖామణులు సంతసించి స్తుతింప జయస్తంభము నాటి వచ్చినప్పుడును......"

చిత్తగింపుఁడు.

ఇట్లు, భవత్ప్రియశిష్యుఁడు,
కొప్పరపు వేంకట సుబ్బరాయశర్మ, శతావధాని.

☞ దీనివలనఁగాకినాఁడలో— తి॥ వెం॥ కవులఁబరాభవించినట్లు సోదరులు ప్రకటించుకొనుచున్నట్లు విస్పష్టమే యగునేని దానినే విపులముగాఁదెల్పు వీరివేరొక లేఖయొక్క నకలును బ్రచురించినమాకు సోదరులు రిజస్టరుత్తరము వ్రాయుటకర్థమేమో? విచారింపుఁడు, "ధర్మదేవత చేతనఁట? వీరఁట? ప్రోత్సాహపఱుపఁబడిరఁట?" "నాశ్లీలం కీర్తయేత్" "బుద్ధిః కర్మానుసారిణీ" శాంతం పాపం, ప్రతిహతమమంగళం, అస్తుస్వస్తి. సర్వే జనా స్సుఖినో భవన్తు".

గా నలవారు *తప్పనుడికల్పన లెల్లెడఁ జేయఁ బూని రెం
దేని యమార్గగాములకు దేవునివల్ల భయమ్ము గల్గునే. ౨౫౯

☞ చదువరులారా:—

పై నుదాహరించిన రిజష్టరుత్తరపుఁదుందుడుకుప్రసంగము వేమ వరావధానమునకుఁ జాలనిటీవలిది, ఇంకను నిట్టి వెన్నో జరగవచ్చును, ఇఁక నీచరితము ముగించుచుఁ జరిత్రాంశమునకు మాత్రము సంబంధించిన పద్యములు గొన్ని వేమవరావధానమునుండి యుదాహరింతును.

---

గా వినిపించిన పిదపనే చర్య జరుపవలెనని యెంచి ముందుపని ముగించి ప్రస్తుతము మేమాప్రయత్నములోనే యుండఁగా, మీరిజష్టరుత్తరమువచ్చినందున దానికి జవాబుగా నీయుత్తరము వ్రాయుచు సదరు విషయమై క్రమమైన చర్య జరుపఁబోవుచున్నామనికూడ నిందుమూలముగానే తెలియఁజేయుచున్నారము,

చిత్తగించవలెను.

(సమ్మతిని) (1) దివాకర్ల తిరుపతిశాస్త్రి, } శతావధానులు { బందరు,
(2) చెళ్లపిళ్ళ వెంకటశాస్త్రి, } { భైరవప్రస్సు.

15-9-13.

---

*ది 27-10-13 సం॥......

అయ్యా!

సోదరకవులు కొద్దికాలము క్రిందట మీకు వకరిజష్టరునోటీసును 24 గంటలలో జవాబు యివ్వవలసినదిగాను అట్లా యివ్వనియడ్ల మీమీద డామేజి తేవడమగునని సదరు నోటీసులో వుదహరించినట్టున్ను అందులకు మీరు సోదరకవులను క్షమాపణకోరినట్టున్ను మాచుట్టుప్రక్కల గ్రామాదుల్లో విశేషవాదుకకలుగజేశినారు అయినప్పటికి యిదివరలో నేను మిమ్ములను యెరిగివుండి మీసామర్థ్యతను గుర్తెరిగి యుండుటచే అందుల నిజానిజములు ప్రత్యేకంమీచేత వినగోరి వ్రాసినాను తక్షణం జవాబు వ్రాయించకోర్తాను. దివ్యచిత్తముకు తేవలెను

విధేయుడు, పసుమర్తి లక్ష్మీకాంతం వ్రా॥లు.

ఇందుఁ దుట్టతుదనుదాహరింపఁబోవు శ్లోకము, నాఁటి యవధానమునకు మంగళశ్లోకమని యెఱుఁగఁదగు. ఈయవధానమునకు సంబంధించిన విశేషములు సమగ్రముగాఁ దెలియఁగోరువారు దానికై ప్రత్యేకించి యచ్చొయియున్న వేమవరాగ్రహారశతావధానమునందే చూడవలెను. దానివెల పోస్టేజీతో రు 0-14-0. ( ఇది 200 పుటలు గలది.)

## వేమవరాగ్రహార శతావధానము నుండి.

ఉ॥ చెన్నపురంబు చేసె నొక చెన్నఁడు, వేమవరంబు నేఁడ హా?
చెన్నపురంబుగాఁ దొడఁగెఁ జెన్నయగారియుదారతాప్తిచే
నెన్నియవధానముల్ సలిపి యేమిఫల? మ్మిట్టువంటి యన్నదానో
న్నతి యిట్టితృప్తియును నొండొకటన్ గన మో మహేశ్వరీ. ౧

శా॥ ఎందఱు పెద్ద లన్నలిపి? తెందఱపాదరజంబుచేత ని
మ్మందిరముల్ బవిత్రగరిమమ్మున నించితి? వెంతమంది నా
నందమునందు ముంచితివి? నవ్వులు గొంద ఱదేమొ కాని నీ
జెందఁగ నాడువారఁటి? యిసీ? యిసి? యోసిశతావధానమా ౨

ఉ॥ అన్నముకోస మామడల కామడ లేగెడికాల మన్ననో?
"సున్నయ వాళ్ళ"యయ్యె నినుఁ జూచుతలంపువఁ జేసి గాక యీ
యున్నతు లింద ఆట్టి క్రియ నొక్కటఁ గ్రిక్కిఱియంగ నేల? మా
యన్న? శతావధానమ? కృతార్థమవైతివి వేయు నేటికిన్. ౩

తే॥ గీ॥ "భాగ" పదమిప్పటికిఁ బుణ్యభాగియయ్యె
"చెన్న" పదమిప్పటికి నుతిం జెన్నుమీఱె
వేమవర మగ్రహారంబు హేమవరపు
నగ్రహారంబుగా మాఱె నఁట? యిపుడు. ౪

చ॥ జననపులగ్నమం దలరు శక్రగురుండును శుక్రుఁడున్ గుజుం
డును నలరాహువున్ నను ఘనుం బొనరించెడినంతె కాని యే
నును నొకసత్కవీశ్వరుఁడనో "తిరప" య్యయు నొక్క పేటి యో
యన ఘకవిగ్రహంబులు గ్రహంబులు గవ్వను జేయువజ్రమున్. వెం॥ శా॥

సీ॥ మరల నెప్పుడు మీరు మాకు లభింతురో వందనంబయ్య ? విద్వాంసులార ?
మంచిపద్యములు క్రమ్మఱ విను టెన్నఁడో జోహరులయ్య? రాసుకవులార?
కన్నులు చల్లఁగాఁ గాంచుటే నాఁటికో మీకుఁ బ్రణామముల్ మిత్రులార ?
మరల నెన్నఁడు కనంబడుదునొ మీకన్నిరు మీకు మంగళ మోయమిత్రులార ?
తే॥ గీ॥ మరల మాచేత శారదమాన్యచరిత, ఉరక యెన్నఁడు చేయించునో? శతావ
ధానమో? దివ్యకీర్తి కథావిధాన్రవ, ధానమో? నీకుఁగూడ వందనములమ్మ.

సీ॥ విశ్వజనీనుండు వితతభాగ్యుండు భా, గ్యనవ్వాయుండు చెన్నయ్యగారు
పరమసాధువు మేళ్ళచెఱువు వంశాంభోధి, చంద్రముఁడైన శేషయ్యగారు
యజ్ఞోపవీతాన్వయాంభోధి కబ్జుండు, వేంకటాచలపతి వితతయశుఁడు
భాగి వంశ్యుండు వెంపటివారికిం దత్తుఁడైన వెంకటసుబ్బయార్యవరుఁడు
గీ॥ అశ్వమేధంబొ? రాజసూయంబొ, సత్ర, యాగమో నాఁగ నవధానములవఱిచిరి
సాటి వెల్నాఁటివారును సాటిలేని, వారు వారికిఁగూడ నావందనములు. తి॥ శా॥

గీ॥ ఇతరశాఖయటంచు లోనించుకేని, భేదమెన్నక ననుఁ దద్దఁ బేర్మిఁ జూచి
గౌరవించినమి మ్మెన్నఁగలనె యేను, సర్వనములార? వెల్నాఁటిచతురులార?

చ॥ తిరుపతి యేస్గ గాఁగ గడిదేఱిన శిష్యు లనేకు లొప్పనైఁ
బోరిఁబోరి రోఁజుచుఁ దనదుపాంతను బెబ్బులిపిల్లలట్టు చూ
పఱులకు దోఁపఁ గేల నొకపాటిది బెత్తముఁబూని వేంకటే
శ్వరుఁడు శతావధానమను "సర్కసుఁ" జూపెడిఁ జూడుఁడో బుధుల్.

వెం॥ శా॥

చ॥ తిరుపతి వ్యాఘ్రమై బయలుదేఱిన శిష్యులు గున్న యేస్గులై
వఱలఁగఁ దేఱఁగాఁ దగినవారలు బెబ్బులిపిల్ల లెల్లమా
రురు కపికుర్కురమ్ము లయి తోఁచఁగ వేంకటశాస్త్రి వీరకే
సరిగ శతావధాన మను "సర్కసు" చూపితివమ్మ శాంకరీ. తి॥ శా॥

సీ॥ "కాసుచొప్పన నింతగా నార్జనము చేసి; తెంత దెచ్చినను మాకెంత లేదు
గడగడలాడి నిక్క గానఁగా నేతెంత్రు, గానఁబోయిన మమ్ముఁ గాంచు టరిది
ప్రీతితో నీకు సర్పింతురెంతైన మా, కింత యిచ్చియు నెంతు రెంతొ యనుచు
సేవించి నీకు వాంఛితములిత్తురు సేవ, గావించినను మాకుఁ గాసు నీరు"

గీ॥ అనుచు మును పెన్నఁడో యాడినట్టి మాట, కన్యకాత్వంబు గూర్చి సిగ్గందఁజేసి
తైన నేమయ్యె నీయుత్సవాదికమ్ము, లీవ కైకొమ్మ? యో వెంకటేశ దేవ.

ఉ॥ కాశికనుండి యొండెడకుఁ గాల్గదలింపని వానిఁ గాశివి
శ్వేశుని దెచ్చి యొక్కయెడ నింటికి దాపున నిల్పె నద్యశో
రాశి భవత్పితామహుఁడు ప్రాజ్ఞుఁడు; తిర్పతివేంకటేశ సూ
రీశుల నీవు తెచ్చుటది యేమి విశేషము చెన్నయాగ్రణీ. వెం॥ శా॥ ౧౨

ఉ॥ ఎవ్వరునిన్ గ్రహించిరో బుధేంద్రులు రాజులయొద్ద వారి పే
రివ్వసుధన్ జెలంగునటు లెంతయు నోమిన చెన్నయాదులం
దెవ్వధినేనిఁ బేర్మి భరియించుచు మేల్ సిరినింపుమమ్మ మా
యవ్వరో? యింక మాకు నెలవా! యల వేమవరాగ్రహారమా. తి॥ శా॥

సీ॥ ఎక్కించితివిగదా? యేగుచో మేనాల, సర్వతస్సుమవృష్టి సంకులముగ
పట్టించితివిగదా? బ్రహ్మరథముఁ గూడ, స్వస్తివాచనపురస్సరముగాఁగ
కల్పించితివిగదా? గాఢోత్సవమ్ముల, వారాంగనాకదంబములతోడ
తాల్పించితివికదా? తలలపైఁ బాదర, జంబు నాబాలవృద్ధంబుగాఁగ
గీ॥ దురభిమానగ్రహావేశ ధూమధూపి, తాగ్రవయోజక గర్తపురాంతర స్థి
తాత్మవద్ధతిపత్త్రానుయాయి సుజన, సంకలిత నిత్యమూర్ఛ, ఆసనపుఁ జర్ఛ.

సీ॥ పాదరజం బానపడక, యూరక వంక, వంక దండము పెట్టువారు లేరు
"బ్రాహ్మణత్వం బూడిపడ్డదే యాకసం, బందుండి" యనుకూళ్ల లెందు లేరు
భక్తిసారస్యప్రపత్తిసత్త్రాలిత్త్వ, మలవడకున్న బ్రాహ్మణులు లేరు
పరమపాతివ్రత్య పరిపాకగరిమఁ జె, న్నొనలారకున్న గేహినులు లేరు
గీ॥ ఒక్కపద్ధతి దౌర్భాగ్యముండెఁగాక, అదియు పానదుపాయ సంపదకు నెడుగు
దూరగులెఱుంగరకట? నీసారసుకవి, వినుత సుఖధామ యో కొండవీటిసీమ.
వెం॥ శా.

సీ॥ ఏయింటఁ జూచినఁ బ్రాయికంబుగఁ జేతి, జిడ్డువాయని మంచిగడ్డపెరుగు
ఏపాలంబరసినఁ గాపుటాంధ్రుడు చరించు, పలుకఁ బాటిన చాలు పంటచేలు
ఏబావిఁ గనుఁగొన్న 'సేబా'నఁగఁ జాలు, నమృతంబుతోఁ బోరునట్టి నీరు
ఏగ్రామ మేగిన నింతలంతలు గూడఁ, బదధూళిఁ దలఁ గోరు భక్తివారు

గీ॥ బ్రహ్మశబ్దంబుదాల్చిన పాదుదండి, కుజనులను దాల్చు పద్ధతికొలకుఁగా నె
పాదరక్షలు దాల్పంగవలయు నీదు, విధ మెఱిఁగినామ యో కొండవీటిసీమ.

తి॥ శా॥

☞ ఆయాపద్యము లేయేసందర్భమునఁ జెప్పఁబడినవో యాయాసంద
ర్భములకు, వేమవరావధానము చూడఁదగు.

మంగళశ్లోకః

శ్లో॥ కళ్యాణం రసనే నమ స్సుకవితే భద్రం పదేభ్యో నమ
స్సారస్వతః కాల్పనికోత్తమాయ మనసే వృత్తాని వో వందనం
అస్తు స్వస్తి శతావధానవిధయే విద్వజ్జనా యాంజలి
ర్వ్యక్తాయుక్త వివేకినే సుకవితా సారస్య సంగ్రాహిణే. ౧౭ తి॥ శా॥

గద్య

ఇది శ్రీకింకవీంద్రఘటాపంచానన, విద్వత్కవి, బాలకలానిధి, బాలసరస్వతి
శతావధాని, తిరుపతి వేంకటేశ్వరసంకలితంబును
అనృతపర్వత దంభోళినమ్మితంబును నగు
గుంటూరిసీమ, ఉత్తరరంగము
సంపూర్ణము.

శ్రీపరదేవతార్పణమస్తు.



# తప్పొప్పుల పట్టిక.

## ముఖ్యముగా దిద్దవలసినవి.

| పుట. | పం. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 13 | 20 | పంక్తిపూర్తిగా దొలఁగించి 19 వ పంక్తితుదను, కే, అను నకారము, రో, అని చదువఁదగు. | |
| 27 | 14 | అగు | అగ. |
| 30 | 4 | ఉద్దడు | ఉద్ధతు. |
| 31 | 26 | గుపఁడగ | గనుపడఁ. |
| 32 | 4 | ఉవ్వెత్తుకా | ఉవ్వెత్తుగా. |
| 41 | 13 | జయిం | పయిం. |
| 68 | 1 | చుఁబండ | చెబండ. |
| 68 | 16 | దస్భ | దర్భ. |
| 68 | 20 | బాబు | బాటు |
| 71 | 6 | చూర్ణాల | చూర్ణాల. |
| 72 | 17 | హాషా | భాషా. |
| 75 | 9 | మయ్యెసో | మయ్యెనో. |
| 102 | 2 | గలఁగ | గలంగ. |
| 103 | 16 | హేహాబు | హేబు. |
| 103 | 25 | భీషా | భీష్మ. |
| 105 | 1-3 | పంక్తులలోని, శ్లోకము, సీసము, ఇవి కాశీకృష్ణాచార్యులవారి వారివని యెఱుఁగఁదగు. | |
| 111 | 16 | సత్వ | స్వత. |
| 112 | 7 | వ పంక్తి, సీసపద్యము తుదివఱకును గల భాగము, జానపాటి పట్టాభిరామశాస్త్రులవారిది, సమాప్తి ద్యోతకమగు—ఇట్టిగి టు, సీససమాప్తియందుఁ జూచుకోఁదగు. | |
| 112 | 26 | వేకాదు | వేఱు కాదు. |
| 116 | 8 | వచ్చినే | వచ్చిన్నే. |

ఇంతవఱకు స్థూలదృష్టిచేఁ బ్రధాన గ్రంథభాగమునఁ జూపిన దిద్దుబాట్లు, గీటుక్రిందఁగూడ నిట్టిస్వల్పలోపములు గలవు, సవరించుకొనఁగోరెదము, ద, డ, న, స, ప, వ, ~, ఆ, ఁ, ం లోనగు స్వల్పవ్యత్యాసములు మీరే సవరించుకొనఁగోరెదము, మఱియు 52-101, పుటలలోని, స్వాగతపద్యములు చదివిన వారెవరో బాలకులుగాని, రచయితమాత్రము, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి యని చదువరు లెఱుఁగుదురుగాక.

నుత్తరములలో నొకటి రెండిట నుదాహరించెదము.

"యీ... రావుయిదివరకుతమనోటీసులోనికివచ్చినవాడె. యీతడు మాపల్లెటూళ్లలో మిగుల గప్పాలుకొట్టుచూ వారనగనెంత వీరనగ నెంతయనుచుండును. ఇట్టివీనికి నేటికితగిన ప్రాయశ్చిత్తము జరిగినది. యీసంగతి పత్రికాముఖమున నెల్లరకు నెఱిగించుట సర్వోత్తమమని నాయభిప్రాయము ... పట్టాభి రామశాస్త్రిగారు యిట్టివిషయములలో శ్రద్ధపుచ్చుకొనరు. అనేక పిచ్చిపత్రికలీకాలమందు ఓంకారం గురవరాజు మొదలగువారి పిచ్చివ్యాసములచే నిండుచున్నను ... అభినవసరస్వతి సాహసింపకున్నందులకు చింతిల్లుచున్నవారము. యీ గాథను..తమ గుంటూరు సీమయందుగాని ప్రచురింప బ్రార్థించుచుచున్నాను. చేపూరి లక్ష్మణకవి 6-2-14

---

"చింతామణిరాజగోపాలం వ్రాసుకున్న విజ్ఞాపన ......ప్రస్తుత కాలమున గాకవులెందరో తమయశస్సునకు లోటుగలిగింపనున్నందని నోటికివచ్చినయట్లు పత్రికలలో గీకుచున్నారు అట్టిపిచ్చివ్రాతలనేని చెరుగనిచ్చుటంత మంచిదిగాదనుట జగద్విదితమే కదా. కానసటువంటి తప్పుడువ్రాతలకు మీరు జవాబు నొసంగుట సమంజసము కాదు గనుక నన్నుబోట్లందులకు తగియుండురుగదా? యీసంగతి నరిగియో యెఱుగకయో పట్టాభిరామశాస్త్రిగారే దేని వ్యాసమునుగాని, పద్యములనుగాని, సహేతుకముగ వ్రాసి పంపినను బ్రచురింపకమిన్నకొనుచున్నారు. అందుచే 'హితకారిణి, మొదలగుపిచ్చిపత్రికలకు జవాబులు రాక నిలవయున్నవి. యింతయేల యీమధ్య......గారికి ... వలన కలిగిన పరాభవమును క్లుప్తముగా వ్రాసిపంపుకొనియున్నాను. అదియే మగునో తెలియదు...," చింతామణిరాజగోపాలం 14-1-14

ఉ॥ వానిది నోరు గాద యలవానిది నాల్క-యుఁగాద, తోఁచిన
ట్లైనరుఁడే నసత్యములనే నెగడించును, యట్టివాఁడు శ్రీ
జ్ఞానిస్వనామ మూనినను జందన మూనిన రాసభంబె దూ
రానఁ బరిత్యజింతు రలవారియనకానినుడుల్ బుధాగ్రిణుల్. ౫

ఉ॥ ఉన్నది యున్నయట్టులుగ నోపిక మీఱ లిఖింతు మంబరో!
కన్నపుదొంగ వ్రాఁతలప్రకారము నోటికి వచ్చినట్లుగాఁ
బన్నము, బన్న మాగిలుకువారియనకాండ్రశిరాన నుంచి వి
ద్వన్నుత మైనమార్గమునఁ బంపెడిభారము నీది యీదెసన్. ౬

(త్రిశంకుస్వర్గము)

చ॥ అతనిని యోగి యందు రెవఁ డల్లవసిష్ఠగవీస్రవంతికై
మతి చెడి పోరి యోడి మతిమత్తముఁడై తప మాచరించి బ్ర
హ్మత యొక కొంత గాంచె నలయాతఁడె గాధిజుఁ డాతఁ డిచ్చె స్వ
ర్గతి నొకరాజసూతికి సురప్రభుఁ డొప్పమి కాగ్రహించుచున్ ౧

ఉ॥ గడ్డము మీసముల్ పెరిఁగి గాధిజుఁ జేయవు వేని నేని యా
చెడ్డమునీశ్వరుం డొకని శ్రీవతియన్నను జేర్పఁ బోయి తాఁ
బడ్డ పరిశ్రమంబు భగవంతుఁ డెఱుంగుఁ గృతార్థుఁ డయ్యె నే?
అడ్డఁడె యింద్రుఁ డాపయికథాంశ మెఱుంగనివారు లేరుగా ౨

(పౌండ్రికవాసుదేవీయము)

ఉ॥ ఉండ్రు జగమ్మునందు మును పుండినయట్టులె యుండు వారు పె
క్కండ్రు, వృథాభిమానమునఁ గర్జ మెఱుంగక కొంత పెట్లొ చే
కొండ్రివమానమున్ దమకుఁగూడనిబల్ బిరుదుల్ ధరించి; యీ
*పౌండ్రకవాసుదేవుల నెవండు గణించు వచింపు మంబరో! ౧

---

(*హరివంశోత్తరభాగమునుండి.)

క॥...అనిమిషముని యిట్టులనియె నాతనితోడన్,, ఉ॥...నీదువాక్యముల్, మానవనాథ! యన్నియును మానుషము కానివి నాకుఁ జూడఁగన్,, క॥ హరిహా కఁడ? నీవెకఁడ?, హరికిని నీకును విశేషమరయఁగ భూభృ, త్ప్రమాణువుల